ఆంధ్రజ్యోతి
ప్రచురణ
www.navyaweekly.com

# నవ్య
వీక్లి

12-7-2017
₹:20

- తియ్యని వేడుక చేసుకుందాం!
- నూరుకట్ల పిశాచం పిల్లల కథలు ప్రారంభం



## సరదాగా....

### గేర్

మోక్షిత్ కంపెనీ పనిమీద కొత్తగా కొనుక్కున్న కారులో జలంధర్ బయలుదేరాడు. ఒక్కరోజులోనే జలంధర్ చేరుకున్నాడు. వెంటనే భార్యకు ఫోన్ చేసి క్షేమంగా చేరుకున్నట్లు చెప్పాడు. కంపెనీ పనులన్నీ పూర్తిచేసుకుని, తిరుగుప్రయాణం అవుతూ భార్యకు ఫోన్ చేసి చెప్పాడు మోక్షిత్. ఒక్కరోజులోనే జలంధర్ చేరుకున్నాడు కాబట్టి, తిరిగి రావడానికి కూడా ఒక్కరోజే పడుతుందని అతని కోసం ఎదురుచూస్తూ కూర్చుంది భార్య. ఒకరోజు కాదు మూడు రోజులు దాటిపోయాయి. కానీ మోక్షిత్ మాత్రం పత్తాలేడు. ఫోనేమో స్విచ్‌డ్ ఆఫ్! ఏం చేయాలో తెలియక ఆమె కంగారుపడుతూ కూర్చుంటే... నెమ్మదిగా కారుతో సహా మోక్షిత్ ఇంటిముందు ప్రత్యక్ష మయ్యాడు. అతని వాలకం చూసి ఏంటండీ... ఒక్క రోజులో రావాల్సింది... నాలుగు రోజులు పట్టిందేం? అంటూ కంగారుగా అడిగింది. దానికి మోక్షిత్ కోపంగా "అసలు ఈ కార్ తయారుచేసినవాళ్లు మెంటల్‌గాళ్ళలా ఉన్నారు. ముందుకు వెళ్ళడానికి 4 గేర్లు ఇచ్చారు. కానీ వెనక్కి రావడానికి కేవలం ఒక్క రివర్స్ గేర్ మాత్రమే ఇచ్చారు! అంటూ రుసరుసలాడుతూ ఇంట్లోకి వెళ్ళాడు.

### ఒక ప్రశ్న?

విరజిత్, తన స్నేహితులతో కలిసి థీమ్‌పార్క్‌కి వెళ్ళాడు. జెయింట్‌వీల్స్ ఎక్కాడు. రింగులు వేసి ఎంచక్కా హెడ్‌ఫోన్స్ గెలుచుకున్నాడు. గన్‌తో బెలూన్స్ షూట్ చేసి తన గురి ఎంత పదునుగా ఉందో పరీక్షించుకున్నాడు. అలా అన్నీ చూస్తూ వెళుతుండగా ఒక బోర్డు అతన్ని ఆకర్షించింది. బోర్డుపై 'గన్‌కి దొరక్కుండా నిలబడగలిగినవాడే విజేత' అని పెద్దపెద్ద అక్షరాలతో రాసి ఉంది. బహుమతి మొత్తం కూడా కాస్తంత పెద్ద సంఖ్యే ఉంది. అదేంటో తేల్చుకొని తన సత్తా నిరూపించుకోవాలనుకున్నాడు విరజిత్. లోపలకు వెళ్ళాడు. అతను లోపలకు వెళ్ళగానే తలుపులు మూసేశారు. లోపల మొత్తం వందమంది ఉన్నారు. గేమ్ నిబంధనలను వినిపించాడు కార్యక్రమ నిర్వాహకుడు. అందుకనుగుణంగా ఎవరికి ఇష్టమైన నెంబరు వారు తీసుకోవచ్చునని చెప్పేసరికి అందరూ ఎగబడి మరీ తమకు కావాల్సిన నెంబరు ఎంచుకున్నారు. గేమ్ మొదలైంది. అందరూ గుండ్రంగా నిలబడ్డారు. ఆటలో భాగంగా ఒకటో నెంబరు వ్యక్తి చేతికి గన్ ఇచ్చారు. ఆ మొదటి వ్యక్తి తన పక్కనున్న వ్యక్తిని షూట్‌చేసి, ఆ పక్కనున్న వ్యక్తికి గన్ పాస్ చేయాలి. అంటే మూడో నెంబరు వ్యక్తికి గన్ చేరుతుంది. ఇప్పుడు ఆ వ్యక్తి కూడా తన పక్కనున్న వ్యక్తిని షూట్ చేసి, ఆ పక్కనున్న వ్యక్తికి గన్ ఇవ్వాలి. ఇలా చివరికి ఒకే వ్యక్తి మిగిలేవరకూ షూట్ చేస్తూ వెళ్ళాలి. చివరగా ఏ నెంబరు వ్యక్తి సజీవంగా మిగులుతాడో అతడే విజేత. నెంబరు తీసుకునే సమయంలోనే విరజిత్ లెక్కలు వేసి తన గణితాపాటవానికి కాస్తంత పదునుపెట్టాడు. దాంతో విజేతగా నిలిచాడు. ఇక్కడ ప్రశ్న ఏమిటంటే విరజిత్ ఏ స్థానంలో నిలబడ్డాడు? ఈ ప్రశ్నకు సమాధానం వివిధ రకాలుగా రాబట్టవచ్చు. మీరు కూడా మీకు తెలిసిన పద్ధతిలో ప్రయత్నించి సమాధానం రాబట్టండి.

సమాధానం
73.













8

## తియ్యని వేడుక చేసుకుందాం !

**చాక్లెట్ తింటే ఒంటికి మంచిదని కొందరంటారు. లావైపోతారని మరికొందరు అంటారు. చాక్లెట్‌ది మూడువేల ఏళ్ళ చరిత్ర. అది ఒకప్పుడు ధనవంతులకే పరిమితం. స్పెయిన్‌దేశంలోని చాక్లెట్ రహస్యం అసలు ప్రపంచానికెలా తెలిసింది ? జూలై 7 వరల్డ్ చాక్లెట్ డే విశేషాలు మీ కోసం**

52

### మౌనం సర్వార్థ సాధనం

మౌనం నోటికి నాలుకకు సంబంధించిన వ్యవహారం కాదు. మౌనం ఓ తపస్సు. మౌనం ఓ వ్యక్తీకరణ మార్గం. మౌనాన్ని మించిన కమ్యూనికేషన్ లేదు!

72

### నూరుకట్ల పిశాచం కథలు (పిల్లలకు ప్రత్యేకం)

పిశాచ మహాశయా! మహారాణి మనస్ఫూర్తిగా కథ వింటానంటోంది. నీవు ఇక నా నోట కథ పలికించు అన్నాడు ఆ యువకుడు. పిశాచం వెంటనే కథ చెప్పడం ప్రారంభించింది.

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: పూజాహెగ్డే
ఫొటో: గోపీకృష్ణ


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### కమీషన్

ఆహ్వానాన్ని అందుకుని అమెరికా వెళ్ళాడు మన రాజకీయనాయకుడు. అక్కడి రాజకీయనాయకుడు మన వాణ్ణి వాళ్ళింటికి విందుకు పిలిచాడు. విందుకి వెళ్ళి ఆ రాజకీయనాయకుని ఇల్లూ, తోటా అన్నీ చూసి, మన వాడు అడిగాడిలా.

"మీకొచ్చే జీతాలు తక్కువంటారు కదా, ఆ జీతంతో ఇంత ఇల్లూ, తోటా ఎలా సంపాదించారు?"

సమాధానంగా మనవాణ్ణి కిటికీ దగ్గరగా తీసుకుని వెళ్ళాడు అక్కడి రాజకీయనాయకుడు.

"దూరంగా మీకేం కనిపిస్తోంది?" అడిగాడు.

"ఏదో నది ఉంది. ఆ నది మీద వంతెన ఉంది" చెప్పాడు మనవాడు.

'అదే...ఆ వంతెన మీద టెన్ పర్సెంట్ కమీషన్ తీసుకుని...." అని నవ్వాడు అమెరికా రాజకీయనాయకుడు.

"తెలివైనవారే" అన్నాడు మనవాడు. కొద్దిరోజులు గడిచాయి. అమెరికా రాజకీయనాయకుడు ఇండియాలో మనవాడింటికి విందుకి వచ్చాడు.

మనవాడి ఆస్తిపాస్తులు చూసి ఆశ్చర్యపోయాడు. అడిగాడిలా.

"మీ జీతాలకీ, ఇక్కడి రూపాయలకీ ఇంత బిల్డప్ ఉందా? మీ ఆస్తిపాస్తులు చూస్తోంటే కళ్ళు తిరిగిపోతున్నాయి. ఇదెలా సాధ్యం?"

"ఎలా" అంటే రండంటూ అతన్ని ఇంటి కిటికీ దగ్గరగా తీసుకుని వెళ్ళాడు మనవాడు.

"దూరంగా మీకేం కనిపిస్తోంది?" అడిగాడు.

"ఏదో నది ఉంది."

"దాని మీద వంతెన కూడా ఉంది. సరిగ్గా చూడండి."

"లేదే! వంతెనలాంటిది ఏదీ లేదు" గట్టిగా చెప్పాడు అమెరికా రాజకీయనాయకుడు.

"ఉండదు. హండ్రడ్ పర్సెంట్ కమీషన్ తీసుకునే ఇదంతా..." అని నవ్వాడు మనవాడు.

### అతితెలివి

జ్వరంగా ఉండడంతో స్నేహితుణ్ణి కలిశాడతను.

"ఓ మంచి డాక్టర్ ఉంటే చెప్పరా వెళ్ళి కలుస్తాను." అడిగాడు. పేరు చెప్పి, వెళ్ళి కలవమన్నాడు స్నేహితుడు. తర్వాత చెప్పాడిలా.

"మంచి డాక్టరే కాని, కొంచెం ఫీజెక్కువ. ఫస్ట్‌టైం అయిదువందలు తీసుకుంటాడు. తర్వాత నుంచి వందే."

సరే అని డాక్టర్ దగ్గరకు బయల్దేరాడతను. డబ్బుకి కక్కుర్తిపడి, కొంచెం తెలివి ఉపయోగించాడు.

"నేనింతకు ముందొచ్చిన పేషెంట్‌నే సార్! అయినా జ్వరం తగ్గలేదు." చెప్పాడతను.

"అయితే పాతమందులే మరోవారం వాడి చూడండి! కౌంటర్లో వందకట్టి వెళ్ళండి." చెప్పాడు డాక్టర్.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 14 సంచిక: 19
12-7-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజి

# పులి

అమ్మతల్లి పండుగ. అగ్రహారం అంతా సందడిగా ఉంది. పొద్దున పొద్దునే పిల్లలంతా ఆలయానికి చేరుకున్నారు. పులివేషాలకోసం చూస్తూ కూర్చున్నారు. ఈచోటు నాదంటే ఈచోటు నాదంటూ గొడవ పడుతున్నారు. ఎక్కడో దగ్గర కూర్చోండర్రా! ఎక్కడ కూర్చున్నా పులులు కనిపిస్తాయి అని పెద్దలు చెబితే సర్దుకుంటున్నారు. ఘటాలు వస్తున్నాయి. గంటలు మోగుతున్నాయి. ప్రసాదాలందుతున్నాయి. అరటిపళ్ళూ, మామిడిపళ్ళూ పంచుకుని తింటున్నా ఆనందం లేదు పిల్లలకి. పులివేషాలు రావాలి! ఆనందించాలి అన్నట్టుగా ఉన్నారు. ఎవరైనా అనారోగ్యానికి గురైతే, వాళ్ళు లేచి తిరగడం కష్టం అని తెలిస్తే, ఆ ఇంటివాళ్ళు అమ్మతల్లికి మొక్కుకుంటారు. తల్లీ! నీదయ చూపించు! ఆరోగ్యం ప్రసాదించు. పుంజుకుని మావాళ్ళు పులిలా లేవాలి. లేస్తే వాళ్ళచేత నీ వాహనం పులివేషం వేయిస్తాం. నీ గుడిచుట్టూ పండగపూట ముమ్మారు ప్రదక్షిణ చేయిస్తాం. నీ ఊరేగింపు ముందు నడిపిస్తాం అంటారు. మొక్కు ఫలించి లేచి తిరిగితే పులివేషం తప్పదు. ఆ వేషానికి కులం, మతం లేదు. ఆడామగా తేడా లేదు. చిన్నాపెద్దా భేదం లేదు.

పులివేషానికి పెట్టిందిపేరు నకాసిబ్రహ్మం. ఎలాంటివ్యక్తి అయినా బ్రహ్మం చేతిలో పులికావాల్సిందే! అతను రంగులు వేసి రూపు దిద్దితే పులిని చూస్తున్నట్టే ఉంటుంది. మొలకి తోకపెట్టి, ముఖానికి పులిమాస్క్ తగిలించి, కాలికి గజ్జెకడితే ఎంతటివారైనా ఊగిపోవాల్సిందే! పులిఆట ఆడాల్సిందే! వారం రోజుల్లో పండుగ అంటే ఆ వారం రోజులూ బ్రహ్మానికి తిండీ నిద్రా ఉండదు. పులిమాస్క్‌లు తయారు చెయ్యడంలోనే అతనికి రోజులు గడచిపోతాయి. పులితయారీని, ఆటనూ తాతలూ తండ్రుల దగ్గర నేర్చుకున్నాడతను. చింతగింజలపొడి, కర్రపొట్టుతో పులిమాస్క్‌లు తయారు చేస్తాడు. తుదిమెరుగ్గా కాగితాన్నీ, వస్త్రాన్నీ ఉపయోగిస్తాడు. రంగులద్ది, పొనికతో చేసిన చెవులు తగిలిస్తే... మాస్క్ అచ్చం పులితలలాగే ఉంటుంది. మాస్క్‌కీ, వేషానికీ, డప్పుకీ మొత్తం వెయ్యినూటపదహార్లు చెల్లించాలి బ్రహ్మానికి. దక్షిణచెల్లించి, దండంపెడితే ఆటకి అనుమతి ఇస్తాడతను. చిందేస్తూ వెళ్ళిపోవచ్చిక.

తొలిరోజుల్లో నూటపదహార్లే చెల్లించేవారు. తర్వాత అయిదువందలు అయింది. ఆ తర్వాత ఏడువందలయాభై, ఆపై వెయ్యిరూపాయలన్నాడు. ఇప్పుడు వెయ్యినూటపదహార్లు వసూలు చేస్తున్నాడు బ్రహ్మం. పులివేషం బాగా ఖరీదన్నది ప్రచారం జరిగింది. దాంతో మావల్ల కాదంటే మావల్లకాదంటూ అగ్రహారం వెనక్కి తగ్గింది. అగ్రహారం వెనక్కి తగ్గడంతో కోపం వచ్చింది బ్రహ్మానికి. రోగానపడి ఆసుపత్రికి లచ్చలకి లచ్చలు చెల్లిస్తారుకాని, అమ్మకీ, నాకూ ఎయ్యినూటపదార్లివ్వ లేరేం? రంగుకీ, డప్పుకీ, నేనుపడ్డ కట్టానికీ ఆ మాత్రం సెల్లించకపోతే అగ్గురోరంలో ఇకపైన పులే ఉండదు. తల్లికి కళే ఉండదు అన్నాడు. ఏడాదికి ఓ రోజు వేషాలు కట్టేవాడికే అంత ఇదిగా ఉంటే, కట్టించుకునేవాడికి ఇంకెంత ఇదిగా ఉండాలి? వేషం వద్దంటే వద్దనుకున్నారంతా. మూఢనమ్మకం అండి. డాక్టర్లకే అంతుచిక్కని రోగం తల్లికి చిక్కుతుందా? పులివేషం వేస్తే పోతుందా? నమ్మకండి ఇలాంటివి. విజ్ఞానసమితి వీరవిహారం చేసింది. అదే అదనుగా అగ్రహారం చెవిన ఇల్లుకట్టుకుని పోరింది. దానాదీనా ఆ ఏడు పులివేషాలు కరువైపోయాయి. మధ్యాహ్నం అయింది. సాయంత్రం అయింది. ఆలయానికి ఒక్కపులీ రాలేదు. పిల్లలకి పిచ్చెక్కిపోయింది. పులికావాలంటూ, రావాలంటూ ఒకటే గోల చేయసాగారు.

అమ్మవారి ఊరేగింపు తియ్యాలి. ఊరేగింపు తియ్యాలంటే ముందు పులులు ఉండాలి. ఏవీ? పెద్దలంతా తలలుపట్టుకున్నారు. విజ్ఞానసమితివారు కలుగజేసుకోజూస్తే, నమస్కరించి వారిని వెనక్కి తగ్గమన్నారు. తరతరాల సంప్రదాయం. పులిని వద్దనుకుంటే పండుగను కూడా వద్దనుకోవాలి. ఎవరి బతుకుతెరువు వారిది. బ్రహ్మాన్నీ అతని జట్టునీ వెలివేయడం బాగా లేదు. పదండి అంటే పదండి అన్నారు. బ్రహ్మం దగ్గరకి వచ్చారు. ఊరేగింపు తియ్యాలి. పులులు కావాలి. నువ్వు అడిగినంతా ఇస్తాం. తీర్చిదిద్దు అంటూ కూర్చున్నారు. అయ్యలూ అంటూ పెద్దల్ని చూసి వణికిపోయాడు బ్రహ్మం. ఆలస్యం చెయ్యకు. కానీయ్ అన్నారంతా. తప్పదనుకున్నాడు. పెద్దలందరినీ పెద్దపులుల్లా తీర్చిదిద్దాడు బ్రహ్మం. దక్షిణ చెల్లించి దండంపెడితే దీవించి పంపాడు. డప్పులకి అనుగుణంగా చిందేస్తూ పెద్దలు ఆలయానికి వస్తోంటే పిల్లలంతా చప్పట్లు చరిచి పొంగిపోయారు. ఈలలూ, కేకలతో హోరెత్తిపోయారు. అగ్రహారం పులిలా పుంజుకొందప్పుడు.

నవ్య




## ఆన్‌లైన్లో పూజాసామగ్రి

బిజీలైఫ్‌లో పండగైనా పబ్బమైనా ఏదో మొక్కుబడిగా నామ్‌కేవాస్తేగా కానిచ్చేస్తున్నారు. ఆఫీసులకెళ్తూనో, ఇతరత్రా పనుల మీద వెళుతున్న పుడో గుడి కనిపిస్తే మనసులోనే మొక్కు తుంటారు. నమ్మకాలు ఎక్కువ ఉన్నవాళ్ళు ఇంట్లో దీపం పెట్టిగానీ బయటకు కదలరు. ఇంకాస్త భక్తి పరులయితే ఇంట్లో పూజలు, వ్రతాలు చేస్తుం టారు. అలాంటి సమయాల్లో సామగ్రిలో ఏదో ఒకటి మర్చిపోవటమో, తెలియకపోవటమో జరు గుతుంటుంది. ఒకవేళ అన్నీ గుర్తుండి, ఏమేం సామాను కావాలో తెలిసినా అన్నీ ఒక్కచోటే దొర కవు. షాపులవెంటా, మార్కెట్‌ల వెంటా తిరగాలి. తిరిగినా అన్నీ దొరుకుతాయన్న గ్యారెంటీ లేదు. సరిగ్గా ఇదే అంశాన్ని మార్కె ట్‌గా మలచింది ఫెస్టివల్ టైం డాట్ ఇన్. మామిడాకుల దగ్గరనుంచి జాకెట్ ముక్కల వరకు పూజా విధానంలో



ఏమేమి అవసరమో అవన్నీ మీకు సప్లై చేస్తుంది ఫెస్టివల్ టైం. స్వరూప్ ఈ స్టార్టప్ వ్యవస్థాపకుడు. మొట్టమొదటగా బర్త్‌డే కేకులను ఆన్‌లైన్లో సప్లయ్ చేసిన స్వరూప్ మార్కెట్ ట్రెండ్‌ను అర్థం చేసుకు న్నాడు. దాంతో ఫెస్టివల్ స్టార్టప్‌కు బీజం పడింది. దేవుడి సెంటిమెంటు ఉన్నంత వరకు తమ వ్యాపా రానికి ఢోకా లేదని ధీమాగా చెబుతున్నాడు స్వరూప్. ఆన్‌లైన్లో ఆర్డరిస్తే చాలు... పూజకు, వ్రతా లకు కావాల్సిన సామాను *24* నుంచి *48* గంటల్లో మీరు కోరిన చోటికి కోరిన ఐటమ్ తెచ్చి మీ చేతుల్లో పెడతారు. ఉదాహరణకు.. మీరు కొత్తిం ట్లోకి పోతున్నారనుకోండి. పూజా సామాగ్రి తెచ్చు కోవడానికి టైం లేదు. ఏది ఎక్కడ దొరుకుతుందో ఐడియా కూడా లేదు. అలాంటి పరిస్థితుల్లో ఫెస్టి వల్ టైం డాట్ ఇన్ మీద ఒక్క క్లిక్ చాలు.. జాకెట్ ముక్కల దగ్గర్నుంచి బెల్లం ముక్కల దాకా అన్నీ సంచీలో వేసుకుని వచ్చి ఇచ్చిపోతారు. మంగళ గౌరీ వ్రతమైనా, సత్యనారాయణస్వామి వ్రత మైనా, వరలక్ష్మీ వ్రతమైనా... కుంకుమ దగ్గర్నుంచి శనగల దాకా పూజకు కావల్సిన ఐటెమ్స్ అన్నీ ఆర్డర్ చేసుకోవచ్చు. గణపతి పూజ నుంచి దుర్గా పూజ వరకు అన్ని సామాన్లు ఆన్‌లైన్‌లోనే ఆర్డ రివ్వొచ్చు. ఒక్క పూజ సామానే కాదు బర్త్‌డే అయినా సరే.. కేక్ ఆర్డరివ్వొచ్చు. . కైట్స్, మాంజాలు కూడా దొరుకుతాయి. ఇండిపెండెన్స్ డే కోసం మువ్వన్నెల జెండాలు కూడా సైట్‌లో ఉన్నాయి. టెంపుల్ మేనేజ్మెంట్ సాఫ్ట్‌వేర్‌ని సరికొత్త ప్రోడ క్టుగా తీసుకొస్తున్నారు. ఇంకేముంది మీ ఇంట్లో ఏదయినా వ్రతం కానీ, పూజ కానీ చేయాలని ఆలోచిస్తుంటే పూజాసామగ్రి కోసం ఫెస్టివల్ టైం వారిని సంప్రదిస్తే సరి.

# మెయిల్ బాక్స్

### ఆధ్యాత్మికత నింపిన రథయాత్ర

జగన్నాథ రథయాత్ర వ్యాసం ఆధ్యాత్మికంగా ఉంది. ఈ విచిత్ర దారుశిల్పాలు ప్రపంచంలో ఎక్కడా లేవు. విజయవిలాసంలో అమితాబ్ గొప్పతనం ఒక్క పేరాలో ఇమిడ్చిచెప్పారు.

**—వాస్తురామచంద్ర, నెల్లూరు**

### బాగుంది

మార్నింగ్ కాఫీలో క్రెడిట్‌కార్డు జోకు చాలా బాగుంది. తీన్మార్ కార్టూన్స్‌లో పబ్లిక్‌టాయిలెట్ జోక్ చాలా బాగుంది. మనమీదేనర్రోయ్ కార్టూను చాలాబాగుంది. సీరియల్స్ అన్నీ ఆసక్తికరంగా సాగుతున్నాయి.

**—ఎస్.కె.చాంద్‌పాషా, ఖమ్మం**

### మొదటిపేజీ అత్యద్భుతం

నయనతార అందాలను ఛాయాచిత్ర గ్రాహకుడు గోపీకృష్ణ నయనానందకరంగా చిత్రీకరించాడు. పత్రి కకు ముఖచిత్రం ఒక హైలైట్. చిన్నకథ 'అబద్ధం' అత్యద్భుతం. చిన్నారి క్రోడీకరించిన 'ఇవన్నీ నిజాలు' శీర్షిక రెండోసారి చదివించింది. రాజ్‌తరుణ్ చిత్ర ప్రయాణం ఆసక్తికరం. జ్యోతిక, సూర్యలాగా జీవి తాన్ని సక్రమమార్గంలో నడిపించే నటులు అరుదు. వేణుగోపాల్ రాసిన కథకు కలుపుమొక్క పేరు చక్కగా సరిపోతుంది. సరసి కార్టూను మనమీదేన ర్రోయ్ నేటి పరిసరాల పరిస్థితిని చక్కగా చెప్పింది.

**—డాక్టర్ శివభూషణం, కర్నూలు**

### కలవరపరిచిన పంతులుగారి మేడ

60, 70 దశకాల్లో అన్ని వారపత్రికల్లో నిష్ణాతు లైన రచయితల కథలు రెగ్యులర్‌గా వచ్చేవి. పాఠ కుల్ని మైమరపించేవి. ఆ జ్ఞాపకాలను నేడు తలపు లోకి తెస్తున్న నవ్య వీక్లీ సంపాదకులకు అభినంద నలు. కొన్ని సనాతన కుటుంబాల ఆచారవ్యవహార చేష్టలకు సవాలు ఎల్.ఆర్.స్వామిగారి 'పంతులు గారి మేడ' కథ. 'నిర్గుణుడు' కథలో బాలు భవిష్యత్ జీవితం అగమ్యగోచరం. లక్షల ఆస్తి, ఇల్లు మీకే సొంతం అని ఎర చూపించినా ఆటిజం వ్యాధి గ్రస్థుడి తల్లీతండ్రి వలే వేరెవరూ చూడలేరు. కార్పొ రేట్ స్కూళ్ళలో ఎడ్మిషన్లు, చదువులతో ఎన్ని తలనొ ప్పులో తన కథలో హెచ్చరించారు రావులపాటి సీతా రాంరావుగారు. ఇద్దరు చిన్ననాటి స్నేహితులమధ్య ఇంటిమసీ, కుటుంబ వ్యక్తుల్లో అనుబంధం, వ్యాపారం ఎదుగుదల వారి ఉమ్మడి లక్ష్యానికి నిద ర్శనం శరత్‌చంద్రగారి కథ. నాలుగు కథలూ ఏకా గ్రత సడలకుండా చదివించాయి.

**—తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం**

### శర్మగారి ప్రత్యేకశైలి అదే

జూన్ 7వ తేదీ సంచిక మొదటిపేజి చదివాక ఈ ఉత్తరం రాయాలనిపించింది. ఎప్పుడూ మొదటి పేజి చిట్టికథలు చదవడం నాకు అలవాటు. చక్కని సందేశమేకాదు, చిన్న చిన్న వాక్యాలలోనే మనసును చిత్తడి చేసేంత ఆర్ద్రత ఉంటుంది. జగన్నాథశర్మగారి శైలి ప్రత్యేకత అదే. రాయుడుబాబునది చదివిన తర్వాత ఏదో రసానుభూతితో నా మనసు నీరైపో యినట్లైంది. 'గుండెను ఎవరో దొంగిలించినట్లనిపిం చింది' లాంటి వాక్యాలు మనసును పట్టేస్తాయి. చాలా రోజులు మనసులో మెదులుతూనే ఉంటాయి కూడా.

**—గోగినేని మణి విశాఖపట్నం**

### చేయి తిరిగిన రచయితలకు తీసిపోని బాలి 'ప్రయాణం'

ప్రయాణం సీరియల్ ఎంతో బాగుంది. బాలిగారు గొప్ప చిత్రకారుడుగా తెలుగువారికి పరిచయం. ఆయన ఒకటో అరా కథలు రాస్తారని తెలుసుగానీ, ఇంత మంచి రచనద్వారా బాలి తన ప్రతిభ చాటు




కోవడం సంతోషదాయకం. కలోఫ్ తన జీవన యానం, ఆమె కుటుంబం ఆర్థికంగా నిలదొక్కు కున్న విధానం, అత్తగారి ఉదాసీనత, అమెరికా వాతావరణ పరిస్థితులు వంటి అంశాలను ఎంతో చక్కగా కళ్ళకు కడుతున్నారు. యూదు సంప్రదా యాలు మన సంప్రదాయాలను పోలివున్నాయేమో అనిపించింది. యూదు భాషలో ఉపయోగించే అనేక పదాలను అర్థాలతో సహా తెలుగువారికి పరి చయం చేస్తున్నారు. బాలి వాక్యనిర్మాణం సీరియ ల్‌ను మాతో ఎంతో శ్రద్ధగా చదివిస్తోంది. కలోఫ్ అంతరంగాన్ని ఎంతో బాగా ఆవిష్కరిస్తున్నారు.

బాలిగారు కేవలం చిత్రకారులు మాత్రమే కాదు, చేయితిరిగిన గొప్ప రచయితలెవ్వరికీ తీసి పోరు. ఆ స్థాయిలో ఈ సీరియల్ రాస్తున్నారు. అందులో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. బాలిగా రికి నా అభినందనలు. మిగిలిన శీర్షికలు, వ్యాసాలు కూడా బాగుంటున్నాయి.

**—టి.సూర్యనారాయణ, చినముషిడివాడ, విశాఖపట్నం**

### ప్రతిఫలిస్తున్న ఆచారాలు

ప్రయాణం సీరియల్ అద్భుతంగా ఉంది. కొన్ని సన్నివేశాలు మన ఆచారాలనే ప్రతిఫలిస్తు న్నాయి. రాచెల్ కుటుంబం దుర్భర దారిద్ర్యంలో ఉండటం, ఎవరి సహాయం లేకపోవడం కలచి వేసింది. వారి కుటుంబం ఎప్పటికైనా సుఖపడు తుందా అనిపించింది. జీవితం ఒక యుద్ధం పోరాడు, జీవితం ఒక బహుమతి స్వీకరించు, అంటూ సాగిన జీవితబోధ చాలా నచ్చింది. జీవితాన్ని అందాలమయం, ఆనందమయం చేసుకోవడానికి ఒకరోజు కేటాయించడం అనే ఐడియా బాగుంది.

**—శాండీ, కాకినాడ**

# క్లాస్‌గా అమ్ముకుంటున్నాడు!

ఏదైనా హోటల్‌కో లేక రెస్టారెంట్‌కో వెళితే వెయిటర్ వచ్చి ఆర్డర్ తీసుకుని కావల్సినవి పట్టుకొస్తాడు. ఇక బస్టాండ్, రైల్వే స్టేషన్‌లాంటి చోట్ల మనదగ్గరకే వచ్చి తినుబండారాలు అమ్ముకునేవారిని మనం చూస్తూనే ఉంటాం. కానీ ఇతను అలాంటి ఇలాంటి వెయిటర్ కానే కాదు. ట్రాఫిక్‌లో తినుబండారాలు అమ్ముతాడు. అలాంటప్పుడు స్ట్రీట్ వెండర్ అని పిలవచ్చు కదా వెయిటర్ అనే ఎందుకు పిలవడం... అందులో వింతేముందీ? అనుకుంటున్నారా. అయితే ఇది చదివేసేయండి!

బ్రెజిల్‌కి చెందిన అయిల్టన్ మాన్యుయెల్ దా సిల్వా అందరికన్నా భిన్నమైన వెయిటర్. మంచి డ్రెస్సుతో పాటు టై, షూ వేసుకొని రోడ్లపై తినుబండారాలు, కూల్‌డ్రింక్స్ అమ్ముతుంటాడు. అందుకే అతన్ని ముద్దుగా అక్కడి వారు ట్రాఫిక్ వెయిటర్ అని పిలుచుకుంటారు. అయితే రోడ్లపై తినుబండారాలు అమ్మకోడానికి అంత నీట్‌గా సూటుబూటు వేసుకోవాల్సిన అవసరం ఏముంది అనుకుంటున్నారా? అందుకు తగిన కారణం ఉంది మరి. అయిల్టన్ మాన్యుయెల్ దా సిల్వా వయసు 43 సంవత్సరాలు. ప్రతిరోజు ఉదయం 5గంటలకు నిద్రలేస్తాడు. తన దగ్గర ఉన్న ట్రేలో పాప్‌కార్న్, చిప్స్‌లాంటి స్నాక్స్, కూల్‌డ్రింక్స్, వాటర్‌బాటిల్స్ సర్దుకుని తెల్లచొక్కా, నల్లప్యాంటు వేసుకుని టై కట్టుకుని నీట్‌గా ఏడింటికల్లా నగర వీధుల్లోకి వెళ్తాడు. ఇక ట్రాఫిక్‌లో వాహనాలు నిలవగానే తినుబండారాలు, కూల్‌డ్రింక్స్ అందరికీ అమ్ముతుంటాడు. ఇలా రెండేళ్లుగా క్లాస్‌గా అమ్ముతూ ఈ వెయిటర్ అక్కడ తెగ పాపులర్ అయిపోయాడు. అందుకే అందరూ ఇతన్ని స్ట్రీట్ వెండర్ అని కాకుండా ట్రాఫిక్ వెయిటర్ అని ముద్దుగా పిలుచుకుంటారు.



### క్లాసిక్ టచ్

ఈ ట్రాఫిక్ వెయిటర్ వృత్తిలోకి రాకముందు ఇతగాడు అక్కడ ఉండే ఒక ఫ్యాక్టరీలో పనిచేసేవాడు. కానీ 2015లో అతను ఉద్యోగం కోల్పోవడంతో కొత్త ఉద్యోగం కోసం చాలాచోట్ల తిరిగి, అప్పుల పాలయ్యాడు. అప్పటికే అతని కుటుంబ ఆర్థిక పరిస్థితి చాలా దిగజారిపోయింది. కొత్త ఉద్యోగం కోసం అన్వేషించే ఓపిక కూడా నశించింది. దాంతో తన భార్య, పిల్లలని పోషించడం కోసం వీధుల్లో తినుబండారాలు అమ్మాలని నిర్ణయించుకున్నాడు. అయితే పాత బట్టలతో ఇలా స్నాక్స్, కూల్‌డ్రింక్స్ తీసుకెళ్తే చాలామంది కొనడానికి ఆసక్తి చూపించేవారు కాదట. మరికొందరు చీదరింపుగా చూస్తే ఇంకొందరు ఇతని డ్రెసప్ చూసి భయపడేవారట. ఇలా లాభంలేదని బాగా ఆలోచించి అప్పటి నుంచి సూటుబూటు వేసుకుని టై కట్టుకుని నీట్‌గా అమ్మడం ప్రారంభించాడు. రెస్టారెంట్‌లో క్లాస్ లుక్ వెయిటర్‌లు ఎలా ఉంటారో అలా ఉంటే అందరినీ ఆకర్షించగలను అనుకున్నాడు. అతని ఊహ నిజమే అయింది. అతని గెటప్ చూసి కొనడానికి వచ్చిన వారితో చాలా మర్యాదపూర్వకంగా మాట్లాడుతూ తినుబండారాలు అమ్మడం మొదలుపెట్టాడు. దీంతో అతని తినుబండారాలకు గిరాకీ పెరిగిపోయింది. ప్రస్తుతం కుటుంబ పోషణకు మించిన సంపాదన ఉండటంతో తన భార్య అయినా మంచి ఉద్యోగం చెయ్యాలంటే అందుకు చదువుకోవడం తప్పనిసరి అని గ్రహించి సెల్వ ఆమెను కాలేజీలో చేర్పించాడట. ఇలా అతని వేషం, మాటతీరుతో అందరినీ కట్టిపడేసిన సెల్వ ఓ సెలబ్రిటీగా మారిపోయాడు.

నవ్య

**చా**క్లెట్ పేరు వింటే చాలు నోరూరుతుంది కదండీ. చిన్నపిల్లల నుంచి పండు ముదుసలి వరకు అందరూ చాక్లెట్స్ అంటే ఇష్టపడతారు. పిల్లాడు బడికి వెళ్లనని మారాం చేస్తే చాక్లెట్ కొనిస్తా, మాతండ్రి కదూ అంటూ చాక్లెట్ తాయిలం చూపిస్తుంది తల్లి. ప్రియురాలు అలిగిందంటే ప్రియుడు ఊరుకుంటాడా, వెంటనే ఏ డార్క్ చాక్లెటో, మిల్క్ చాక్లెటో మరొకటో తీసుకెళ్లి బుజ్జగించేయడూ! ఇలా చెప్పుకుంటూ పోతే మన జీవితంలో చాక్లెట్ సందర్భాలెన్నో వస్తూనే ఉంటాయి. చాక్లెట్ తింటే ఒంటికి మంచిదని కొందరు అంటారు. లావైపోతారని మరికొందరు అంటారు. ఈ రెండూ నిజాలే! ఎక్కువ తినడం మంచిది కాదు. కానీ చాక్లెట్ తినడంవల్ల కొన్ని లాభాలు ఉన్నాయి, నష్టాలూ ఉన్నాయి. ఇంతకీ ఇప్పుడు ఈ చాక్లెట్ కబుర్లన్నీ ఎందుకు అను కుంటున్నారా? జూలై 7న వరల్డ్ చాక్లెట్ డే. మరి ఆ సందర్భంగా చాక్లెట్ గురించిచెప్పే తీపి కబుర్లు మీరూ వినండి. రోజూ తియ్యని వేడుక చేసుకోండి!



# తియ్యని వేడుక చేసుకుందాం!

### చాక్లెట్‌కి మూడువేల ఏళ్ళ చరిత్ర!

చాక్లెట్ ఒక్కో బైట్ తింటున్న కొద్దీ శరీరంలో ఏదో నూతనోత్తేజం కలుగుతూ ఉంటుంది కదూ. దాదాపు మూడువేల సంవత్సరాల క్రితం నుంచే చాక్లెట్ వాడుకలో ఉందట. హన్స్‌స్లోన్ అనే ఐర్లాండ్ దేశస్థుడు మొదటిసారి చాక్లెట్‌ని పరిచయం చేశాడని చెబుతారు. జమైకాలోని బ్రిటీష్ గవర్నర్ దగ్గర హన్స్‌స్లోన్ పనిచేసేవాడు. ఓసారి చేదుగా ఉండే కొకొ తాగలేక దాంట్లో పాలు కలిపాడు. అలా ఆ మిశ్రమం చాక్లెట్‌గా మారిపోయింది. అలా కాకతాళీయంగా చాక్లెట్ పుట్టిందన్నమాట. చాక్లెట్ తయారు చేయడానికి కొకొవా చెట్ల గింజలు వాడతారు. యూరోపియన్లు 1519 జూలై 7వ తేదీనే చాక్లెట్ రుచి చూశారు. అందుకే ఈ రోజు చాక్లెట్ డేగా సెలబ్రేట్ చేసుకుంటారు. ఇప్పుడంటే ఒక బార్ రూపంలో చాక్లెట్ తయారుచేస్తున్నారుగానీ మొదట్లో చాక్లెట్ రూపం, రుచి ఎలా ఉండేదో తెలిస్తే ఆశ్చర్యపోతారు.

చాక్లెట్ మొదట తయారు చేసినప్పుడు అందులో 90శాతం ద్రవపదార్థంగానే ఉండేది. అలాగే కాస్త వగరుగా ఉండేది. దాదాపు రెండువందల సంవత్సరాలక్రితం నుంచి మాత్రమే చాక్లెట్‌బార్ తయారు చేస్తున్నారు.

### సామాన్యుల చెంతకు శ్రీమంతుల చాక్లెట్

లాటిన్ అమెరికా ప్రజలు కొకొవా గింజల నుంచి చిక్కటిద్రవం తయారుచేసుకుని తాగేవారు. అలా తాగడంవల్ల శరీరానికి ఉత్తేజం కలుగుతుందని భావించేవారు. ఇక అజ్‌టెక్ నాగరికతకు చెందిన జాకోటల్ అనే పదం నుంచి చాక్లెట్ అనే పదం పుట్టింది. లాటిన్‌భాషలో కొకొవా చెట్టును 'థియో బ్రోమా కొకొ' అంటారు. థియోబ్రోమా అంటే దేవతల ఆహారం అని అర్థం. అయితే రాజులు, పురోహితులు, వైద్యులు మాత్రమే ఈ కొకొవా రసం తాగడానికి అర్హులు, సామాన్యులకు ఈ రసం అందని ద్రాక్షే. శ్రీమంతులు మాత్రమే తాగుతారనేది అప్పట్లో ప్రచారంలో ఉండేది. ఈ కొకొవారసం స్పెయిన్ దేశానికి ఒక ప్రత్యేకతను సంపాదించిపెట్టింది. చిత్రమేమిటంటే, 16వ శతాబ్దిలో మెక్సికోపై దండెత్తిన స్పానిష్ సామ్రాజ్యవాదులు బంగారం, వెండి కాదనుకుని తమవెంట కొకొవా విత్తనాలు తీసుకువెళ్లారు. కొకొవా రసం కోసం వివిధ దేశాల ప్రజలు అంతలా ఎగబడేవారు. పైగా దీన్ని ఎలా తయారుచేస్తారో ఎవ్వరికీ తెలియకుండా స్పెయిన్ జాగ్రత్తపడింది. అయితే ఆ రహస్యం ఎక్కువకాలం దాగలేదు. స్పానిష్ రాజు మూడో ఫిలిప్ కుమార్తె, ఫ్రాన్స్ ఎనిమిదవ లూయీని పెళ్ళి చేసుకున్న తర్వాత ఈ రహస్యం ప్రపంచం అంతా తెలిసింది. అదెలా జరిగిందనుకుంటున్నారా? స్పానిష్ రాకుమార్తె తనతోపాటు అత్తారింటికి చాక్లెట్లు తీసుకువెళ్ళింది. అలా చాక్లెట్ల సంగతి ఇతర యూరోపియన్ రాజ్యాలకూ పాకిపోయింది. అలా క్రమక్రమంగా ప్రపంచమంతటా విస్తరించి శ్రీమంతుల ఆహారపదార్థంగా మారింది. క్రమంగా శ్రీమంతుల చాక్లెట్ సామాన్యులచెంతకు చేరింది. ఇప్పటి గణాంకాల ప్రకారం, సగటు అమెరికా పౌరుడు సంవత్సరానికి ఐదుకిలోల చాక్లెట్లు తింటున్నాడు. మనవాళ్ళు

### జూలై 7 వరల్డ్ చాక్లెట్ డే



ఏడాదికి కనీసం కిలో చాక్లెట్లైనా ఆరగిస్తున్నారనే చెప్పొచ్చు. ప్రపంచవ్యాప్తంగా ప్రతి సంవత్సరం 7,500 కోట్లడాలర్లు చాక్లెట్లపై వెచ్చిస్తున్నారని అంచనాలు వెల్లడిస్తున్నాయి.

### వెన్నెల రాత్రులు మీసొంతం!

మీ ఆవిడ సత్యభామలా బుంగమూతిపెట్టి అటకెక్కి కూర్చుందా? మీ శ్రీవారు ఆఫీస్ టెన్షన్‌లో మిమ్మల్ని సరిగా పట్టించుకోవడం లేదా? అయితే, వెంటనే వారికి డార్క్ చాక్లెట్లు తినిపించండి. వెన్నెల రాత్రులు తిరిగి మీ సొంతం అవుతాయి! 70 నుంచి 80 శాతం కొకొ ఉండే డార్క్ చాక్లెట్లు స్ట్రెస్ బస్టర్స్‌గా పనిచేస్తాయి. అంతేకాదు, అవి మీ మూడ్‌ను నిద్రలేపే ఎన్హాన్సర్స్. డార్క్ చాక్లెట్లు శరీరంలో ఎడ్రినలిన్, డోపమైన్ హార్మోన్లు విడుదలయ్యేలా చేస్తాయి. ఎడ్రినలిన్ ఒత్తిడిని తగ్గిస్తే డోపమైన్ ఆనందాన్ని రెట్టింపుచేస్తుంది. అందుకే చీకటి వెన్నెల కావాలంటే డార్క్ చాక్లెట్లను అందుకోండి మరి. పరిశోధకులు తేల్చిచెప్పిన నిజాలివి. ఎవరైనా టెన్షన్‌లో ఉన్నా లేదా మూడ్ బాగా లేకపోయినా, కోపంలో ఉన్నా.. వారికి ఒక చాక్లెట్ ఇచ్చి వారి నోరు తీపి చేస్తే అప్పటివరకు అరుస్తూ ఉన్నవారు మళ్లీ ప్రేమగా మాట్లాడటం ప్రారంభిస్తారు. అమ్మాయిలు స్వీట్ గా మాట్లాడటానికి కారణం చాక్లెట్లు తినడమే. ఈ ప్రపంచంలో అమ్మాయిల్ని చాక్లెట్లు అర్థం చేసుకున్నట్టుగా మరెవరూ అర్థం చేసుకోలేరు మరి! అందుకే సాధారణంగా అబ్బాయిలు అలిగిన అమ్మాయిలకు చాక్లెట్ ఇచ్చి ఇంప్రెస్ చేస్తారు.

## తీపి కబుర్లు చదవండి



**మ**యన్ల కాలంలో కోకోవా గింజల్ని కరెన్సీగా ఉపయోగించేవారు.

ప్రపంచవ్యాప్తంగా ఏటా 10 లక్షల కోట్ల రూపాయల్ని చాక్లెట్ ఉత్పత్తుల కోసం వినియోగిస్తున్నారు.

ఒక్కో స్విట్జర్లాండ్ వాసి సంవత్సరానికి కనీసం 11 కిలోల చాక్లెట్ తింటారు.

ప్రపంచంలో అతి ఖరీదైన చాక్లెట్ పేరు 'లీ చాకొలెట్ బాక్స్'. వజ్రాలు పొదిగి దీన్ని తయారుచేస్తారు. దీని ధర అక్షరాల పది కోట్ల రూపాయలు. ఇకపోతే 'ఫ్రోజెన్ హాట్' అనే చాక్లెట్ రెండోస్థానంలో నిలుస్తోంది. కానీ ఇది డిజర్ట్‌లా ఉంటుంది. ప్రపంచంలోనే నాణ్యమైన కొకొవా గింజలతో తయారుచేస్తారు. ప్రపంచంలోనే మంచి రుచి ఉన్న డిజర్ట్‌గా ఈ చాక్లెట్ గిన్నిస్‌బుక్‌లో స్థానం పొందింది.

లండన్‌లోని కొన్ని రెస్టారెంట్లలో చాక్లెట్ పూత పూసిన తేళ్లు ఉంటాయి. అక్కడి వారు విందుభోజనంలా వాటిని ఆరగిస్తారు.

పురుషులకు ఆకలిగా అనిపించినప్పుడు కొవ్వు, ఉప్పు పదార్థాలున్న ఆహారం తినడానికి ఆసక్తిచూపిస్తే, స్త్రీలు చాక్లెట్లు తినడానికి ఇష్టపడతారని ఓ అధ్యయనంలో తేలింది.

మనుషులకు ఎంతో మంచి చేసే చాక్లెట్లు శునకాలకు మాత్రం అసలు మంచి చేయవు. కుక్కలకు చాక్లెట్లు తినిపిస్తే అనారోగ్యం పాలవుతాయి. అందులో ఉండే థియోబ్రొమైన్ అనే పదార్థం కుక్కల నాడీ వ్యవస్థను దెబ్బ తీస్తుంది.

డార్క్‌చాక్లెట్ తినడం వల్ల గుండెపోటు వచ్చే అవకాశం కొంతమేర తగ్గుతుంది. రక్తపోటును అదుపులో ఉంచుతుంది.

చాక్లెట్ తింటే మెదడు పనితీరు మెరుగుపడుతుంది. ఆందోళన తగ్గుతుంది.

చాక్లెట్లు తినడంవల్ల పళ్లు పాడవుతాయనేది అపోహ మాత్రమే. అంతేకాదు చాక్లెట్లలో ఉండే టానిన్లు పంటికి త్వరగా పాచి పట్టకుండా చేస్తాయి.

మనదేశంలో చాక్లెట్ల మార్కెట్ పెరగడానికి ముఖ్యకారణం డయాబెటిస్ అని పరిశోధనలు తెలియజేస్తున్నాయి. సంప్రదాయసిద్ధంగా మనదేశం స్వీట్లకు ప్రసిద్ధిచెందింది. కానీ, చక్కెర వ్యాధి (డయాబెటిస్) వల్ల చాలా మంది స్వీట్ల నుంచి చాక్లెట్లకి షిఫ్ట్ అవుతున్నారని తాజా సర్వేలో వెల్లడైంది.

చాక్లెట్స్‌ను ఇటీవల కాలంలో సౌందర్య పోషణంగా కూడా వాడుతున్నారు. జుట్టు, ముఖం, చర్మతత్వాన్ని మెరుగుపరచడంలో చాక్లెట్లు అద్భుతంగా పనిచేస్తున్నాయి.

### జపాన్‌లో హాన్‌మెయి చాక్లెట్

వాలెంటైన్స్ డే అనగానే అబ్బాయిలు రకరకాల చాక్లెట్స్‌తో అమ్మాయిలను ఫ్లాట్ చేయాలని ట్రై చేయడం సహజమే. కానీ, జపాన్‌లో మాత్రం ఒక వింత ఆచారం ఉంది. వాలెంటైన్స్ దినోత్సవం నాడు అక్కడి అమ్మాయిలు తమ స్వహస్తాలతో చాక్లెట్స్ తయారుచేస్తారు. ఎందుకంటే మగువ తాను తయారుచేసిన చాక్లెట్‌ను మనసుపడ్డ అబ్బాయికి ఇస్తుందట. ప్రపోజ్ చేయడానికి, ప్రేమను తెలియజేయడానికి జపాన్‌లో చాక్లెట్ ఒక సంప్రదాయ సాధనంగా కొనసాగుతోందంటే ఆశ్చర్యంగా ఉంటుందిగానీ అది నిజం. అయితే, పవిత్రమైన ప్రేమను వలచినవాడికి వ్యక్తం చేయడానికి స్వయంగా తయారుచేసిన చాక్లెట్ మాత్రమే ఇవ్వాలని జపాన్ యువతులు బలంగా నమ్మడమే అసలైన తియ్యందనం. ఇలా ప్రేమను వ్యక్తం చేసే చాక్లెట్లను వారు హాన్‌మెయి అని పిలుచుకుంటారు.

### చాక్లెట్ రూం టాకింగ్ రూం

చాక్లెట్ తినడం ఓ సరదా సందర్భమే కానవసరం లేదు. బిజినెస్ మీటింగ్, సీరియస్ డిస్కషన్ ఏదైనా కావచ్చు. ఎక్కడెక్కడో కలుసుకోవడం ఎందుకని చాక్లెట్‌రూంలలోనే కలుసుకుంటున్నారు. సరదాగా చాక్లెట్ తింటూ డీప్ డిస్కషన్స్‌లో మునిగిపోతున్నారు. ఇకపోతే ఇప్పటివరకు ఏవైనా వెరైటీగా ఉండే రిటర్న్ గిఫ్ట్లు ఇచ్చేవారు. కానీ ఇప్పుడు థీమ్ బేస్డ్ చాక్లెట్స్ తయారుచేసి అతిథులకు రిటర్న్ గిఫ్ట్‌గా ఇస్తున్నారు. ఇక చాక్లెట్ బొకేల గురించి కొత్తగా చెప్పక్కర్లేదు. రెండురోజుల్లో వాడిపోయే పూలకంటే కూడా ప్లాస్టిక్ పూల డిజైనింగ్‌లో మధ్యమధ్యలో చాక్లెట్లతో తయారుచేసే బొకేలు ఎంతో అందంగా, ఎట్రాక్టివ్‌గా ఉంటున్నాయి.

**–సంతోషిలక్ష్మి దహగాం**



## చాక్లెట్‌కూ ఓ డిగ్రీ

**చా**క్లెట్ అంటే ఇష్టపడే శాస్త్రవేత్తలు, ఔత్సాహికులు ఎవరైనా సరే చాక్లెట్‌పై పరిశోధన చేసి పీహెచ్‌డీ పట్టా పొందే అవకాశం కూడా ఉంది. అదేంటి చాక్లెట్‌పైన కూడా పట్టా సాధించవచ్చా అనుకుంటున్నారా? లండన్‌లోని ప్రఖ్యాత కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం ఈ అవకాశం అందించింది. పరిశోధనలో భాగంగా చాక్లెట్లు, చాక్లెట్లతో చేసిన ఆహార పదార్థాలు, వేడి వాతావరణంలో కూడా కరిగిపోకుండా ఉండేలా కొత్త ఫార్ములాలు కనిపెట్టాలి. అలాగే దానివల్ల కలిగే లాభాలను కూడా తెలియచెప్పాలి. మూడేళ్ల వ్యవధి ఉండే ఈ కోర్సు పూర్తి చేసినవాళ్లు 'డాక్టర్ ఆఫ్ చాక్లెట్' అని సంతోషంగా చెప్పుకోవచ్చు.

# మైత్రీబంధం

వారణాసి ప్రసాదరావు

**ఆ జనమహారణ్యంలో అంతెత్తు తాటి చెట్లలా ఉన్నాయి ట్రియోహైట్స్. త్రిభుజాకారంలో నిలబడి ఉన్న ఆ మూడుచెట్ల చుట్టు దడిలా ప్రహరీగోడ ఉంది! గోడ అవతల మరికొన్ని చెట్లు గుబురుగా తోకలమీద నిలబడ్డ అనకొండల్లా ఉన్నాయి! గోడలోపల అయిదు కణుపుల చెట్లు. ఒక్కొక్క చెట్టుకీ కణుపులకు పన్నెండేసి చొప్పున అరవై గూళ్లున్నాయి. మొత్తంగా లోపల చెట్లకున్న గూళ్లు నూటఎనభై! అన్ని గూళ్లలోనూ పక్షులు గుట్టుగా గుంభనంగా కాపురాలు చేసుకుంటున్నాయి. ఆ గూళ్లలో చేరిన పక్షులు ఆ జనారణ్యంలో పుట్టినవికావు. ఎక్కడెక్కడి నుంచో వలసవచ్చి బాగుపడడానికి మరో చోటనుండి వచ్చివుంటున్నవి.**

విచిత్రం..! ఏ గూటిపక్షీ మరో గూటిపక్షితో సంబంధం పెట్టుకోదు! తన గూడూగోడూ తప్ప మరొక గూటి బాగోగులు పట్టించుకోదు! చెట్లను ఆశ్రయించిన కొత్తలో మాత్రం అవసరార్థం కాస్త కాస్త పట్టించుకుంటూ ఉండేవి! ఇక ప్రస్తుతానికి వస్తే..!(రెండు పెదాల్ని అంటించి రకీమని విడదీయాల్సిందే)

ఆ పక్షులను మానవజాతిగా అన్వయించుకుంటే.....



నరసింహం రిటైర్డ్ గవర్నమెంట్ అధికారి. 'హైట్స్' నివాసుల ఉమ్మడి అవసరాలు, సంక్షేమం చూసేందుకు వాటిని నెరవేర్చేందుకు ఏర్పడిన సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నికై నాలుగేళ్ళు చక్కగా తన బాధ్యతలు నిర్వహించాడు. పాపం ఆయనకు ఆరునెలలక్రితం హార్టెటాక్ వచ్చింది! పూర్తివిశ్రాంతి అవసరం అన్నారు డాక్టర్లు. దాంతో ఉసూరుమంటూనే మంచానికి పరిమితమై పోయాడు నరసింహం. ఆ తర్వాత ఎందుకో తెలియదుగానీ హైట్స్ నివాసితులు కొత్త అధ్యక్షుణ్ణి ఎన్నుకోలేదు! ఆపద్ధర్మ అధ్యక్షునిగా వ్యవహరించిన ఉపాధ్యక్షుడు ఓసారి సంక్షేమ సంఘ కార్యదర్శి, కోశాధికారులతో గొడవపడ్డాడు! అది ముదిరి చినుకు చినుకు గాలివానగా మారింది. నివాసితులంతా మూడు గ్రూపులుగా విడిపోయారు. తాత్కాలికాధ్యక్షుణ్ణి తొలగించారు. ఇప్పుడా ట్రియోహైట్స్‌లో ఎవరిగోల వారిదే! ఎవరి బాధ వారిదే. ఎవరి ఆనందం వారిదే. ఎవరి ఫీలింగ్ వారిదే.

అక్కడ అందరి గూళ్లలోనూ టీవీలున్నాయి! తొంభైశాతంమందికి కంప్యూటర్లున్నాయి. సగటున వాళ్ళందరికీ చెవికొక సెల్‌ఫోను ఉంది! వాళ్ళందరూ చూస్తూ ఉంటారు, మాట్లాడుతూ ఉంటారు, వింటూ ఉంటారు. అలా చేస్తున్నప్పుడు నవ్వడమో ఏడవడమో లేక మూతి ముడుచుకోవడమో, ఒక్కొక్కసారి సంతోషపడడమో బాధపడటమో చేస్తూ ఉంటారు. పిల్లకాయలైతే ఆడుకోవడం, అల్లరల్లరి చేయడం.

అయితే అవన్నీ టీవీలు, ఫోన్లు కంప్యూటర్ల ముందరే. నరసింహం ఇవన్నీ గమనిస్తూ బాధపడుతూ ఉంటాడు. ఒక్కొక్కసారి గతంలోకి జారిపోతూ ఉంటాడు. చిన్నతనంలో తన వయసు గాళ్ళంతా బిళ్లంగోడు, కబడ్డీ, కోతికొమ్మచ్చి, గోళీలు, దాగుడుమూతలు వగైరా ఆటలెన్నో ఆడుకునేవారు. చేలగట్లవెంట పరుగులుతీస్తూ గాలిపటాలు ఎగరేసేవారు. వసంతకాలంలో మామిడి పిందెలు తెంపి ఉప్పుకారాలద్దుకుని తినేవాళ్ళు. అలా తన బాల్యమంతా ఆటపాటలతో ఎంత ఆనందంగా, సరదాగా, ఉత్సాహంగా గడిచిపోయింది. కానీ మరి ఇప్పుడో! ఈ పిల్లల పరిస్థితిని తలచుకోవడానికే భయపడ్డాడు నరసింహం!

తన మనవలిద్దరూ సెలవుల్లో తనదగ్గరకు వచ్చినప్పుడు టీవీలకే అతుక్కుపోతారు. కంప్యూటర్ గేమ్స్‌కి అంకితమైపోతారు! వాళ్ళిద్దరికీ కళ్ళజోళ్లు వచ్చేశాయ్! వాళ్ళల్లో ఒకడు నాలుగో తరగతి, మరొకడు రెండో తరగతి. తరగతి అంటే తెలియదు. స్టాండర్డ్ అంటేగానీ వాళ్ళకు అర్థం కాదు.

నెల్లాళ్ళక్రితం కాంపౌండ్‌లోపల క్రికెట్ ఆడటం నిషేధించారు! ఆటలో బంతి వచ్చి హైట్స్‌లో నివసిస్తున్న ఒక పోలీసాయనకు తగిలింది! మరోసారి ఒక గూటి కిటికీ అద్దం పగిలింది. ముచ్చటగా మూడోసారి ఒక పెద్దాయన కారు హెడ్‌లైట్‌ను భళ్లుమనేలా పగలగొట్టింది! అంతే, అప్పటికప్పుడు సమావేశంపెట్టి తీర్మానించేశారు. గోడలోపల క్రికెట్ ఆడకూడదని నిషేధించారు. కొందరు స్పోర్టివ్‌గా తీసుకోమంటే, మరికొందరు వీల్లేదన్నారు. గొడవ ముదిరింది. నివాసులు గ్రూపులు వారీగా వాగ్యుద్ధాలు చేసుకున్నారు. శ్రుతిమించి వ్యక్తిగత విషయాల్లోకెళ్ళి నువ్వెంత అంటే నువ్వెంత అని తులాభారాలు వేసుకున్నారు. ఇక ఊరుకోలేక అందరినీ రప్పించి ఒప్పించి గొడవలు తాత్కాలికంగా సద్దుమణిగేలా చేశాడు నరసింహం!

తన మనవలిద్దరూ సెలవుల్లో ఇక్కడికి వచ్చినప్పుడు టీవీలకే అతుక్కుపోతారు.

పాపం ఆటల వయసు వాళ్ళది. పిల్లలకు సమీపంలో ఆడుకునే స్థలమే లేకపోయింది. పరిసరాలన్నీ కాంక్రీట్‌వృక్షాలే! పిల్లలందరూ ఆటవిడుపు లేకపోవడంతో వీడియోగేమ్స్‌కు పరిమితమైపోయారు. అందులో వాళ్ళని ఎక్కువగా ఆకర్షించేవి కార్ రేసింగ్స్, చేజింగ్స్, ఎటాక్స్, ఫైరింగ్సే! వారి లేత మెదళ్లను చీలుస్తూ వాళ్ళ మేధను తొలిచేస్తున్నాయి. ఈ గేమ్సు అన్నీ జోరుగా సాగిపోతున్నాయ్! పిల్లల మెదడుకుమేత పెట్టే చదరంగం, పులిమేక ఆట, పజిల్స్ వంటి వాటి ఊసే మరచిపోయారు! అసలు అవి ఏమిటో కూడా తెలియదు. వాటి గురించి చెప్పేవాళ్ళు లేరు! అలాంటి పరిస్థితుల్లో ఒకసారి ఇల్లిక (ఫ్లాట్‌ను తెలుగులో ఇలా అనవచ్చో కూడదో తెలియదు) నంబరు నూటరెండులో జరగరాని ఘోరం జరిగిపోయింది!



ఒక పిల్ల ఫ్యాన్‌కు ఉరేసుకుంది! చివరి క్షణంలో మృత్యువు మనసు మార్చుకుని దూరంగా వెళ్ళిపోయింది. సరిగ్గా ఆమె ఉరిబిగించుకున్న సమయానికి అటుగావెళ్ళిన ఆనంద్ కిటికీలోంచి చూసి గట్టిగా కేకలువేశాడు. బెడ్రూమ్‌లో గురకపెట్టి నిద్రపోతున్న ఆ పిల్లతండ్రి గభాల్న లేచి కూతుర్ని రక్షించుకున్నాడు. మరో అరక్షణం దాటినా.... ఏం జరిగి ఉండేదో? ఆ విషయం తల్చుకుని బావురుమన్న తండ్రిని ఓదార్చాడు ఆనంద్. అప్పటికి సమయం రాత్రి ఒంటిగంట ఓ పెళ్ళి ఫంక్షన్‌కి వెళ్ళి తన ఫ్లాట్‌కు చేరుకుంటున్న ఆనంద్ కళ్ళబడింది ఆ దృశ్యం. గతుక్కుమన్నాడు. తను ఒక్క అరనిమిషం ఆలస్యమై ఉంటే...అమ్మో అనుకున్నాడు.

ఆ పిల్ల వయసు పద్దెనిమిది దాటింది. ఫేస్ బుక్ ప్రియుడు పిల్ల ఫేస్‌చూసి లవ్ చేశానన్నాడు. రమ్మని పిలిచాడు. వెళ్ళింది. చాటుమాటుగా కలుసుకునేవారు. చెట్టపట్టాలేసుకుని తిరిగారు. నాలుగు నెలల తర్వాత ప్రియుడు 'సారీ డియర్ మర్చిపో!' అన్నాడు. 'కొత్త ఫేస్ చూస్కో' అన్నాడు. ఈ లోగా ఆ పిల్లకు ఏదో అనుమానం వచ్చి ఓ నర్సును కలిసింది. ఆమె 'అవును' అని కన్‌ఫర్మ్ చేసింది! ఇక అంతే! ఫ్యానుకి చున్నీవేయడమే పరిష్కారం అనుకుంది. ఈ వార్త ఆ 'ఇల్లిక' దాటి మాటల అల్లికలతో బీబీసీలా వ్యాపించింది. చాలా మంది నవ్వుకున్నారు. అదేం రోగం అన్నారు. మరీ బరితెగించి తిరగడమేంటి? అన్నారు. కొందరు మాత్రం స్థితప్రజ్ఞులైపోయారు! కానీ చిత్రం ఏ ఒక్కరూ ఆ ఇల్లికలోకెళ్లి వాళ్ళని పరామర్శించలేదు. 'మేమున్నాం, న్యాయం జరిగేలా చూస్తాం' అని ఏ ఒక్కరూ ఆ కుటుంబానికి ధైర్యంచెప్పలేదు. అంతకన్నా విచిత్రమేంటంటే, ఆ పిల్ల ఎఫ్‌బీ ప్రియుడితో షికార్లుచేస్తూ, కొందరు హైట్స్ నివాసితుల కళ్ళబడినాగానీ ఆ పిల్ల తండ్రికి చెప్పలేదు! నరసింహంగారు మాత్రం వెళ్ళి వాళ్ళను ఓదార్చి ధైర్యం చెప్పారు. ఆనంద్ ద్వారానే ఆ విషయం ఆయనకు తెలిసింది. నరసింహంగారి ఆఖరి చెల్లెలు కొడుకు ఆనంద్.

'వచ్చి కాస్త తనకు తోడుగా ఉండరా' అని నరసింహంగారు అడిగితే, రెండునెలలగా ఆయన దగ్గరే ఉంటున్నాడు ఆనంద్. ఆ నగరంలోనే సాఫ్ట్‌వేర్ ఉద్యోగి.

"మామయ్యా, ఏమిటి ఈ పరిస్థితి? ఇక్కడ అందరూ ఒకే చెరువులో ఉంటూ కూడా తామరాకు మీద నీటిబొట్టుల్లా బతుకుతున్నారెందుకు?" అడిగాడు ఆనంద్. జవాబు తెల్సినా ఏం చెప్పాలో తెలియక నవ్వి ఊరుకున్నాడు నరసింహం. "ఈపరిస్థితిని మనం మార్చలేమా?" మళ్ళీ అడిగాడు ఆనంద్. నరసింహం మౌనం వీడలేదు. "మార్చాలి మామయ్యా తప్పదు.." అన్నాడు ఆనంద్ కాసేపు ఆలోచించి. మళ్ళీ నవ్వాడు. 'మా ముసలాళ్లది పోయేకాలం, మీ యువతది వచ్చే

కాలం... కానియ్' అన్నట్టుంది నరసింహం నవ్వు.

ఓరోజు ఆనంద్ తమ పక్క ఇల్లికలోని కిశోర్‌ను పిలిచాడు. తన ఆలోచన, తన ప్రణాళిక అతని ముందుంచాడు! ఆ ఇల్లికలో కిశోర్‌కి ముగ్గురు బెస్ట్‌ఫ్రెండ్స్ ఉన్నారు. వాళ్ళ చెల్లెళ్ల మరో ముగ్గురు! వారి స్నేహితులూ అక్కడే ఉన్నారు. ఓ ఆదివారం అందర్నీ పిలిచాడు ఆనంద్. ఒకరిద్దరు కాలక్షేపం కోసం వస్తే, మిగిలినవాళ్ళు సంగతేమిటో చూద్దాం అనుకుని వచ్చారు. నరసింహం ఇంట్లోనే అంతా కూర్చున్నారు. సుప్రియ కూడా వచ్చింది. ఆమె ఆనంద్ పనిచేసే కంపెనీలోనే చేస్తోంది.

ముందుగా నరసింహం అందర్నీ ఆశీర్వదించి తొలిమాట చెప్పాడు. తర్వాత ఆనంద్ తన ప్రణాళిక వారి ముందుంచాడు.

"ఈ హైట్స్ కాంపౌండ్‌లో అందరూ ఎవరికి వారే ఒంటరితనంతో జీవిస్తున్నారు. ఒక్కచోట ఉంటూ రోజు ఒకరినొకరు చూసుకుంటూ కూడా, ఒకరికొకరు తెలియనివాళ్ళల్లా, మాట్లాడేందుకు ఏమీలేదన్నట్టు తలతిప్పుకుని పోతున్నారు. ఈ పరిస్థితి మంచిది కాదని మనకు తెలుసు. ఎక్కడో దూరంగా ఉన్నవాళ్ళతో మొబైల్‌లో ఎంతసేపైనా మాట్లాడతాంగానీ పక్కనున్నవాళ్ళతో ఒక్కని ముఖం కూడా మాటలు కలపరు! ఒకవేళ మాట్లాడితే అదీ నాలుగైదు ముక్కలే! ఎవరికి ఏ ఆపదవచ్చినా కష్టంవచ్చినా పట్టించుకోరు. మన మధ్యనే ఉంటూ అందర్నీ ఆప్యాయంగా పలకరించే సుగుణమ్మగారు పాపం మొన్ననే సడెన్‌గా పోయారు! ఆమె అంత్యక్రియలకు ఇక్కడున్న వాళ్ళల్లో కనీసం నలుగురుకూడా హాజరు కాలేదు! వింతేమిటంటే ఆమెకు గర్భాశయ కేన్సర్ సోకిందనీ అది బాగా ముదిరిపోయిందనీ, చనిపోవడానికి నెలముందు చేసిన పరీక్షల్లో తెలిసిందట! పాపం భర్త గతించాక పలకరించేవారు లేరు. ఆమె తన బాధలు ఎవరికీ చెప్పుకోలేకపోయింది! ఏవో తాత్కాలికంగా మందులు మింగేది. పరిస్థితి విషమించేవరకు వచ్చింది. ఇలా ఎవరికీ జరగకూడదు. ఇక్కడ పిల్లలు ఆరుబయట ఆటపాటలు మరచిపోయి, గదుల్లో టీవీ, కంప్యూటర్లకు అతుక్కుని రోబోలుగా మారిపోతున్నారు. వీటన్నింటినీ మనమే చక్కదిద్దుకోవాలి. అందుకో ప్రణాళిక ఉంది. అనుభవజ్ఞులు, పెద్దలు అవసరమైన సలహా, సహకారాలు అందిస్తారు. మీకు నచ్చితే అందరం కలిసి అమలుచేద్దాం, ఫలితాలు సాధిద్దాం" అంటూ తన ప్రణాళిక వారి ముందుంచాడు ఆనంద్.

**ఇప్పుడన్నీ జనారణ్యాలే. చూసేందుకు పెద్ద పెద్ద నివాసిత సముదాయాలే. కానీ ఎవరి గూడు వారిది, ఎవరిగోల వారిది. ప్రతిరోజూ అందరూ తారసపడుతున్నా పలకరింపు లుండవు. చిరునవ్వులైనా కరవే. సామూహికతత్వం మరచిపోయాం. స్నేహాలు, ఇరుగు పొరుగు సహకారం, సంస్కృతి, మానవత్వం అన్నీ వదిలేసి బతుకుతున్నాం. అలాంటి ఓ సముదాయంలోకి ప్రవేశించాడో యువకుడు. అక్కడ అతడు ఏం చేశాడు?**

దానిపైన రెండుగంటలు చర్చించి కొన్ని మార్పులు చేర్పులు చేసి అమలు చేద్దామని నిర్ణయించేశారు! తర్వాత అక్కణ్ణించి నిష్క్రమించారు. వారిలో ఒకమ్మాయి వచ్చి ఆనంద్‌ని ఒంటరిగా కలిసి ఒక ఛాలెంజ్ చేసింది! ఆనంద్ ఆశ్చర్యపోయాడుగానీ ఆ ఛాలెంజ్ స్వీకరించాడు.

ప్రణాళికలో భాగంగా, ప్రతి ఇల్లికకూ ఒక ప్రశ్నావళి జిరాక్స్ పంచారు. అందులో ఉన్నవి మూడే మూడు ప్రశ్నలు.

'హైట్స్'లో మొదట వాళ్ళు మెడికల్ క్యాంప్ ఏర్పాటు చేశారు. ప్రతినెల మొదటి ఆదివారం ప్రముఖ ఆస్పత్రి డాక్టర్లువచ్చి ఆరోగ్య పరీక్షలు చేస్తారు. అవసరమైన మందులు రాస్తారు. "ఎర్లీ డయాగ్నోసిస్ ఫర్ హెల్దీ లివింగ్" కాన్సెప్ట్ అన్న మాట. జెనరిక్ మందులు కొనితెచ్చి అందరికీ ఇస్తోంది ఆనంద్ బృందం!

ఇక రెండో పథకం "మీ దరికే నిత్యావసరాలు". ప్రముఖ డిపార్ట్‌మెంట్ స్టోర్‌వారు ప్రతినెలా మొదటివారమంతా ఆ ప్రాంగణంలోకే సరుకుల వాహనం పంపుతారు. సాయంత్రం అయిదు నుండీ రాత్రి పదివరకు లక్షల రూపాయల కొనుగోళ్ళుంటాయి. ప్రతి ఆదివారం ఉదయం ఆరు నుండి పదివరకు హోల్‌సేల్ వర్తకుల కాయగూరల వాహనం వస్తుంది. దాదాపు ముప్పయివేల రూపాయల విలువైన కొనుగోళ్ళుంటాయి. బయట మార్కెట్లో ఆ కూరగాయలధర ఇంకా ఎక్కువే ఉంటుంది.

ఇక వినోదం సంగతి! ఆడవారికీ, మగవాళ్లకూ చదరంగం..క్యారమ్స్ వగైరా ఏర్పాటు చేశారు. టెన్నిస్, షటిల్ వగైరా ఔట్‌డోర్ గేమ్స్‌కి ప్రాంగణం కూడా రెడీ. ఆదివారం ఉదయం, సాయంత్రం పిల్లలు క్రికెట్ ఆడుకోవడానికి అనుమతిచ్చారు. కాకపోతే క్రికెట్‌బాల్ బదులు, కాస్త గట్టి రబ్బరు బంతి ఇచ్చారు.

పిల్లలంతా ఇంగ్లీషు మీడియమే. తెలుగు సొగసు ఎలాంటిదో వాళ్ళకు తెలియదు. తెలుగు తీపి అసలే తెలియదు! ప్రతి ఆదివారం ఉదయం ఏడు నుండి పది వరకు పద్నాలుగేళ్ళ పిల్లలకు "మన తెలుగు మనకు వెలుగు" పథకం పెట్టారు.




## ప్రేమే ఏకైక శాశ్వత భావప్రాప్తి

*నన్ను నేను వెతకడానికి*
*నా చుట్టూ నేనే తిరుగుతుంటాను*
*జననంతోనే ఈ లోకాన తప్పిపోయానని అర్థమయింది*

***

*నన్ను నేను కలవడానికి*
*నాతో నేను వెళుతుంటాను*
*నీటిలో ఏనాడూ నీడ మునిగిపోలేదని తెలిసింది*

***

*అనంత కేంద్రంలో కలిసిపోవడానికి*
*నా నాభి మూలం నుంచే పయనిస్తుంటాను..*
*మళ్ళీ మళ్ళీ పుట్టుక గురించి దారీతెన్నూ ఏమీ తెలియకుంది*

***

*తప్పటడుగులతోనే మొదలైన నడకకి*
*తప్పటడుగుల పరుగులిడకూడదనుకుంటాను...*
*కాలం ఒకేచోట నిలిచిపోవడం జరగని పని అని తెలిసిపోయింది*

***

*ఎంత మహావృక్షమైనా తొలుత చిగురించడానికి*
*చినుకు విత్తును కలవడమే మూలమంటాను*
*పుట్టగానే చెట్టయి ఫలఫలితమివ్వడానికి కుదరదని తెలుస్తోంది*

***

*లోనా బయటా వేడి వేడి తర్కసంపర్కానికి*
*మానవీయ సంస్కారమే చల్లబరుస్తుందంటాను..*
*నాకు నేనే ప్రశ్నయితే! ఎవరి సమాధానమూ పరిష్కారం చూపదని తెలిసింది*

***



*కళ్ళు మూసుకుని చీకటిని ప్రశ్నిస్తే ఏముంది!*
*జవాబు చెప్పడానికి*
*సూర్యరశ్మి మాత్రమే దశదిశలా కాంతిని చిమ్ముతుందంటాను...*
*వెలుగెప్పుడూ నీడల్ని దించదని నిందించదని స్పష్టమయింది.*

***

*క్షణక్షణం స్ఖలనతత్వ తన్మయత్వానికి*
*జీవికరిగిపోవడమే సంపూర్ణ జీవిత పరమార్థానికి పరిపూర్ణ నిదర్శనమంటాను...*
*ప్రేమ ఏకైక కాలాతీత శాశ్వత భావప్రాప్తని తెలిసింది.*

**—యక్కలూరి శ్రీరాములు**

*సంచారవాణి 99856 88922*

పిల్లలకు తెలుగు భాష, కుటుంబ బంధాలు, నీతి కథలు, శతకాలు, రామాయణం బోధించే ఏర్పాటు చేశారు. అలా ఆర్నెల్లు గడిచాయి.

హైట్స్ ప్రాంగణంలో నివాసితుల్లో ఇప్పుడు ఒకటే ఆశ్చర్యం! ఇప్పుడు అందరూ తరచు ఒకరికొకరు తారసపడి పలకరించుకుంటున్నారు. పరస్పరం యోగక్షేమాలడిగి తెలుసుకుంటున్నారు. అణగారిపోయి ఉన్న ఆత్మీయత, మానవీయత తిరిగి తలెత్తుతోంది. అందరిలో 'నా' పోయి 'మన' భావన వచ్చింది.

నరసింహం ఎంతో ఆనందించాడు. అమృతం తాగిన అనుభూతి కలుగుతోంది.

సంక్రాంతి పండుగ వచ్చింది. సంప్రదాయబద్ధంగా మూడురోజులు పండుగ నిర్వహించారు. అందర్నీ అలరించే ఎన్నోవినోద కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. పిల్లలూ, పెద్దలూ సంతోషసాగరంలో ఓలలాడారు. ఆ తర్వాత తెలుగువారి ఉగాది పండుగ వచ్చింది. మళ్ళీ ఆ ప్రాంగణంలో ఉత్సాహం వెల్లివిరిసింది. ఎన్నో కార్యక్రమాలు చేశారు. అన్నిటిలోనూ అందరినీ ఆకర్షించింది, నరసింహంగారి ప్రసంగం.

'సోదరులారా...సోదరీమణులారా అందరికీ ఉగాది శుభాకాంక్షలు! మన 'హైట్స్'లో ఆరునెలల కిందటి పరిస్థితికీ ఇప్పటికీ ఎంతో మార్పు వచ్చింది. ఇది మనందరికీ ఆనందదాయకమని రుజువు చేయడానికే మీరంతా ఇక్కడికి వచ్చారని భావిస్తున్నాను. ఈమార్పుకు కారణం ఆనంద్, అతని మిత్రబృందం! ఆ యువ బృందానికి నా అభినందనలు, ఆశీస్సులు.

నా బాగోగులు చూసుకునేందుకు వచ్చిన నా మేనల్లుడు, మన హైట్స్‌లో పరిస్థితులు చూసి బాధపడ్డాడు. ఇక్కడి యువ మిత్రబృందంతో కలిసి చక్కదిద్దేందుకు పూనుకున్నాడు. ఒక ప్రణాళిక తయారుచేసి ఫలితం సాధించాడు. మీ అందరి సహృదయత, సహకారంవల్లనే ఇదంతా సాధ్యపడింది! ఇక్కడో విషయం చెప్పాలి, మా పక్క ఫ్లాట్ అమ్మాయి సుప్రియ, మన హైట్స్‌లో మార్పు తీసుకురావడం అసాధ్యమని ఛాలెంజ్ చేసింది! ఆనంద్ ఆ ఛాలెంజ్ స్వీకరించారు. ఆనంద్, అతడి మిత్రబృందం. అయితే వాళ్ళని ఉత్సాహపరిచి ముందుకు నడిపించింది మన హైట్స్‌లో వాళ్ళు చేసిన సర్వే! వాళ్ళు మూడు ప్రశ్నలడిగారు. ఒకటి, 'మీరు మానవీయ విలువలను, బంధాలను ప్రోత్సహిస్తారా?' రెండు, 'మీరు అవినీతి..అక్రమాలను నిలదీస్తారా?' మూడు, 'అందరికోసం ఒక్కరు, ఒక్కరి కోసం అందరన్న భావనను ప్రోత్సహించి సహకరిస్తారా..?' అవును, కాదు బాక్సుల్నే టిక్కుపెట్టమన్నారు. మన అదృష్టం కొద్దీ కాదు అన్న జవాబులు అయిదు శాతం మాత్రమే వచ్చాయి! 'కాదు' అన్నవాళ్లు ప్రస్తుతం ఇక్కడ లేరు! ఫ్లాట్స్ ఖాళీ చేసి వెళ్లిపోయారు. ఆ ఐదు శాతంలో కొందరు అద్దెకున్నవాళ్ళు, మిగిలినవాళ్ళు ఫ్లాట్స్ అమ్ముకుని వెళ్లిపోయారు. తొంభై అయిదు శాతంమంది శాశ్వతంగా ఇక్కడే ఉండాలనుకునేవారు, శాశ్వత బంధాలను స్నేహాలను కోరుకునేవారూ ఒకనాటి స్తబ్ధత నుంచి చైతన్యం పొందిన వారు! వారందరికీ ధన్యవాదాలు! ఇక అసలు విషయం ఇక్కడి వారిలో యువతీయువకులు చాలామంది ఉన్నారు. వారిలో ఒకరినొకరు ఇష్టపడేవాళ్ళు కొంతమంది ఉన్నారని నాకు అనిపిస్తోంది! నా మేనల్లుడి పనితీరు గమనించిన సుప్రియ మావాడిని ఇష్టపడుతోంది. మావాడు మరీ ఇష్టపడ్డాడు! ఇష్టపడిన వారిని ఇక వేరువేరుగా ఉంచడం మంచిది కాదు కదా! అందుకే ఇద్దర్నీ ఒక్కటి చేయాలనుకున్నాం అటూ ఇటూ అంగీకరించాం కనుకనే ఇక్కడే వారికి నిశ్చితార్థం ఏర్పాటు చేస్తున్నాం. మీ ఆశీస్సులు అందించాలని కోరుతున్నాం..'

ఆ ప్రాంగణమంతా చప్పట్లతో మారుమోగిపోయింది! ఆ చప్పట్లు ముగుస్తుండగా ఆత్మీయులారా మరొక్క విషయం, చిరంజీవులు ఆనంద్ సుప్రియ బంధం ఈ ప్రాంగణంలో మొదటిదీ చివరిదీ కాకూడదన్న ఉద్దేశంతో "మధురబంధం" పేరున వధూవరుల పరిచయవేదిక అన్న ఒక పథకం కూడా ఏర్పాటు చేయబడింది. పెళ్ళికావలసిన యువతీయువకుల పేర్లు.. ఇక్కడివారే కాదు ఇక్కడి వారి బంధుమిత్రులకు చెందిన వారి అమ్మాయిలు అబ్బాయిల వివరాలు కూడా ఉచితంగా నమోదు చేసుకోవచ్చు. మానవసంబంధాలు, మానవీయ విలువలు కనుమరుగయిపోతున్న నేటి వ్యవస్థలో ముందుగా మనం వాటిని కాపాడుకోవాలి, పటిష్టం చేసుకోవాలి. తర్వాత మిగిలిన వారికి ఆదర్శంగా నిలవాలి. అదే మనందరి ఆకాంక్ష! దాని గుర్తుగా మన ట్రియోహైట్స్ పేరు మార్చాలని యువ మిత్రబృందం సూచించింది. మన సంస్కృతినీ భాషనూ గుర్తుచేసేలా మైత్రీబంధం పేరును సూచించింది.

ఆత్మీయత, అనుబంధం, స్నేహశీలత... ఈ మూడు ఒక బంధంగా అంటే త్రిబంధంగా పెనవేసుకుంటే మానవత పరిమళిస్తుంది. ఈ త్రిబంధమే మన మైత్రీబంధం! ఇంతకన్నా ఆమోదయోగ్యమైన మంచిపేరు ఇంకెవరన్నా సూచిస్తే దానినే ఖాయం చేద్దాం అంటోంది యువ మిత్రబృందం' ప్రసంగం ఆపి అందరినీ కలియజూశారు నరసింహంగారు.

'బాగుంది, మైత్రీబంధం పేరే బాగుంది. చాలాబాగుంది..' ఏకకంఠంతో పలికారు అందరూ! 'సాధించావ్ డియర్' అంది సుప్రియ పక్కనే ఉన్న ఆనంద్‌కేసి చిలిపిగా చూస్తూ.

"ఐ కాంట్ లీవ్ యూ" అంది మళ్ళీ అదే చిలిపి చూపులతో!

**సెల్: 9963809339**



చెప్పొచ్చేదేమిటంటే
చెప్పడానికి చాలా ఉన్నాయని
చెప్పేందుకు సిద్ధమవుతున్న
**ఇంద్రగంటి శ్రీకాంతశర్మ**
సరికొత్త శీర్షిక

## సంగతులూ! సందర్భాలూ!

**వచ్చేవారమే ప్రారంభం**




## కొత్త ఆలోచనలు రావాలంటే నడవాల్సిందే!

ఎక్కువ సేపు ఆలోచిస్తే మెదడు సృజనాత్మకత కోల్పోతుందనీ, అలాంటి సమయంలో ఆలోచనలను కట్టిపెట్టి కొద్దిసేపు నడవాలనీ సూచిస్తున్నారు ఇజ్రాయెల్ పరిశోధకులు. కొన్నిసార్లు అదే పనిగా ఆలోచిస్తుంటే మెదడు పనిచేయడం ఆగిపోతుందనీ, ఇలాంటి సమయంలో బయటకు వెళ్ళి నడవడం లేదా పరుగెత్తడం చేస్తే మెదడు పునరుత్సాహాన్ని పొందుతుందని అంటున్నారు. కొన్నిసార్లు బయటకు వెళ్ళి పరిగెట్టడం లేదా నడవడం కుదరదనీ, అలాంటి సమయంలో ఆలోచనలు పక్కదారి పట్టే పనులు చేపట్టాలనీ చెబుతున్నారు. తోటపని లేదా టీవీ చూడడం, కొత్త కొత్త వంటలు ప్రయత్నించడం వంటి వాటివలన మెదడు రీఫ్రెష్ అయి మరింత చురుకుగా పనిచేస్తుందన్నది వీరి వాదన. ఇదే విషయం మీద వీరు పరిశోధనలు కూడా నిర్వహించారు. కొంతమందికి కఠినతరమైన పజిల్ ఇచ్చి ఒక రోజులో పూర్తి చేయమన్నారు. పజిల్ పూర్తి చేసే ప్రక్రియలో చాలామంది ఎక్కువ సేపు ఆలోచించారు. ఎంతసేపు ఆలోచించినా వారు సకాలంలో పజిల్ పూర్తిచేయలేకపోయారు. మరికొందరు తమ ఆలోచనలకు తాత్కాలికంగా స్వస్తి చెప్పి మనసును మరో పనివైపు కేంద్రీకరించారు. వీరు మొదటి గ్రూపు వారికన్నా చురుకుగా ఆలోచించి తక్కువ సమయంలో పజిల్ పూర్తి చేశారు.



## తల రంగుతో రొమ్ము కేన్సర్?

తలకి వేసుకునే రంగుకీ, రొమ్ము కేన్సర్‌కీ సంబంధం ఉందా అన్న అనుమానం వస్తోందా? ఉంది అంటున్నారు న్యూజెర్సీ పరిశోధకులు. హెయిర్ డైలలో లేత రంగుల కన్నా ముదురు రంగులే ఎక్కువ హాని కలిగిస్తాయని వీరు చెబుతున్నారు. ఆఫ్రికా, అమెరికా మహిళల మీద వీరు అధ్యయనం నిర్వహించారు. సుదీర్ఘకాలం పాటు వీరు జుత్తుకు ఉపయోగిస్తున్న రంగు, రిలాక్సర్ల గురించి అడిగి తెలుసుకున్నారు. వీరిలో కొందరు లేత రంగులు ఉపయోగిస్తుండగా, మరికొందరు ముదురు రంగులను జుత్తుకు ఉపయోగిస్తున్నారు. లేత రంగుల కన్నా ముదురు రంగులు జుత్తుకు ఉపయోగించిన వారిలోనే రొమ్ము కేన్సర్ లక్షణాలను వీరు గుర్తించారు. అయితే కేవలం జుత్తు రంగు కారణంగానే వీరిలో కేన్సర్ లక్షణాలు బయటపడ్డాయా? లేదా మరే కారణమైనా ఉందా? అన్న విషయాన్ని వీరు స్పష్టం చేయలేకపోతున్నారు. జుత్తుకు రంగు అనేది శిరోజాలకే కాకుండా శరీర ఆరోగ్యం మీద కూడా ప్రభావం చూపుతుందని వీరు స్పష్టం చేస్తున్నారు. ముఖ్యంగా సెలూన్లకు వెళ్ళి జుత్తుకు రంగు వేయించుకోవడం మరింత ప్రమాదకరమని వీరు హెచ్చరిస్తున్నారు. జుత్తుకు రంగు వేసుకోవాలనుకుంటే రసాయన రహిత పదార్థాలనే ఉపయోగించాలని వీరు సూచిస్తున్నారు.



## ఒత్తిడిని చిత్తు చేసే సైక్లింగ్

సైకిల్ తొక్కితే ఆరోగ్యం కదా? ఒత్తిడి ఎలా తగ్గుతుంది? అనే అనుమానం వస్తోందా? ఈ మాట ఆషామాషీగా చెప్పినది కాదు. అధ్యయనం నిర్వహించి మరీ తేల్చారు కెనడా అధ్యయనకారులు. సుమారు 143 మంది ఐటీ ఉద్యోగుల మీద వీరు అధ్యయనం నిర్వహించారు. వీరందరూ కార్లు, సైకిళ్ళు, బస్సుల మీద కార్యాలయాలకు వెళ్తున్నవారే! వీరు ఆఫీసుకు చేరుకున్న తరువాత



మొదటి 45 నిమిషాలలో వీరి మానసిక స్థితి, ఆలోచనా సరళి, ఆరోగ్యాన్ని అంచనా వేశారు. కార్లు, బైక్‌లు, ఇతర వాహనాలు ఉపయోగించిన వారిలో రోజంతా ఒత్తిడి కనిపించగా, సైకిల్ మీద వచ్చిన వారిలో మాత్రం అలాంటి లక్షణాలను వీరు గుర్తించలేదు. సైకిల్ మీద వచ్చినవారు రోజంతా ఆరోగ్యంగా, చురుకుగా ఆఫీసు వర్క్‌ను నిర్వహించడం వీరు గమనించారు. దీనికి కారణం సైకిల్ మీద ఆఫీసుకు రావడం అని వీరు స్పష్టం చేస్తున్నారు. చాలామంది ఉదయం లేదా సాయంత్రం కొద్దిసేపు సైక్లింగ్ చేస్తుంటారనీ, అలా కాకుండా ప్రతి రోజూ సైకిల్ మీద ఆఫీసుకు వెడితే ఆరోగ్యంతో పాటు మానసిక ప్రశాంతత కూడా లభిస్తుందని వీరు స్పష్టం చేస్తున్నారు.

## రాత్రి సమయంలో ఫోను వద్దు

రాత్రి సమయంలో పడుకున్న తరువాత కూడా చాలామంది ఫోన్‌లో మాట్లాడడం లేదా చాటింగ్ చేయడం చేస్తుంటారు. ఇది మంచిది కాదు అంటున్నారు ఆస్ట్రేలియా పరిశోధకులు. రాత్రి పడుకుని చీకట్లో ఫోన్‌లో మాట్లాడడం, చాటింగ్ చేయడం వలన నిద్రలేమితో పాటు కంటిచూపు దెబ్బతినే ప్రమాదం ఉందని వీరు హెచ్చరిస్తున్నారు. సుమారు వెయ్యి మంది మీద వీరు అధ్యయనం నిర్వహించిన అనంతరం ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నారు. రాత్రి పడుకునే ముందు ఫోన్ ఉపయోగించడం వలన రాత్రి సమయంలో గాఢనిద్ర పట్టదనీ, దీని కారణంగా పలు ఆరోగ్య సమస్యలు ఉత్పన్నమవుతాయని అంటున్నారు. అంతేకాకుండా చీకట్లో ఫోన్ కంటి దగ్గరగా పెట్టుకుని చాటింగ్ చేయడం



వలన కంటి రెటీనా మీద ప్రభావం పడుతుందని కొన్నిసార్లు కంటి చూపు దెబ్బతినే ప్రమాదం కూడా ఉందని వారు చెబుతున్నారు. రాత్రి సమయంలో బెడ్‌కి దూరంగా లేదా కప్‌బోర్డులో ఫోనును పెట్టుకుని పడుకోవాలని వారు సూచిస్తున్నారు.

—అవినాష్

# హోమియో వైద్యానికి
# ఇప్పుడు స్టార్ స్టేటస్ వచ్చింది

డా. మధు వారణాశి, ఎం.డి
ప్రముఖ హోమియో వైద్యులు
ప్లాట్‌నెం 188,
వివేకానందనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైదరాబాద్
ఫోన్ : 8897331110
8886 509 509



**హోమియో వైద్యరంగంలో డా.మధువారణాశి పేరు తెలియని వారు లేరు. రెండున్నర దశాబ్దాలు పైబడిన ప్రాక్టీస్‌లో ఆయన సాధించిన విజయాలు ఎన్నో...ఎన్నెన్నో. ఎన్ని విజయాలు సాధించినా సామాన్య రోగులకు అందుబాటులో ఉండటం ఆయన ప్రత్యేకత. పేషెంట్ ఆర్థిక స్థితిగతులను కూడా ఆలోచిస్తాడు కాబట్టే అందరూ ఆయన్ను "మా డాక్టర్ గారు దేవుడు" అంటారు. ఆయనతో ఇంటర్వ్యూ...**

***సక్సెస్‌ఫుల్ కెరీర్‌ని ఎంజాయ్ చేస్తున్నారు కదా! ఫ్యూచర్ ప్లానింగ్స్ ఏంటి?***

ఇకపై **ఆర్థికంగా వెనకబడిన వారికి హెపటైటిస్-బి, హెర్పిస్, హెచ్ఐవి వ్యాధిగ్రస్తులకు 50శాతం డిస్కౌంటుతో చికిత్సను అందించాలని నిర్ణయించుకున్నాను.** దాన్ని గత నెల నుంచే అమల్లోకి తీసుకొచ్చాను. త్వరలోనే ఇతర వ్యాధులకు చికిత్స తీసుకునే వారిలో పేదలకు 50శాతం తగ్గిస్తాను. ఈ ఏడాది ఏప్రిల్ 10న హోమియో వైద్యపితామహుడు డా.హానిమన్ బర్త్‌డే సందర్భంగా దాదాపు 100 మందికి ఉచితంగా ట్రీట్‌మెంట్, మందులు ఇచ్చాము. ఇకపై ప్రతిఏటా హానిమన్ బర్త్‌డే రోజున ఈ ఫ్రీ ట్రీట్‌మెంట్ కొనసాగుతుంది.

***మీరు ప్రజాసేవలోకి రాబోతున్నట్టుగా వార్తలు వినిపిస్తున్నాయి. రాబోయే ఎన్నికల్లో పోటీ చేసే అవకాశం ఉందా?***

కొందరు హితులు, సన్నిహితులు రాజకీయాల్లోకి రమ్మని ఆహ్వానిస్తున్నారు. ప్రోత్సహిస్తున్నారు. నాకూ ఆసక్తి ఉంది. అయితే ఇప్పుడే ఏమీ చెప్పలేను. ఆ సమయంలో పరిస్థితులను బట్టి నిర్ణయం తీసుకుంటాను.

***కెరీర్ పరంగా సంతృప్తి కలిగించిన సందర్భాలు...?***

ఇప్పటికి ఎన్నో వేల మందికి ట్రీట్‌మెంట్ ఇచ్చాను. రెండు, మూడు నెలలకు మించి బతకరు అని బయటి ఆసుపత్రులలో డిక్లేర్ చేసిన కేసులలో పేషెంట్ లైఫ్‌ని 4-5 ఏళ్లు పెంచినపుడు వారి కళ్లలో కనిపించిన కృతజ్ఞత ఎంతో సంతృప్తినిచ్చింది. నా కెరీర్‌లో అలాంటి కేసులెన్నో ఉన్నాయి.

***మీ ప్రాక్టీస్ స్ఫూర్తితో కొందరు హోమియో వైద్యం చదివారని విన్నాం?***

నన్ను చూసి ఇన్‌స్పైర్ అయి వారి పిల్లలను బి.హెచ్.ఎం.ఎస్ చదివించారు. వారు కోర్సులు కూడా పూర్తి చేసి ఇప్పుడు ప్రాక్టీస్ చేస్తున్నారు. ఇంకొంత మంది చదువుతున్నారు. దీన్నిబట్టి హోమియో వైద్యానికి ఎంత ఆదరణ లభించిందో, ఎంతటి స్టార్ స్టేటస్ వచ్చిందో అర్థం చేసుకోవచ్చు.

***మానసిక వికలాంగులకు, అనాథ పిల్లలకు గత 10 ఏళ్లుగా సేవలు అందిస్తున్నారు కదా. ఇప్పుడు కొత్తగా ఏవైనా సేవాకార్యక్రమాలు ప్లాన్ చేస్తున్నారా?***

చదువులో మంచి మార్కులు వచ్చినా పేదరికం కారణంగా చదవలేని పది, ఇంటర్ విద్యార్థులను కొందరిని ఎడాప్ట్ చేసుకుని వారికి కావలసిన పుస్తకాలు, ఫీజులు, ఇతర వసతులు కల్పించి చదివించాలని నిర్ణయం తీసుకున్నాను. ఆ ప్రణాళిక కూడా తుదిదశకు చేరుకుంది. ఇటీవలే గాజుల రామారం వద్ద అనాథ పిల్లల వసతి గృహ నిర్మాణానికి ధనసహాయం అందించాను. తిరుపతికి సమీపంలోని నెరబైలు వద్ద రామాలయం జీర్ణోద్ధరణకు కొంత ఆర్థిక సహాయం అందించాను. ఇకపై వారణాశి ఛారిటబుల్ ట్రస్ట్ ద్వారా సేవా కార్యక్రమాలు విస్తృతం చేయబోతున్నాను.

## హోమియోతో
# అంగస్తంభన సమస్య దూరం

శ్రీనివాస్‌కి 28 సంవత్సరాలు. ఆరునెలల క్రితం అందమైన అమ్మాయితో పెళ్ళయింది. తను ఊహించుకున్న దానికన్నా అందగత్తె భార్యగా రావడంతో ఆనందానికి అవధులు లేవు. ఇతరత్రా ఆర్థిక ఇబ్బందులు కూడా లేకపోవడంతో శృంగార జీవితాన్ని బాగా ఎంజాయ్ చేశాడు. ఆరు నెలలు ఆరు రోజుల్లా గడిచిపోయాయి. కానీ ఒకరోజు పడకగదిలో వైఫల్యం. ఎంత ప్రయత్నించినా అంగస్తంభన కాలేదు. అనుకోకుండా వచ్చిన మార్పు ఎందుకో అర్థం కాలేదు. రోజూ రెండు మూడు సార్లు శృంగారంలో పాల్గొనే తను ఇప్పుడు రెండు, మూడు రోజులకు ఒకసారి కూడా భార్యతో గడపడంలేదు. భార్య నోరు తెరిచి ఏమీ అడగకపోయినా సుఖాన్ని అందించకలేకపోతున్నాననే బాధ రోజురోజుకి పెరగసాగింది. భార్యప్రేరేపించినా మధ్యలోనే అంగం మెత్తబడిపోతోంది. శృంగారంలో పాల్గొనాలనే కోరిక ఉన్నా సాధ్యం కావడం లేదు. దాంపత్య జీవితానికి ఇక పనికిరానేమో అని భావించి ఒకసారి డాక్టర్‌ని కలిసి పరిస్థితిని వివరిద్దామని నిర్ణయించుకుని నా దగ్గరకు వచ్చారు. ఎంతో ఆవేదనతో తన బాధనంత చెప్పుకోచ్చారు.

**కారణాలు అనేకం :** మానసిక ఒత్తిడి, అధిక శారీరక శ్రమ, మానసిక ఆందోళన వంటివి ఈ సమస్యకు ముఖ్యకారణాలుగా చెప్పుకోవచ్చు. మానసిక ఆందోళనతో లేదా శారీరక ఒత్తిడితో వచ్చే సమస్యలను చాలా వరకు మంచి వైద్యునితో కౌన్సెలింగ్ చేయించుకోవడం ద్వారా తగ్గించుకోవచ్చు. మంచి నిద్రతో అలసట, మానసిక ఒత్తిడి తగ్గుతుంది. దీనివల్ల శరీరంలో లైంగికపరమైన కోరికలు పెరుగుతాయి. శృంగార జీవితానికి మంచి మనసు, మంచి ఆహారం దోహదపడతాయి. దంపతులు మూడ్‌ను పెంచే విషయాలను పరస్పరం చర్చించుకోవాలి. చిన్న చిన్న పనులతో మొదలుపెట్టాలి. దీంతో ఇద్దరికీ తెలియని ఉద్రేకం మొదలవుతుంది. శృంగారం విషయంలో స్త్రీపురుషుల మధ్య సరియైన ఆకర్షణ లేకపోతే లైంగిక సమస్యలు తలెత్తుతాయి. అలాకాకుండా తన భాగస్వామిలో ఒకరకమైన ఆసక్తి లేకపోయినా శృంగార జీవితంలో సమస్యలు ఎదురవుతాయి. ఒకవేళ స్త్రీనుంచి సరియైనప్రేరణ, కోరిక లేకపోయినా తన నిర్లిప్తత వల్ల ఒక రకమైన నిరాశావాదం ఏర్పడి అంగస్తంభనవైఫల్యం జరుగుతుంది.

**చికిత్స :** లైంగిక సమస్యలను దూరం చేసే ఔషధాలు హోమియోలో చాలా ఉన్నాయి. అంగస్తంభన వైఫల్యం, శీఘ్రస్ఖలనం వంటి సమస్యలకు హోమియో మందులు వరప్రసాదంగా పనిచేస్తాయనడంలో అతిశయోక్తి లేదు. ఇది చాలా సున్నితమైన అంశం. రోగి బలహీనతలపైన ఆధారపడి ఉంది. సరియైన వైద్యుని పర్యవేక్షణలో మందులు వాడితే లైంగిక జీవితం ఎంతో హాయిగా ఉంటుంది. శారీరక, మానసిక లక్షణాలపై ఆధారపడి చికిత్స చేస్తే ఎలాంటి సమస్య అయినా దూరమవుతుంది. చికిత్సతో పాటు సరియైన ఆహారం తీసుకుంటే అంగ స్తంభన సమస్య నుంచి సులువుగా బయటపడవచ్చని వివరించడంతో శ్రీనివాస్‌లో ఎంతో ధైర్యం వచ్చింది. కొన్ని నెలలు చికిత్స తరువాత అతని శృంగార జీవితం హాయిగా సాగిపోతోంది.




**'ఏంట్రా... ఏంటి నీ దాష్టీకం? నువ్వు ఎవడివిరా మమ్మల్ని అవతలికి వెళ్ళిపొమ్మని చెప్పటానికి? నీదా ఈ నగరం? నీ అబ్బదా ఇది?' షాడో వెనుకనుంచి ముందుకు వస్తూ బిగ్గరగా అడిగాడు.**

**ఆగిపోయాయి అక్కడ వినవస్తున్న శబ్దాలు అన్నీ. అతను ఏదో మంత్రం వేసినట్టు, తెరిచి ఉన్న నోళ్ళు తెరిచినట్టు ఉండగానే, కొయ్యబొమ్మల మాదిరి బిగుసుకుపోయారు అరిచి కేకలు పెడుతున్న ఆ మనుష్యులందరూ. ఇళ్ళల్లోనుంచి బయటికి వచ్చిన ఆడంగులు అయితే, చలిగాలులు చాలా బలంగా వీస్తున్నట్టు గజగజ వణికిపోవటం మొదలుపెట్టారు.**

చేతిలో సిగరెట్ కిందపడేసి, చేతుల్ని పాంటుకేసి రుద్దుకున్నాడు షాడో. అతను ఊహించిన విధంగానే ఆశ్చర్యం నుంచి వెంటనే తేరుకున్నాడు రఫ్‌గా మాట్లాడిన వ్యక్తి. పళ్ళు బిగించి పెద్ద పులి మాదిరి గంగారం మీదికి ఎగబడ్డాడు. పిడికిళ్ళు బిగించి అతని మొహం మీద బలంగా కొట్టబోయాడు.

అవి గనుక కనెక్ట్ అయివుంటే గంగారాం మొఖం, మధ్యకు విచ్చితీసిన పుచ్చకాయ మాదిరి తయారై పోయి ఉండేది. కనెక్ట్ కాలేదు. మధ్యలో ఉండగానే అడ్డుపడ్డాయి షాడో చేతులు. బలంగా ఒడిసి పట్టుకున్నాయి.

'ఈ నగరం కాదు మాది. మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారో మాకు తెలియదు. కాని మీరు మాట్లాడుతున్న మాటలు మాత్రం మహా అసహ్యంగా, అవమానకరంగా ఉన్నాయి. దయచేసి కాస్తంత మర్యాదగా అరుచుకోండి' మృదువుగా, మెత్తగా, చాలా మెల్లిగా అన్నాడు.

రకరకాల రంగులు ప్రత్యక్షం అయ్యాయి ఆ మనిషి మొఖంలో. 'రండిరోయ్ వచ్చి వీడి అంతు చూడండిరోయ్' తలను పక్కకు తిప్పి ఒకే ఒక రంకె పెట్టాడు.

వెంటనే కదిలారు అరుపుల్ని ఆపి బొమ్మల మాదిరి నిలబడి ఉన్న అతని సహచరులు... చేతుల్ని ముందుకు జాచి గుంపుగా వచ్చేశారు షాడో మీదికి.

ఎడమపాదంతో నేలను బలంగా తన్నాడు గంగారాం. కుడిచేత్తో తొడను చరిచి గంగాళం మాదిరి నోరు తెరిచాడు.

ఆ తర్వాత జరగబోయేది ఏమిటో తెలుసు షాడోకి. తను పట్టుకున్న మనిషి చేతుల్ని వదిలేసి చెవుల్ని గట్టిగా మూసుకున్నాడు.

మబ్బులు కమ్మిన ఆకాశంలో మెరుపుల కంటే ముందుగా వినవచ్చే పిడుగుల శబ్దం మాదిరి మహా భయంకరంగా వెలువడింది గంగారాం నోటినుంచి ఒక పొలికేక.

నిజం కాదు గాని, తన పాదాల కింద ఉన్న నేల స్వల్పంగా కంపించినట్టు అనిపించింది షాడోకి. ముందుకు దూకుతున్న ఆ అపరిచిత వ్యక్తులకైతే మతులు

### జరిగిన కథ

**కొం**దరి స్వార్థపూరిత అభియోగాల మూలంగా దొంగగా మారతాడు షాడో. అతన్ని సీబీఐలో చేర్చుకునేందుకు అతని వెంటబడతాడు సీబీఐ చీఫ్ కులకర్ణి. అతన్నుంచి తప్పించుకునేందుకు జపాన్ వెళ్ళి అక్కడి విద్యాపీఠంలో చేరి కుంగుఫూ నేర్చుకుంటాడు. ఫ్యుజీశాన్‌కు శత్రువుగా మారతాడు. అక్కడినుంచి తన స్నేహితుడు గంగారాంతో కలిసి హాంకాంగ్ సిటీ కాంటన్‌లో అడుగు పెడతాడు.

ఆ తర్వాత...



పోయాయి. తాము ఎందుకు కదిలారో మర్చిపోయి నట్టు మరోసారి బొమ్మల మాదిరి బిగుసుకు పోయారు.

తేరుకుని తమ పని తాము మొదలుపెట్టే అవ కాశం వారికి ఇవ్వలేదు గంగారాం. 'రౌడీల్లోకల్లా అతి పెద్ద రౌడీని నేను. కావాలంటే షోలాపూర్ సెంటర్లోకి పోయి అడగండి... ఈ గంగారాం సాబ్‌కి కోపం వస్తే ఎలా ఉంటుందో మీకు తెలుస్తుంది. రండిరా... రండి... వచ్చి నా తల పగలగొట్టండి' అని అరుస్తూ వారి మధ్యలోకి దూసుకుపోయాడు.

చెవుల్ని కప్పుకున్న చేతుల్ని తీసేసి, షర్టు పై జేబులో ఉన్న ఇంకో సిగరెట్‌ని వెలిగించుకుంటూ అలాగే నిలుచున్నాడు షాడో.

చూస్తూచూస్తూ ఉండగానే, గాలిలోకి ఎగిరి అవతలపడిపోయారు నలుగురు వ్యక్తులు. నడుములు పట్టుకుంటూ పక్కకు పరుగెత్తిపోయారు ఇంకో నలు గురు. మొఖాలు తీవ్రంగా గాయపడడంతో, చేతు లతో కప్పుకుంటూ, నేలమీద చతికిలపడిపోయారు ఇంకో నలుగురు.

పన్నెండు సెకన్లలో జరిగిపోయిందా సంఘటన. పదమూడో సెకనులో వెనుతిరిగి దూరంగా వెళ్ళి పోయారు మిగిలిన వారందరూ.

'వెళ్ళిపోరా.. వెళ్ళిపో... బొట్టుపెట్టి ప్రత్యేకంగా చెప్పాలా నీకు?' షాడో దగ్గర నిలబడిపోయిన మనిషివైపు మహాక్రూరంగా చూస్తూ హెచ్చరించాడు గంగారాం, చిమచిమలాడుతున్న తన చేతుల్ని లాల్చీకి రుద్దుకుంటూ.

'ఎవరు నువ్వు?' తడి ఆరిపోయినట్టు తయారైన కంఠంతో అడిగాడు ఆ మనిషి.

'నేను ఎవరినో చెపితేగాని నువ్వు అవతలికి వెళ్ళవా?' కనుబొమల మధ్యలో నుంచి మరింత క్రూరంగా చూస్తూ అడిగాడు గంగారాం.

'మేము ఎవరిమో నీకు తెలుసా?' మరో ప్రశ్న వేశాడు ఆ మనిషి.

అధికతరం అయిపోయింది గంగారాం కోపం. 'అవతలికి పోరా నాయనా అని అతిమర్యాదగా చెపు తుంటే నీకు అర్థం కావటం లేదని నాకు తెలిసిపో యింది. మాటలు పనికి రావురా మీకు. చేతులతో చెప్పాలిందేనని నాకు బోధపడింది' అంటూ ఎగిరి దూకాడు అతని మీదికి.

అంతే. గిరుక్కున వెనక్కితిరిగాడు ఆ మనిషి. అడ్డం వచ్చిన షాడోని బలంగా అవతలికి నెట్టి ఒక్క సారిగా పరుగు అందుకున్నాడు.

తూలి వెనక్కి పడిపోయిన షాడోని, గబుక్కున పట్టుకుని సరిగ్గా నిలబెట్టాడు గంగారాం. 'దెబ్బ ఏమైనా తగిలిందా గురూ?' అని పరామర్శించాడు.

'నాకు దెబ్బ తగిలిందో లేదో తరువాత తేల్చు కుందాం. ముందు అటు చూడు' అంటూ పక్కకు చూపించాడు షాడో.

ముఖాలు పగిలి నేలమీద చతికిలపడిన వ్యక్తులు, గంగారాం చేతుల విసురుకు భయపడి దూరంగా జరిగిన వాళ్ళు అందరూ కట్టకట్టుకుని పరుగులు తీస్తున్నారు.

'అదీ మన దెబ్బ. మనతో పెట్టుకుంటే ఎవరైనా సరే మటాష్ అయిపోవాల్సిందే' సగర్వంగా చెపుతూ మధ్యలోనే ఆ మాటల్ని మింగేశాడు గంగారాం.

'గుంపులు గుంపులుగా ఇళ్ళలో నుంచి బయటికి వచ్చిన స్త్రీలు కూడా పరుగులు తీస్తున్నారు ఇళ్ళల్లోకి. నడక సరిగ్గారాని తమ పిల్లల్ని అమాంతంగా ఎత్తి భుజాలమీద వేసుకుని మరీ ఇళ్ళల్లోకి పోతున్నారు.

'ఏంటి గురూ.... ఏంటి వాళ్ళందరూ...' అని కామెంట్ చేయబోయి, ఆ మాటల్ని కూడా మధ్య లోనే ఆపేశాడు గంగారాం.

కన్నుమూసి కన్ను తెరిచేటంతలో నిర్మానుష్యం అయిపోయిందా ప్రదేశం. తను తన జతగాడు తప్ప మరెవ్వరూ కనిపించని ఎడారిగా మారిపోయేసరికి, బెరుకు నిండిన కళ్ళతో షాడో వైపు చూశాడు.

'నీకు ఈ మధ్య తుత్తర మరీ ఎక్కువైపోయింది. ఎందుకు ఏమిటి అని కూడా చూసుకోకుండా ఎవరు బడితే వాళ్ళ మీదికి ఎగబడుతున్నావ్' సింపుల్‌గా అన్నాడు షాడో.

రోషం వచ్చేసింది గంగారాంకి. 'నాది తుత్తర అన్నావ్... బాగానే ఉంది. మరి నీది? నువ్వెందుకు



పరిగెత్తుకు వచ్చావ్?' విసురుగా అడిగాడు.

తమకు పాతిక గజాల దూరంలో ఉన్న ఒక ఇంటికేసి తల ఊపాడు షాడో. అటుచూసి చెవులు రిక్కించిన గంగారాంకి సన్నగా వినిపించింది ఒక కంఠం.

విపరీతమైన బాధలో ఉన్నది కాబోలు దీనాతి దీనంగా ఆక్రందిస్తోంది ఎవరో ఆడమనిషి.

'మనం తన్నితరిమేసిన దొంగనాయాళ్ళు అరిచిన అరుపులకు ఎవరో చాలా బాధపడినట్లున్నారు. అవమానాన్ని భరించలేక ఏడుస్తున్నారు' వెంటనే తన అభిప్రాయాన్ని వెల్లడించాడు గంగారాం.

వెల్లడించిన తర్వాత గుర్తుకువచ్చింది అతనికి. తాము తన్ని తరిమేసిన వాళ్ళు అరవటం మొదలు పెడుతూ ఉండగానే తన జతగాడు అటుకేసి కదిలిన సంగతి.

'ఏంటి గురూ... ఏంటి సంగతి?' తనకు అర్థం కానిది ఏదో ఉన్నదని గ్రహించి చిన్నగా అడిగాడు.

సమాధానం చెప్పలేదు షాడో. పెద్దపెద్ద అడుగులు వేస్తూ ఆ కట్టడం దగ్గరికి పోయాడు. మూసి ఉన్న తలుపులు మీద చేయి వేయబోతున్న సమయంలో ఓరగా తెరుచుకున్నాయి ఆ కట్టడం పక్కనే ఉన్న మరో కట్టడపు తలుపులు.

అరిచి కేకలు పెడుతున్న జనంతో కలబడక ముందు, వారిద్దరినీ వద్దని తల ఊపి సైగలు చేసిన వృద్ధమాత ఆ తలుపుల వెనుక నుంచి బయటికి తొంగి చూసింది.

'మీరు ఎవరో గాని వట్టి మందమతులు మాదిరిగా ఉన్నారు. అది షాన్‌సూ నివసించే ఇల్లు.' చిన్న కంఠంతో వారిద్దరికి మాత్రమే వినిపించేటట్లు చెప్పింది.

మూసి ఉన్న తలుపుల్ని తట్టి లోపలివారిని పిలిచేందుకు సిద్ధం అవుతున్న షాడో వెంటనే విరమించుకున్నాడు ఆ ప్రయత్నాన్ని.

'షాన్‌సూ ఎవరో మాకు తెలియదు. విషయం ఏమిటో వివరంగా చెప్పగలవా తల్లీ?' వినయంగా అడిగాడు.

'ఓరినీ... మీరు ఈ నగరానికి చెందిన వాళ్ళ మాదిరిగా కనిపించడం లేదు. షాన్‌సూ ఎవరో మీకు తెలియకపోవడం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది' ఓరగా తీసిన తలుపుల్ని మరికొంచెం విశాలంగా తెరిచి, తలను ఇంకాస్త బయటికి పెడుతూ అన్నది ఆమె.

'నగరానికే కాదు తల్లీ.. అసలు ఈ చుట్టుపట్ల ఉండే ఏ దేశానికీ చెందిన వాళ్ళం కాదు మేము. మా ఖర్మ కాలిపోవడం వల్ల ఇటుగా రావటం జరిగింది' అంటున్న గంగారాం భుజం మీద చెయ్యివేసి బలంగా అదిమాడు షాడో.

'హుహుశాన్‌కి చెందిన ఒక మరబోటు మీద పని చేస్తూ ఉండేవాడు. నోరు మూసుకుని తన పనేదో తను చేసుకోకుండా, పోలీసులకు రిపోర్టు చేశాడు. అంతే' అంటూ షాడో ఎంటర్ కాబోయిన కట్టడం వైపు చేయి ఊపింది ఆమె.

అటుచూసిన షాడోకి, ఆగి ఆగి వీస్తున్న గాలికి రెపరెపలాడుతున్న నీలం నలుపు రంగులు కలిసిన రిబ్బన్ ఒకటి కట్టడం చూరుకు వ్రేలాడుతూ కనిపించింది.

'హుహుశాన్‌కి కోపం వచ్చినందుకు గుర్తు అది. ఆ గుడ్డ ముక్క ఉన్న ఇంటికి ఎవరూ పోకూడదు. ఆ ఇంటిలో ఉన్న వారితో మాట్లాడకూడదు. వాళ్ళకి ఎటువంటి సాయం చేయకూడదు. ప్రతిరోజు ఇదే సమయానికి వచ్చి నోటికి వచ్చిన మాటలతో అవమానించి పోతూ ఉంటారు ఆ దుర్మార్గుడి అనుచరులు. ఇప్పుడు మీకు కూడా రాసిపెట్టినట్టే ఉంది' అన్నది ఆమె.

'అదికాదు తల్లీ.... ఇంట్లో ఎవరో...' అనబోయాడు షాడో.

బయటికిపెట్టిన తలను చటుక్కున లోపలికి తీసేసుకున్నది ఆమె. ఓరగా తెరిచిన తలుపుల్ని దభేలున మూసేసుకున్నది.

ప్రశ్నలు నిండిన కనులతో గంగారాం వైపు చూశాడు షాడో.

'రోట్లో తలకాయ పెట్టి రోకటిపోటుకు భయపడటం దేనికి గురూ. పోయి తలుపులు తట్టేస్తే ఒక పని అయిపోతుంది' అంటూ ఈసారి తానే పోయి మూసి ఉన్న తలుపుల్ని దబదబలాడించాడు గంగారాం.

రెండు నిమిషాలు పట్టింది సమాధానం వినరావటానికి. 'మగదిక్కు లేని మనిషిని. మీకేదో ద్రోహం చేశాడని చెప్పి పోలీసులకు పట్టించేశారు గదా... ఇంకా ఏం చేయటానికి వచ్చారు?' నీరసంగా వినవచ్చింది ఆ కంఠం.

'తల్లీ... మేము నువ్వు అనుకుంటున్నట్టు పగవాళ్ళం కాదు' అంటూ తాము అక్కడికి ఎందుకు వచ్చారో చెప్పాడు గంగారాం.

భారంగా అడుగులు వేస్తూ వచ్చింది ఒక ఆడమనిషి. ఎంతో ప్రయత్నం మీద, శరీరంలో ఉన్న శక్తి

**కార్లు, మోటార్‌బైకుల హారన్లతో రద్దీగా ఉందా రోడ్డు. అంతలోనే హాహాకారాలతో ఆ ప్రదేశం దద్దరిల్లిపోవటం మొదలైంది. జనం పరుగులుపెడుతున్నారు. దుకాణాలు మూతలు పడ్డాయి. నిర్మానుష్యంగా మారిన ఆ రోడ్డుపై అతడు గుండ్రంగా తిరుగుతూ దొరికినవాడిని దొరికినట్టు విసిరికొడుతున్నాడు. మీదకొచ్చినవాడిని పిడిగుద్దులతో ఉతికేస్తున్నాడు. ఇంతకీ ఎవరతను? ఆ గొడవంతా ఏమిటి?**

నంతా కూడగట్టుకుని తలుపుల్ని తెరిచి, వెంటనే కింద చతికిలబడిపోయింది.

ఝల్లుమన్నది గంగారాం శరీరం. 'గురూ... నిండు చూలాలు.. నొప్పులు మొదలైనట్టున్నాయి. పరిస్థితి మాత్రం తిన్నగా లేదు' అంటూ ముందుకు వంగాడు ఆమెను పైకి లేపటానికి.

ఉన్నట్టుండి తెరుచుకున్నాయి అంతకుముందే మూసుకున్న పక్క కట్టడపు తలుపులు. మరోసారి తలను బయటపెట్టింది వృద్ధురాలు.

'నొప్పులు మొదలై చాలాసేపు అయింది. బాధను భరించలేక గగ్గోలుగా ఏడుస్తోంది' గుమ్మాన్ని దాటి ఒక్క అడుగు కూడా బయట పెట్టకుండా చెప్పింది.

'తల్లీ... వయసులో పెద్దదానివి. కాస్తంత దగ్గరికి వచ్చి ధైర్యం చెప్పచ్చు కదా' అన్నాడు గంగారాం.

'వట్టొట్టి మాటలతో జరిగే పనికాదు. హాస్పిటల్‌కి తీసుకుపోవాలి. అది నా వల్ల అయ్యే పని కాదు. హుహుశాన్‌కి వెంటనే తెలిసిపోతుంది' అంటూ మళ్ళీ తలుపుల్ని మూసేసుకుని లోపలికి వెళ్ళిపోయిందామె.

మెలికలు తిరిగిపోతున్నది కింద చతికిలబడిన యువతి. చెమటలతో నిడిపోతోంది ఆమె శరీరం.

రెండో ఆలోచన చేయలేదు గంగారాం. చటుక్కున ఆమెను అమాంతంగా చేతుల్లోకి ఎత్తుకున్నాడు.

'అరమైలు దూరంలోనే ఉంది ఒక హాస్పిటలు. నేను చూశాను' అంటూ మెయిన్ రోడ్డు వైపు పరుగులాంటి నడక మొదలుపెట్టాడు.

మూడు వంతులు కాలి ఎప్పుడో ఆరిపోయింది షాడో చేతిలో ఉన్న సిగరెట్. దాన్ని అవతలికి విసిరేసి మరొకటి వెలిగించుకుంటూ, అతన్ని క్లోజ్‌గా ఫాలో అయ్యాడు.

పది నిమిషాలు పూర్తిగా గడవకముందే చేరుకున్నాడు గంగారాం తను అంతకుముందు అబ్జర్వ్ చేసిన హాస్పిటల్‌ని.

'అర్జంటు కేసు. వెంటనే చూడాలి. డాక్టర్‌ను పిలిపించండి' ఆశ్చర్యంగా చూసిన రిసెప్షనిస్టుకు చెపుతూ, చేతుల్లో మెలికలు తిరిగిపోతున్న యువతిని అక్కడ కనిపించిన ఒక బల్ల మీద పడుకోబెట్టబోయాడు.

'ఆగు.. ఆగిపో' ఖంగుమంటూ వినవచ్చింది ఒక కంఠం.

తలతిప్పి చూసిన అతనికి మెడలో స్టెత్ చేతుల్లోకి తీసుకుంటూ వచ్చిన ఒక డాక్టరు కనిపించాడు.

'సారూ.... ఈమె చాలా...' అంటూ పరిస్థితిని



వివరించబోయిన అతన్ని తన చేతిని ఎత్తి మరోసారి ఆపేశాడు ఆ పెద్దమనిషి.

'ఈమె భర్త పేరు షాన్‌సూ కదా?' అడిగాడు.

షాడో వైపు చూశాడు గంగారాం. తల ఊపాడు షాడో.

'హుహుశాన్ ఆర్థిక సహాయంతో నడుస్తున్న ప్రదేశం ఇది. ఆయన వెలివేసిన వారికి ఇక్కడికి వచ్చే అర్హత లేదు. బయటికి వెళ్ళిపొండి' నిర్వికారంగా చెప్పి ఎలా వచ్చాడో అలాగే సైలెంట్‌గా లోపలికి వెళ్ళిపోయాడు ఆ డాక్టరు.

ఎర్రబడి పోయాయి గంగారాం కళ్ళు. పటపట మని శబ్దం చేశాయి అతని దంతాలు.

'నువ్వు ఈ అమ్మడిని జాగ్రత్తగా చూస్తూ ఉండు' అంటూ తన చేతుల్లోని యువతిని షాడోకి అప్పగించబోయాడు.

తల అడ్డం తిప్పాడు షాడో. నిర్ఘాంతపోయాడు గంగారాం. 'గురూ... నీకు హుహుశాన్ అంటే దడ పుట్టిందా?' అని అడిగాడు.

సమాధానం నోటితో చెప్పలేదు షాడో. తలను పక్కకు తిప్పి రిసెప్షనిస్టును చూడమన్నట్టు సైగ చేశాడు.

తన ముందున్న ఫోన్ దగ్గరికి తీసుకుని అప్పటికే ఎవరికో రింగ్ ఇచ్చినట్టుంది ఆమె.. 'తొందరగా రండి. షాన్‌సూ భార్యకి నొప్పులు మొదలయ్యాయని ఎవరో ఇక్కడికి తీసుకువచ్చారు' అని రిపోర్ట్ చేస్తోంది.

తన చేతుల్లో ఉన్న యువతికి తీవ్రమైన షాక్ తగులుతుందన్న విషయాన్ని మర్చిపోయినట్టు దగ్గర్లో ఉన్న ఒక కుర్చీని బలంగా తన్నాడు గంగారాం. గింగిరాలు తిరుగుతూ పోయి ఎదుట ఉన్న గోడకు కొట్టుకుని ముక్కలు ముక్కలు అయిపోయిందది.

'మీరెవరూ మనుష్యులు కారు. రాక్షసులు. సాటి ఆడబిడ్డ ఇబ్బందిలో ఉంటే సాయం చేయకపోగా, అళ్ళకి ఈళ్ళకి ఫోనులు చేసి మరింతగా బాధపెట్టా లని చూసిన నువ్వు రాక్షసివి కూడా కాదు. పిశాచా నివి' అంటూ తన చేతుల్లో ఉన్న యువతిని అలాగే పట్టుకుని, రిసెప్షనిస్టు దగ్గరికి పరిగెత్తబోయాడు.

రెండు అడుగులే వేశాడు. మూడో అడుగు వేయకముందే అతని లాల్చీ వెనుక భాగాన్ని పట్టు కుని బలవంతంగా ఆపేశాడు షాడో.

'ఎందుకు ఆపటం?' కరకరలాడుతున్న కంఠంతో అడిగాడు గంగారాం.

'పరిగెత్తాల్సింది అటు కాదు ఇటు' అంటూ రోడ్డు మీదికి చూపించాడు షాడో. తలతిప్పి చూసిన గంగా రాంకి వేగంగా వచ్చి హాస్పిటల్ ముందు ఆగిన వెహి కల్ ఒకటి కనిపించింది. వేటకి బయలుదేరిన తోడేళ్ళ మంద మాదిరి కిందికి దూకుతున్న అపరిచితులు అనేకమంది కనిపించారు.

'ఒకసారి తన్ని పంపించాను. ఇంకోసారి పంపిం చటం ఏమంత కష్టం కాబోదు' అంటున్న అతని చెంపమీద సుతారంగా ఒక దెబ్బవేసి, కనులతోనే అతని చేతుల్లో ఉన్న యువతిని చూపించాడు షాడో.

అర్థం అయిపోయింది గంగారాంకి. వెహికల్‌లో వచ్చిన జనంతో తను తలపట్లు పడుతూ కాలహ రణం చేస్తే ఆమెకు చాలా ఇబ్బంది కలుగుతుంది.

'ఏంటో.... ఈ మధ్య నాకు తొందరపాటు చాలా ఎక్కువ అయిపోతోంది గురూ. చిటుకు చిటుకున వచ్చేస్తోంది కోపం. వివేకం నశించిపోతోంది' అంటూ

## ఇల్లీ బేబీ ఉంగరాలపిచ్చి!



*ఒక్కొక్కరికీ ఒక్కో పిచ్చి ఉంటుంది. ఇలియా నాకి మాత్రం ఉంగరాలపిచ్చి ఉందట! 300 రకాల ఉంగరాలు ఆమె దగ్గర ఉన్నాయట! ఎక్కడికి వెళ్ళినా అక్కడ డిఫరెంట్‌గా కనిపించిన ఉంగరాన్ని తప్ప కుండా కొనేస్తుందట! అలా కొన్నవే ఇపుడు 300కి చేరాయట! ఇంకా కొన్ని రకాలు మిగిలి ఉన్నాయనీ, అవి కనపడగానే కొంటాననీ చెబుతోంది. గత కొన్ని సంవత్సరాలుగా బాలీవుడ్‌లో సక్సెస్‌కి మొహం వాచి ఉన్న ఇలియానా తన తాజా సినిమా 'బాద్షాహో' మీద చాలా ఆశలే పెట్టుకుంది. ఈ సినిమాలో ఇలి యానా నగ్నంగా నటించిందన్న వార్తలు రావ డంతో బాలీవుడ్‌లో ఈ సినిమా మీద చర్చ మొద లైంది.*

హాస్పిటల్ బయటికి పరుగెత్తాడు.

ఆఖరి మెట్టు దిగి రోడ్డు మీదికి అడుగు పెడుతూ ఉండగానే అతన్ని చుట్టుముట్టి, చేతుల్లో ఉన్న యువతిని లాగి కింద పడవేయటానికి ప్రయ త్నించారు వెహికల్‌లో వచ్చిన వీరాధివీరులు.

అంతకుముందు చెక్కల కట్టడాల దగ్గర తన్నులు తిని పారిపోయిన వాళ్ళ మాదిరి వట్టి చేతులు కావు వారివి. ఆయుధాలున్నాయి. పొడవాటి చైన్లు, ఐరన్ పైపులు కనిపిస్తున్నాయి.

వాటిలో ఒక్కటి కూడా గంగారాం ఒంటిని తాక లేదు. సుడిగాలి మాదిరి వచ్చి వారందరి మధ్యలోకి దూరిపోయాడు షాడో.

అటూఇటూ తిరిగే కార్లు, మోటార్ బైక్స్ హార న్లతో ఒకింత రద్దీగానే ఉన్నది రోడ్డు. హాహాకారాలతో దద్దరిల్లిపోవటం మొదలెట్టింది ఇపుడు.

బండరాయి మీద కొట్టిన కుండ పగిలి, చెల్లా చెదురైన చిల్లపెంకులు మాదిరి తలా ఒక పక్కకు పరిగెత్తి, దుకాణాల చాటున, రెండతస్తుల భవనాల చాటున తలలు దాచుకున్నారు రోడ్డుమీది జనం. చటుక్కున మూతలు పడిపోయాయి అక్కడ ఉన్న షాపులన్నీ.

ఎంతోసేపు కొనసాగలేదు ఆ గందరగోళం. సరిగ్గా రెండున్నర నిమిషాలు మాత్రమే. తీవ్రమైన గాయాలతో రోడ్డుకు అడ్డంగా పడిపోయారు పది మంది అపరిచితులు. పగిలిన తలల్ని చేతులతో అదుముకుంటూ, హాస్పిటల్‌లోకి పరిగెత్తారు మరి కొందరు. వీరభద్రుడి మాదిరి చిందులు తొక్కుతున్న షాడోని అడ్డుకోవటం తమ తరం కాదని అర్థం చేసు కుని, వచ్చినదారినే రోడ్డు చివరికి పారిపోయారు మిగిలినవారు.

చిమచిమలాడుతున్న చేతుల్ని పాంటుకేసి రుద్దు కుంటూ చుట్టూచూశాడు షాడో. ఎడారి మాదిరిగా తయారైన రోడ్డుమీద అతనికి కనిపించలేదు గంగారాం. ఎర్రటి లైట్లను అదేపనిగా ఆఫ్ అండ్ ఆన్ చేస్తూ, చెవులు చిల్లులు పడిపోయేటట్టు సైరన్ మోగిస్తూ దూసుకువస్తున్న రెండు పోలీస్ వ్యాన్లు మాత్రం కనిపించాయి.

సిగరెట్ వెలిగించుకోవాలన్న కోరికను అతి బల వంతంగా అదుముకుంటూ వేగంగా పది అడుగులు వేశాడు షాడో. తన ఎడమ చేతి పక్కన కనిపించిన ఒక సన్నపాటి ఇరుకు మార్గాన్ని ఎంచుకుని అందు లోకి అడుగుపెట్టాడు. పొగలు విడుస్తూ వచ్చిన పోలీస్ వ్యాన్లు హాస్పిటల్ ముందు ఆగేసరికి, ఆ సందు చివరికి పోయి మాయం అయిపోయాడు.

***

'నాన్సెన్స్... అట్టర్ నాన్సెన్స్... ఇంతమంది ఉన్నారు మీరు. ఎన్ని ఆయుధాల్ని కలిగి ఉన్నారు... ఒక్కడంటే ఒక్కడు మీ అందరినీ చావగొట్టి తప్పించు కున్నాడని చెపుతుంటే నమ్మటానికి నేను పిచ్చిదాన్ని కాదు. ఇట్స్ ఇంపాజిబుల్' నడుము మీద చేతులు వేసుకుని, సన్నటి కంఠంతో చాలా ఘాటుగా మాట్లా డింది మిచిషీ.

'మేడమ్... మేము నిజమే చెపుతున్నాము. కావా లంటే రిసెప్షనిస్టుని అడగండి. మాకు ఫోన్ చేసి హెచ్చరించింది తను' హాస్పిటల్ స్టాఫ్ అందరూ వచ్చి, దెబ్బలు తిన్న తన వారందరికీ కట్లు సరిగ్గా కడుతున్నారో లేదో నిశితంగా పరిశీలించి చూస్తూ సమాధానం ఇచ్చాడు షాడో చేతిలో రెండంటే, రెండు పిడికిటి పోట్లను స్వీకరించిన ఒక అపరిచితుడు.

మొదటి పోటుకు అతని మొఖానికి అతు క్కున్నట్టు పక్కకు వంగిపోయింది అతని ముక్కు. రెండో పోటుకు ముందుండే దంతాల్లో రెండు వాటం తట అవే ఊడి కింద పడిపోయాయి.

రక్తంతో మలినమైపోయిన మొఖాన్ని హ్యాండ్ కర్చీఫ్‌తో అద్దుకుంటూ ఒక గోడకు ఆనుకుని నిలుచు న్నాడు.

తలలు పగిలిన వారిని, భుజాలు బెణికి బాధతో మెలికలు తిరిగిపోతున్న వారిని... అందరినీ చూసి గాఢంగా నిట్టూర్చింది మిచిషీ.

'ఐ డోన్ట్ బిలీవ్ దిస్. ఒక్కమనిషి రెండే రెండు నిమిషాల్లో ఇంతమందిని ఇంత తీవ్రంగా గాయ పరిచి, తన ఒంటి మీద ఒక్క దెబ్బ కూడా పడకుండా తప్పించుకు పారిపోయాడంటే...అది అసాధ్యం. నమ్మ బుద్ధి కావటం లేదు' అన్నది ఆమె, తన వెనుక నిల బడిన అధికారితో.

'మేడమ్.. ఇపుడు మనం మాట్లాడుకోవాల్సింది వాళ్ళకి తగిలిన దెబ్బలు గురించి కాదు. ఈ సంగతి

తెలిసిన వెంటనే వచ్చేస్తుంది హుహుశాన్ సారు దగ్గర్నించి ఫోను. దాన్ని గురించి ఆలోచించాలి' చిన్న కంఠంతో చెప్పాడు ఆమెకు మాత్రమే వినిపించేటట్టు.

అతని మాటలు పూర్తి అవుతున్న సమయం లోనే, గణగణమని మోతలు చేసింది రిసెప్షనిస్టు ముందున్న ఫోను. రిసీవర్ ఎత్తి చెవులకు ఆనించుకున్న వెంటనే తెల్లగా పాలిపోయింది ఆమె వదనం.

'మేడమ్.. మీకే ఫోను' అంటూ రిసీవర్‌ని ముందుకు జాచింది.

మూడు అంగల్లో పోయి రిసీవర్ అందుకున్న మిచిషీకి 'హల్లో' అంటూ వినవచ్చింది ఒక కీచుకంఠం అవతలినించి.

తనకు తెలియకుండానే అటెన్షన్‌లోకి వచ్చేసింది మిచిషీ. 'సర్... నేను మిచిషీని మాట్లాడుతున్నాను. ఇన్వెస్టిగేట్ చేస్తున్నాము సర్' తడబడకుండా ఉండటానికి ప్రయత్నం చేస్తూ చెప్పింది.

ఆ తరువాత వినవచ్చిన మూడే మూడు మాటల్ని ఆలకించేసరికి, రిసెప్షనిస్టు మొఖం మాదిరిగానే నెత్తురు లేనట్టు తెల్లగా పాలిపోయింది ఆమె వదనం కూడా. 'అలాగే సర్... వెంటనే సర్. మీకు రిపోర్ట్ చేస్తాము సర్. నేనే దగ్గరుండి చూసుకుంటాను సర్.' అంటూ రిసీవర్‌ని ఫోన్ మీద పడేసి, మొఖం మీద ప్రత్యక్షం అయిన చెమట బిందువుల్ని అరచేత్తో అద్దుకున్నది.




ఆ ఫోన్ ఎవరు చేశారో ఊహించేశాడు ఆమెతో వచ్చిన పోలీస్ అధికారి. అధికంగా ప్రశ్నలు వేసి ఆమెను ఇబ్బంది పెట్టలేదు. 'ఏం చెయ్యమంటారు మేడమ్...' అని మాత్రం అడిగాడు.

'వాళ్ళందరికీ కట్లు కట్టడం పూర్తి అయిన తర్వాత అందరిదగ్గరా స్టేట్‌మెంట్లు తీసుకోండి. ఆ వ్యక్తి ఎవరో పూర్తి వివరాలు అడగండి. ఆ తర్వాత...' అంటూ ఆగింది ఆమె.

'చెప్పండి మేడమ్' అంటూ ప్రాంప్ట్ చేశాడు ఆ అధికారి.

'సిటీలో ఉన్న హాస్పిటల్స్ అన్నిటినీ కవర్ చేయాలి. అనాథరైజ్డ్‌గా కాన్పులు చేసే నర్సులు, మంత్రసానులు ఎవరెవరు ఎక్కడెక్కడ ఉన్నారో చూసి అందరినీ ఒకసారి విజిట్ చేయండి' చెప్పింది ఆమె.

అలవాటు ప్రకారం తల ఊపబోయి ఆశ్చర్యంగా చూశాడు ఆ అధికారి. 'మేడమ్' అంటూ తన అనుమానం బహిర్గతం చేయబోయాడు.

గుండెల నిండా గాలి పీల్చుకుని మెల్లగా బయటికి వదిలింది మిచిషీ. 'ఈ గొడవకంతా మూల కారకుడు మన లాకప్‌లో ఉన్న షాన్‌సూ. అతగాడి భార్యకు నొప్పులు వస్తున్నాయట. ఎక్కడో ఒకచోట ఆమెకు ట్రీట్‌మెంట్ జరగాలి. ఇక్కడ అందుకు నిరాకరించటం వల్లనే ఈ రభస' అక్కడి తగాదాకి అసలు కారణాన్ని అతనికి చెప్పింది ఆమె.

స్టిఫ్‌గా నిలబడి స్మార్ట్‌గా శాల్యూట్ చేసి వేగంగా బయటికి పరిగెత్తాడు ఆ ఆఫీసర్. గాయాలపాలైన వారందరికీ కట్లు కట్టడం పూర్తి అయిన తర్వాత తను బయటికి వచ్చి తన వెహికల్‌లో కూర్చుంది మిచిషీ.

'ఎక్కడికి పోదాం మేడమ్?' వినయంగా అడిగాడు ఆమె డ్రైవర్.

'షాన్‌సూ దగ్గరికి' ముక్తసరిగా చెప్పింది ఆమె.

టైట్‌గా టర్న్ తీసుకుంది ఆ వెహికల్. సైరన్ మోగించుకుంటూ వచ్చిన దారినే వెనక్కి బయలుదేరింది అమితమైన వేగంతో.

***

'బంధువులా? హుహుశాన్ అనుచరుల్ని బంతాట ఆడుకోగల బంధువులు గాని, స్నేహితులు గాని నాకు ఉండివుంటే, ఈరోజున నేను ఇలా చీకటిగదిలో చిక్కబడి ఉండేవాడినా?' ఆశ్చర్యంగా అడిగాడు త్రీ టౌన్ పోలీస్ లాకప్‌లో ఉన్న షాన్‌సూ.

'వెటకారపు మాటలు వద్దు షాన్‌సూ.... నీకు సంబంధించని విషయంలో వేళ్ళు పెట్టటం వల్లనే నీకు ఈ గతి పట్టింది. వచ్చింది ఎవరో, నీ భార్యను వెంటబెట్టుకు పోయింది ఎవరో వెంటనే చెప్పు' కుర్చీ వెనక్కివాలి కూర్చుంటూ ఓపికగా అడిగింది మిచిషీ.

తన భార్య ప్రసక్తి వచ్చేసరికి కళవళపడిపోయాడు షాన్‌సూ. 'ఏమయింది తనకు? తను ఎక్కడికి పోయింది?' ఆందోళనగా అడిగాడు.

'ఎక్కడికి పోయి ఉంటుందో నువ్వే చెప్పాలి. ఆలస్యం చేశావంటే చాలా ఇబ్బంది పడిపోతావు' అన్నది మిచిషీ.

నెలలు నిండి నేడో రేపో తనకు వారసుడిని అందించబోతున్న తన భార్య మొహం కళ్ళముందు మెదిలింది కాబోలు – జలజలా అతని బుగ్గల మీదికి వచ్చేశాయి కన్నీళ్ళు.

'మేడమ్... నా తల మీద చెయ్యి పెట్టుకుని చెబుతున్నాను. నాకు తెలియదు. నన్ను మీరు తీసుకువచ్చి ఇక్కడ పడవేసిన దగ్గర్నించీ తనకు సంబంధంచిన మాట ఒక్కటి కూడా నేను వినలేదు. నమ్మండి' తల మీద చేయి వేసుకుని గద్గద స్వరంతో చెప్పాడు.

గట్టిగా నిట్టూర్చి కుర్చీలో నుంచి లేచింది మిచిషీ. 'నీ బాధ నేను అర్థం చేసుకోగలను. కాని నేను చేసే ఉద్యోగం ఆ మాటను బయటికి చెప్పనీయదు. నొప్పులు పడుతోంది ఆమె. కాన్పు కష్టం అవుతున్నట్టుగా కన్పిస్తోంది.' అంటూ మాటను ఆపింది.

'చావ్ చో' సడన్‌గా వచ్చింది ఆ మాట షాన్‌సూ నోటినుంచి. కుతూహలంగా ముందుకు వంగింది. మిచిషీ.

'చావ్ చో సిటీకి దగ్గర్లోనే ఒక చిట్టడివి ఉంది. అందులో ఒక చిన్న పల్లె. నా భార్యకి దగ్గర బంధువైన ఒక పెద్దావిడ ఆ పల్లెలో వైద్యం చేస్తూ ఉంటుంది. బహుశా తను...' అంటూ మాటను ఆపాడు షాన్ సూ.

ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయలేదు మిచిషీ. లాకప్‌లో నుంచి బయటికి వచ్చింది. తన గదిలో ఉన్న ఫోన్‌ని అందుకుని, అవమానించి వినిపించిన కంఠంతో, షాన్ చెప్పిన మాటల్ని వివరంగా చెప్పింది.

'మా అధికారాలు ఈ సిటీ లిమిట్స్ దాటగానే అంతం అయిపోతాయి. మీరు చావ్ చో సిటీని కాంటాక్ట్ చేయండి. అక్కడి వారిని ఎలర్ట్ చేసి ఆ పల్లెకు పంపించండి' అన్నది.

'మరి మా వాళ్ళ మీద కలబడిన దుర్మార్గుల సంగతి?' అడిగింది అవతలి కంఠం.

'షాన్‌సూ ఇంటి దగ్గర తన్నులు తిన్న వెంటనే వాళ్ళు మాకు ఎందుకు రిపోర్ట్ చేయలేదు? చేసి ఉంటే పరిస్థితి ఇంత సీరియస్‌గా మారి ఉండేది కాదు గదా' తన కంఠంలో ధ్వనించబోయిన వెక్కిరింపును అతి బలవంతంగా అదుముకుంటూ అడిగింది ఆమె.

'సిగ్గుపడ్డారు మేడమ్... అంతమందిని అతి తేలికగా ఎందుకూ పనికిరాని అనామకులు ఇద్దరు చావచితకబాదారని అందరికీ తెలిస్తే పరువు మట్టికొట్టుకు పోతుందని చెప్పి మౌనంగా ఉండిపోయారు. అనుకోని విధంగా వెంటనే జరిగింది ఈ సంఘటన. సాయంత్రం వరకూ టైము ఉండి ఉంటే వాళ్ళిద్దరినీ మేము మట్టుబెట్టి మట్టిలో కప్పెట్టేసి ఉండేవాళ్ళం' అన్నది అవతలి కంఠం.

పటపటమని శబ్దాలు చేయబోయాయి మిచిషీ దంతాలు... ఆ ఆవేశాన్ని కూడా ఎంతో నేర్పుగా అదుముకున్నది ఆమె.

'జరిగింది ఏదో జరిగిపోయింది. షాన్‌సూ భార్య మన సిటీ వదిలి దూరంగా వెళ్ళిపోయి ఉంటుందని అనుకోవటంతప్ప వాస్తవంగా జరిగింది ఏమిటో మాకు తెలియదు. మేము మా ప్రయత్నాలు చేస్తూనే ఉంటాము. మీరు కూడా మీ వెదుకులాటను కంటిన్యూ చేయండి...' అని మాత్రం చెప్పింది.

'మేడమ్.. మీరు ఒకసారి మా హుహుశాన్ సారు దగ్గరికి వచ్చి వారితో మాట్లాడండి' అన్నది అవతలి కంఠం.

ఒంటికి సరిపడని పదార్థం ఏదో నోట్లో పెట్టుకున్నట్టు చేదుగా తయారయింది మిచిషీ నోరు.

**(ఇంకా వుంది)**

# హెపటైటిస్ వైరస్‌ను అడ్డుకునే చికిత్స

**హెపటైటిస్ :** హెపటైటిస్ వైరస్ ప్రభావం ప్రధానంగా కాలేయంపై ఉంటుంది. ఈ వైరస్ మూలంగా అనేక మంది తీవ్రమైన కాలేయ వ్యాధి బారినపడి ప్రాణాలు కోల్పోతున్నారు. ఈ వైరస్ ముఖ్యంగా రక్తం ద్వారా వ్యాపిస్తుంది. వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం కారణంగా చెప్పుకోవచ్చు. తల్లి నుంచి శిశువుకు కూడా సంక్రమించే అవకాశం ఉంది. లైంగిక సంబంధాల ద్వారా కూడా వ్యాపిస్తుంది. ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. లో గ్రేడ్ ఫీవర్, పొట్ట పైభాగంలో నొప్పి, జాండిస్ వంటి లక్షణాలు కనిపిస్తాయి. అయితే హెపటైటిస్ బి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. వీరిలో కామెర్ల వ్యాధి తగ్గకుండా అలాగే ఉంటుంది. వాంతులు, కొన్నిసార్లు విరేచనాలు, కడుపు ఉబ్బరంగాఉండటం, పొట్టలో నొప్పి, రక్తనాళాలు వాచిపోవడం, కిడ్నీ సమస్యలు, ప్లేట్‌లె ట్స్ కౌంట్ పడిపోవడం జరుగు తుంది. అజీర్తి, పొట్ట ఉబ్బరంగా అనిపించడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. అడ్వాన్స్ స్టేజ్‌కు వెళ్లినట్లయితే బరువు కోల్పోవడం, వికారం, వాంతులు, ఏకాగ్రత లోపించడం, కుడివైపు పొట్టలో నొప్పి, కాలేయం వాపు వంటి లక్షణాలుంటాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ వైరస్‌ను అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. కాలేయంలో పేరుకుపోయిన కొవ్వు నిలువలను తిరిగి బయటకు పంపించడం హోమియోతో మాత్రమే సాధ్యమవుతుంది.

# హెచ్‌ఐవి, హెర్పిస్‌ల ఆట కట్టించొచ్చు

**హెచ్‌ఐవి :** హెచ్‌ఐవి సోకితే మరణం తప్పదా? అంటే కానే కాదు. చికిత్స లేని వ్యాధిగా హెచ్‌ఐవికి పేరుంది. అయితే హోమియోలో హెచ్‌ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్‌ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్‌ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, చిన్న చిన్న వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

### హెర్పిస్ సింప్లెక్స్

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

### హోమియో చికిత్స

హెచ్‌ఐవి, హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్‌ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది.

**Dr. K Ravikirane**
**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



# పిల్లలు పుట్టకపోవడం శాపం కానేకాదు

**ఆధునిక చికిత్సలు** ఎన్ని అందుబాటులోకి వచ్చినా సంతానలేమితో బాధపడుతున్న దంపతులకు పరిష్కారాన్ని చూపలేకపోతున్నాయి. అయితే హోమియో మాత్రం ఇందుకు భిన్నంగా సత్ఫలితాలను అందిస్తోంది. ఏడాదిగా ఎటువంటి గర్భనిరోధక పద్ధతులు పాటించకపోయినప్పటికీ గర్భం రాకపోయినట్లయితే సంతానలేమి సమస్య ఉన్నట్లుగా భావించాలి.

**కారణాలు ఇవి కావచ్చు :** వీర్యకణాలు తక్కువగా ఉంటే సంతానం కలిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. వేరికోసిల్, హైడ్రోసిల్, మూత్ర సంబంధ వ్యాధులు, సుఖ వ్యాధుల వల్ల కూడా వీర్యకణాలు నశించి సంతానలేమికి కారణమవుతూ ఉంటాయి. దీర్ఘకాలంగా షుగర్ వ్యాధి ఉండటం, అధిక బరువు, వృషణాలకు దెబ్బలు తగలడం, ప్రమాదాల్లో వెన్నుకు గాయాలవడం, హార్మోన్ల అసమతుల్యత, క్రోమోజోముల లోపాలు, విపరీతంగా స్మోకింగ్ చేయడం వంటివి కూడా పురుషుల్లో సంతానలేమికి కారణమవుతుంటాయి. బిగుతైన దుస్తులు ధరించడం, ప్రతిరోజు వేడి ఎక్కువగా ఉండే నీళ్లతో స్నానం చేసే అలవాటు ఉండటం వంటివి కూడా కారణమవుతాయి.

**హోమియో చికిత్సతో ఆనందం :** సంతానలేమికి కచ్చితమైన కారణం తెలుసుకుని చికిత్స అందిస్తే సంతానసాఫల్యం తప్పక కలుగుతుంది. వీర్యకణాల లోపం ఉంటే హోమియో మందులు తీసుకోవడం ద్వారా వీర్యపుష్టి కలుగుతుంది. వీర్యకణాల కదలికలు పెరుగుతాయి. హార్మోన్ల సమస్యలు సైతం హోమియో చికిత్సతో తొలగిపోతాయి. అంగస్తంభనలు లేకపోవడం వంటి సమస్య ఉంటే దూరమవుతుంది. మొత్తంగా సంతానలేమి కారణాలన్నీ దూరమయిపోయి సంతానం సిద్ధిస్తుంది.

# నరాల జబ్బులుంటే జీవితం నరకమేగా!

**చేతులు,** కాళ్లు, పాదాలు, ముఖం, నోరు...ఇలా శరీరంలోని అన్ని భాగాల నుంచి నరాలు వెన్నుపాముతోనూ, మెదడుతోనూ అనుసంధానించబడి ఉంటాయి. ఈ నరాల వ్యవస్థ ద్వారానే భౌతిక అనుభూతుల తాలూకు సంకేతాలను మెదడుకు అందుతాయి. అంటే కాలికి దెబ్బతగిలితే నొప్పి తెలియడం వెనక కారణం మెదడుకుసంకేతాలు చేరడమే. అయితే కొందరిలో కొన్ని కారణాల వల్ల ఈ నరాల వ్యవస్థ దెబ్బతింటుంది.

**కారణాలు :** కుటుంబంలో ఎవరైనా ఈ సమస్యతో బాధపడుతున్నట్లయితే వారి పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. డయాబెటిస్‌తో బాధపడే వారిలో ఎక్కువగా కనిపించే సమస్య ఇది. గాయాలు కావడం, దీర్ఘకాలంగా అనారోగ్యం ఉండటం, ఇన్‌ఫెక్షన్లు వంటివి కూడా కారణమవుతాయి. ఆల్కహాల్ అధికంగా సేవించడం, విషపూరితమైన కెమికల్స్‌కు ఎక్స్‌పోజ్ కావడం, కొన్ని రకాల వైరస్‌లు, బ్యాక్టీరియాలు నేరుగా నరాల టిష్యూపై దాడి చేయడం వల్ల కూడా ఈ సమస్య తలెత్తవచ్చు. హెచ్‌ఐవితో బాధపడే వారిలోనూ పెరిఫెరల్ న్యూరోపతి డెవలప్ అయ్యే అవకాశం ఉంటుంది.

### లక్షణాలు

చేతులు, పాదాల్లో పొడిచినట్లు అనిపించడం, తిమ్మిర్లు రావడం, చేతుల్లో నుంచి వస్తువులు జారిపడటం, పురుషుల్లో అంగస్తంభనలు తగ్గిపోవడం, మలబద్ధకం, జీర్ణసమస్యలు రావడం, డయేరియా, చెమటలు అధికంగా పట్టడం వంటి లక్షణాలుంటాయి.

### హోమియో చికిత్స

నరాల సంబంధ సమస్యలకు హోమియో మందులు అద్భుతంగా పని చేస్తాయి. తిమ్మిర్లు, చెమటలు అధికంగా పట్టడం వంటివి తగ్గిపోతాయి. అంగస్తంభన సమస్యలు దూరమవుతాయి. మొత్తంగా కాంప్లికేషన్స్ అన్నీ దూరమయి ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.




**విభ్రాంతి నుంచి తేరుకున్న బ్రహ్మదేవుడు, ఆకాశం నుంచి కిందికి చూశాడు. ఆడుకుంటూ కనిపించాడు కృష్ణుడు. లేగల వెనుక పరుగుదీస్తూ కనిపించాడు. స్వామీ అంటూ వాహనాన్ని కిందకి దించాడు బ్రహ్మ. కృష్ణుణ్ణి సమీపించాడు. చేతులు జోడించి నమస్కరించాడతనికి. మహామాయా వులనే సమ్మోహింపచేయగల నిన్ను పరీక్షించదలచి, నేనే పరీక్షకి గురయ్యాను. కరుణించి నా అజ్ఞానాన్ని మన్నించు. నీకు తెలియనిది లేదు. నువ్వు సర్వేశ్వరుడివి. అని స్తోత్రం చేశాడు. ముమ్మారు కృష్ణుని చుట్టూ ప్రదక్షిణ చేశాడు. సాష్టాంగప్రణామం చేసి నిష్క్రమించాడక్కణ్ణుంచి. అదృశ్యుడైన బ్రహ్మను చూసి సన్నగా నవ్వుకున్నాడు కృష్ణుడు.**

# కాలనేమి పుత్రులు:కకావికలు

ఎదురుగా తాను సృష్టించిన గోపాలురనూ, లేగలనూ చూశాడు కృష్ణుడు. వాటి అవసరం ఇక లేదనుకున్నాడు. మాయం చేశాడు. గుహలో దాగిన అసలు గోపాలురనూ, లేగలనూ రప్పించాడు. వారికీ, వారి తల్లిదండ్రులకు కూడా ఏడాది కాలం గడిచిన సంగతే తెలియనట్టుగా చక్కదిద్దాడు. ఇప్పుడు అసలు గోపాలురు, అడవిబాటపట్టిన కృష్ణుని కోసం నిరీక్షిస్తూ, కృష్ణుడు ఎంతకీ రాడేమిటి? అనుకున్నారు. అడవివైపు చూశారు. అప్పుడు కనిపించాడు కృష్ణుడు. లేగలను తోలుకుంటూ వస్తున్నాడు. అడుగో అంటే అడుగో అంటూ కృష్ణుణ్ణి ఒకరికొకరు చూపించుకుని, దగ్గరగా వచ్చిన అతన్ని చేరపిలిచారు. గట్టిగా కౌగిలించుకున్నారు.

చూడు, నీకోసం చల్దులు తినకుండా ఎలా కాచుకుని కూర్చున్నామో! రారా! చల్లటి పెరుగు ముద్దలు నీకోసమే అన్నారంతా. పక్కన కూర్చోబెట్టుకున్నారు కృష్ణుణ్ణి. ముద్దలు తినిపించారు. తింటూనే నిద్రపోయాడు కృష్ణుడు. అతనిసహా గోపాలురు కూడా కాసేపు విశ్రమించారు. మేల్కొన్నారు తర్వాత. మేల్కొని కబుర్లలో పడ్డారు. కొండచిలువనోటిలోకి తాము ప్రవేశించడం, కృష్ణుడిరాక, తమను అతను కాపాడడం అంతా కథగా చెప్పుకున్నారు.

కథలు కథలుగా ఎదిగాడు కృష్ణుడు. కొంటెగోపాలుడు వ్యక్తుడు అయినాడు. వేణువును అందుకున్నాడు. వేవేలరాగాలు పలికించాడు. ఆ రాగాలకు బృందావని తరించిపోయింది. ఒకనాడు కృష్ణుని వేణుగానానికి తన్మయులై బలరాముడుసహా కృష్ణుని చేరుకున్నారు గోపాలురు. అందరూ కలసి బృందారణ్యమధ్యంలోకి ప్రవేశించారు. మృగపక్షిగణాలతో అలరారుతున్న ఆ అరణ్యంలో విహరించాలని కృష్ణునికి కోరిక కలిగింది. ఆ కోరికను తెలుసుకున్నాడేమో! బలదేవుడు చెప్పాడిలా.

తమ్ముడూ! ఈ అడవిలోని చిలుకలన్నీ నిన్ను పిలుస్తున్నట్టుగానే పలుకుతున్నాయి. గండుతుమ్మెదల ఝుంకారం నిన్ను కీర్తిస్తున్నట్టుగా ఉంది. సాక్షాత్తూ పరమేశ్వరుడివే అని, నిన్ను అర్చించేందుకు మునీశ్వరులంతా ఇటు వస్తున్నారు. నీలాంబరం ధరించిన నిన్ను చూసి, నల్లనిమేఘం నేలకి దిగిందని భ్రమపడి, పురివిప్పి, నెమళ్ళు నాట్యాలు చేస్తున్నాయి. అమాయకగోపికల్లా ఆడలేళ్ళన్నీ కళ్ళు విప్పార్చి నిన్నే చూస్తున్నాయి. ఆత్మీయుడివని కోకిలలు గానం చేస్తున్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే... అడవి అడవి అంతా నువ్వు ఇక్కడకి వచ్చినందుకు ధన్యమైనట్టుగా ఉంది. అందంగా ఉంది. ఆలస్యం ఎందుకు? పద, ఆడి పాడి అందరినీ అలరించు.

అన్న అనుమతి లభించడంతో స్నేహితులు, లేగలుసహా కృష్ణుడు అడవిలో యథేచ్ఛగా తిరిగాడు. తిరిగి తిరిగి దూరంగా ఉన్న గోవులను చేరపిలిచాడిలా.

ఇదిగో పూర్ణచంద్రికా ఇక్కడ ఉన్నాను, ఇటురా! గౌతమీ రారా! భాగీరథీ! సుధాజలరాశీ! రండి రండి!

**స్నేహితులతో కలిసి కృష్ణుడొకవైపు ఆనందసాగరంలో ఓలలాడుతుండగా విదేహరాజ్యంలో ఒక అద్భుతం జరిగింది. యశోదాదేవి తమ్ముడు కుంభకుడు ఆ రాజ్యంలో ప్రసిద్ధుడు. అతడి గోధనంలో ఉన్న ఏడు ఆబోతులు యథేచ్ఛగా దుష్కృత్యాలకు పాల్పడుతూ ప్రజలను హింసించసాగాయి. వాటిని లొంగదీయడం తమవల్లకాదని మహామహా బలశాలురుసైతం చేతులెత్తేశారు. అప్పుడు కుంభకుడు ఏం చేశాడు?**

దగ్గరగా వచ్చిన ఆవులను వాటేసుకుని, ముద్దు పెట్టుకున్నాడు కృష్ణుడు. మురిసిపోయాడు. తమ్ముణ్ణి ఆ తీరున చూసి పొంగిపోయాడు బలదేవుడు.

వేదాంతవీధుల్లో విహరించే విన్నాణి, లీలా మానుషవిగ్రహుడై దుర్గమారణ్యాల్లో తిరిగాడు. ఆదిశేషునిపై పవ్వళించాల్సిన మహాభోగి, చిగురుటాకుసెజ్జలపై శయనించాడు. మానసగుహలలో సంచరించే మహనీయుడు, పర్వతగుహల్లో పాదాలు మోపాడు. అఖిలలోకాశ్రయుడైన కృష్ణుడు, గోపాలురతో కలసి, చెట్లనీడల్లో తిరిగాడు. యజ్ఞయాగాల భాగాలందుకునే మేటి, కాయకసురులతో కడుపు నింపుకున్నాడు. తాను పరమేశ్వరుడు అన్న సంగతే మరచిపోయాడు కృష్ణుడు. స్నేహితులతో చెట్టాపట్టాలేసుకుని చిందులేశాడు.

అలసిన కృష్ణుణ్ణి వీపున మోసేవారు కొందరు. ఆకొన్న కృష్ణునికి అన్నం తినిపించేవారు కొందరు. దాహం అంటే దోసిళ్ళతో నీరు తెచ్చి దాహం తీర్చేవారు కొందరు. నిద్ర వస్తోందంటే నా తొడ మీద తలపెట్టి పడుకో అంటే నా తొడ మీద తలపెట్టి పడుకోమనేవారు కొందరు...ఇలా కృష్ణుని ప్రేమించి, పలవరించేవారు గోపాలురు. అతను కనిపించక పోతే కన్నీరుమున్నీరయ్యేవారు.

రోజులు గడచిపోతున్నాయి. అప్పుడు విదేహ రాజ్యంలో ఓ అద్భుతం జరిగింది. కుంభకుడు చాలా ప్రసిద్ధుడక్కడ. యశోదాదేవి తమ్ముడతను. ధర్మద అతని భార్యపేరు. ఇద్దరు పిల్లలు అతనికి. కుమారుని పేరు శ్రీధాముడు. కుమార్తె పేరు నీల. ఆమె మహాసౌందర్యరాశి. ఈ అందాలరాశి నా భార్య అయితే బాగుణ్ణంటే నా భార్య అయితే బాగుణ్ణని ఆశించనివారు లేరు. ఆ పిల్లను ఇచ్చి పెళ్ళి చెయ్యమని కుంభకుణ్ణి అడగనివారు లేరు. పిల్ల పెళ్ళి సంగతి అలా ఉంచితే...కుంభకుని గోధనంలో ఏడు ఆబోతులు ఉన్నాయి. ఆ ఏడూ కాలనేమి పుత్రులు. రాక్షసులు. వారంతా ఆబోతులుగా ఎందుకు జన్మించారంటే... కృష్ణునికి కుంభకుడు బంధువు. ఆ కారణంగా కృష్ణుడు ఎప్పటికైనా ఇక్కడకి వస్తాడు. వస్తే అతన్ని కొమ్ములతో పొడిచి చంపేయవచ్చునన్నది వారి ఆలోచన. కృష్ణుణ్ణి వారెందుకు చంపాలనుకుంటున్నారంటే...తమ తండ్రి కాలనేమిని మహావిష్ణువు చంపాడు. ఆ మహావిష్ణువే కృష్ణుడు కాబట్టి అతనికోసం నిరీక్షిస్తున్నారు. నిరీక్షిస్తూ యథేచ్ఛగా దుష్కృత్యాలకు పాల్పడుతున్నారు. ప్రజలను అనేక విధాల హింసిస్తున్నారు.

ఎదురుపడిన ఎలాంటి ఎద్దులనైనా మీదపడి కుమ్మేస్తున్నాయి ఆబోతులు. పాడిఆవులను ఒక్కుమ్మడిగా సంహరిస్తున్నాయి. బలవంతుడెవరైనా అడ్డుకుంటే అతన్ని కూడా గిట్టలతో కుమ్మి, కొమ్ములతో పొడిచి పొడిచి చంపుతున్నాయి. కంచెలు పాడు



చేస్తున్నాయి. గోడలు దూకుతున్నాయి. పంటచేలలో పడి, పంటంతా తిన్నంత తిని, మిగిలినదాన్ని బురదపాలు చేస్తున్నాయి. కాపరులను కనికరించడం లేదు. చంపి, వారిని పొలాల్లో విసిరివేస్తున్నాయి. ఆబోతుల అరాచకాన్ని రైతులు తట్టుకోలేకపోయారు. రాజుని ఆశ్రయించారు. చేతులు జోడించి నమస్కరించి వేడుకున్నారిలా.

ప్రభూ! కుంభకుని ఆబోతులు మా పొలాల్లో పడి పంటలను పాడుచేస్తున్నాయి. వాటిని అరికట్టడం మహామహాబలవంతులవల్ల కూడా కావడం లేదు. దిక్కూ మొక్కూ లేక అలమటిస్తున్నాం. తక్షణం ఆ ఆబోతులను నిర్మూలించండి.

రాజు తీవ్రంగా ఆలోచించాడు. వెంటనే కుంభకుణ్ణి రప్పించాడు. ఆజ్ఞాపించాడిలా.

కుంభకా! నీ ఆబోతులు పంటలను నాశనం చేస్తున్నాయి. ఆలమందల్ని కుమ్మికుమ్మి చంపుతున్నాయి. రైతులంతా బాధపడుతున్నారు. రాజుని కనుక వారంతా నా దగ్గర బాధలు వెళ్ళబోసుకున్నారు. గోపాలురలో గొప్పవాడివి. తలచుకుంటే ఏమైనా చెయ్యగలవు. ఆబోతుల్ని బంధించు. లేదంటే అడవులకి తోలించు. నీ అనుచరులు బలవంతులని విన్నాను, వారికి ఇది అసాధ్యం కాదు. వెళ్ళు.

సౌధానికి చేరుకుంటూనే అనేకమంది బలిష్ఠుల్ని రప్పించాడు కుంభకుడు. రాజాజ్ఞ చెప్పి, ఆబోతులను బంధించమన్నాడు. సరేనని పెద్దపెద్ద పలుపులతోనూ, వలలతోనూ బయల్దేరారు బలిష్ఠులు. పలుపులతో ఆబోతులను బంధించజూశారు. పలుపులను తెంచుకుని పరుగెత్తాయి. మళ్ళీ ప్రయత్నిస్తే బలిష్ఠులను కుమ్మికుమ్మి గాయాలపాలు చేశాయి. వలలతో బంధించజూశారు. చించివేశాయి వాటిని. బయటపడి, బంధించజూసినవారిని కొమ్ములతో పొడిచి హింసించాయి. పలుపులూ, వలలూ కాదు, క్రూరమృగాలను పట్టుకునేందుకు మాటు పెట్టినట్టుగా ఆబోతులకు మాటు పెట్టారు. గోతులు తవ్వి, అవి కనిపించకుండా వాటిపైన ఆకులూ కొమ్మలూ పేర్చారు. ఆబోతులు అక్కడ వరకూ వచ్చేవి. పడతాయి, దొరుకుతాయి ఇక అనుకునే వేళ వాటిపై నుంచి ఎగిరి వచ్చి, కాపలావారిని కత్తుల్లాంటి కొమ్ములతో పొడిచి పారిపోయేవి. ఎన్ని విధాల ప్రయత్నించినా ఫలితం లేదు. దాంతో వెనుతిరిగి, కుంభకుణ్ణి సమీపించారు బలిష్ఠులు. వారి ప్రయత్నాలూ, బాధలూ అన్నీ విన్నవించారు. గాయాలను చూపించారు. ఆబోతులను బంధించడం మా వల్ల కాదంటే మావల్ల కాదన్నారు. క్షమించమని వెళ్ళిపోయారు. ఏం చెయ్యాలో, ఆ ఆబోతులను ఎలా అరికట్టాలో అంతుచిక్కలేదు కుంభకునికి. అప్పుడు తీవ్రంగా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాడు.

ఆబోతులను నిశ్శేషంగా నిర్మూలించిన వీరాధివీరునికి తన కుమార్తె నీలను ఇచ్చి వివాహం చేస్తానని ప్రకటించాడు కుంభకుడు.

ప్రకటన విన్న గోపప్రముఖులు ఆశ్చర్యపోయారు. చిత్రంగా ఉందే! ఆబోతులను అరికడితే కూతురుని ఇచ్చి పెళ్ళి చేస్తాడా? ఏం ఆ నగరంలో ఆపాటి పోటరులు లేరా? అనుకున్నారు. కుంభకుడు చెడ్డభయస్థుడులా ఉన్నాడు. ఆబోతులను బంధించడం పెద్ద పనా? అనుకున్నారు. ఉప్పొంగిన ఉత్సాహంతో అంతా విదేహరాజ్యానికి చేరుకున్నారు. నగరం నిండా గోపాలురే! ఎక్కడ చూస్తే అక్కడ గుంపుగుంపులుగా కూర్చుని కబుర్లాడుకున్నారు. ఆబోతులను బంధించడం నాకు చిటికెలో పని. ముందు వాటి కొమ్ములను పట్టుకుంటాను. తర్వాత కిందికి ఈడ్చికొడతాను వాటిని. బొక్కబోర్ల పడ్డ వెంటనే ముకుతాళ్ళతో బంధిస్తాను అన్నాడొకడు. నేనైతే కంటిచూపుతోనే బంధిస్తాను అన్నాడింకొకడు. నా చూపుకే భయపడతాయవి అన్నాడు.

కుంభకుని ఆబోతుల గురించి నందునికి ముందే తెలుసు. అతను తన ఆబోతుల సంగతిని దూతల ద్వారా నందుని చెవిలో ఎప్పుడో వేశాడు. ఈ గండం గట్టెక్కించమని వేడుకున్నాడు కూడా. దాంతో తప్పనిసరై బలిష్ఠులైన కొందరు గోపకుమారులు, యశోదా బలరామకృష్ణులసహా నందుడు, విదేహరాజ్యానికి చేరుకున్నాడు. బలరామకృష్ణులను చూసి అక్కడి స్త్రీలంతా ఎవరే ఈ రాకుమారులు? రామలక్ష్మణుల్లా ఉన్నారనుకున్నారు. యువతులైతే కృష్ణుని చూసి పాలిండ్లు పొంగార్చి పరవశించిపోయారు. భార్యాబిడ్డలసహా వస్తున్న నందుణ్ణి ఎదురేగి ఆహ్వానించాడు కుంభకుడు. యశోదను ధర్మద దగ్గరగా తీసుకుని కౌగలించుకుంది. బలరామకృష్ణులను శ్రీధాముడు చేతులు పట్టుకుని నడిపించుకుని వచ్చి మరీ సుఖాసనాల్లో కూర్చోబెట్టాడు. విందు జరిగిందప్పుడు. పంచభక్ష్యపరమాన్నాలు వడ్డించారు. అనంతరం అంతా ఇష్టాగోష్ఠిలో పాల్గొన్నారు. మాటలతోనే ఒకరినొకరు వినోదించుకున్నారు.

అనుకున్నది అయింది. కృష్ణుడు వచ్చాడు. కసి తీరుతుందిక అనుకున్నాయి ఆబోతులు. చెలరేగిపోయాయి. లేగలనూ, ఆవులనూ కొమ్ములతో పొడిచి పొడిచి చంపాయి. కనిపిస్తే చాలు! కత్తుల్లాంటి కొమ్ములు విసిరి, రక్తం కళ్ళ చూస్తున్నాయి. వాటికి కనిపించకుండా ప్రాణభయంతో ఆలమందలన్నీ దూరదూరంగా పరుగందుకున్నాయి. లేగలూ, ఆవులూ కనిపించకపోవడంతో మనుషుల మీద పడ్డాయి ఆబోతులు. ఎదురొచ్చిన గోపాలురను విసిరి కొట్టి, కుంభకుని ప్రాంగణంలోనికి ప్రవేశించాయి. పెద్దపెద్దరంకెలు వేశాయి. మునికాళ్ళతో నేలను దువ్వి, చిందులు వేశాయి. ఇరుగుపొరుగు ఇళ్ళల్లోని బానలను తుత్తునియలు చేశాయి. పందిళ్ళనూ, గోడలనూ కొమ్ములతో కూల్చివేశాయి. స్త్రీబాలవృద్ధులు అది చూసి భయభ్రాంతులయ్యారు. తలుపులు మూసుకున్నారు. తలుపులు మూసుకున్నా వారిని వదలిపెట్టలేదు ఆబోతులు. మూసిన తలుపుల్ని విరగ్గొట్టాయి. ద్వారాలను పెకిలించి వేశాయి. ఇళ్ళను కూల్చివేశాయి. కనిపిస్తే చంపేస్తాయి. కనిపించకుండా దాగోవాలి అనుకున్నారు జనాలు. ప్రాణాలు అరచేతిలోపెట్టుకుని పాపం దాగున్నారు.

—అరణి

6

# విజయ విలాసం-2

## స్టెప్స్ టు సక్సెస్

-ఎం. వెంకటేశ్వరరావు, సెల్: 90307 07037

**"మనిషి ఒక్కడైతే చెప్పగలడు. ఇద్దరైతే మాట్లాడుకోగలరు. పదిమంది కలిస్తే ఏదైనా కలిసికట్టుగా సాధించగలరు. ఒక్కడైతే నవ్వగలడు. నలుగురూ కలిస్తే నవ్వుకోగలం. ఇదే విజయ రహస్యం. విజయం ఏ ఒక్కరి సొత్తూ కాదని గ్రహించిన వాళ్ళే విజేతలు.**

**–జాన్‌రస్కిన్**

# విజయం ఒకరి సొత్తుగా మారకూడదు



### ఒక్క ఐడియా

"నేనూ, నా పన్నెండేళ్ళ కూతురూ ట్యాంక్‌బండ్ వైపు వెళ్తున్నాం. 'లవ్ హైదరాబాద్' దగ్గర ఆపు నాన్నా ఐస్‌క్రీం తిందాం" అంది. బైక్ ఆపాను. ఐస్‌క్రీం బండి పక్కనే పీచుమిఠాయి అమ్మే కుర్రాడు 'పీచు మిఠాయ్' అని అరుస్తున్నాగానీ, ఎవరూ ఆవైపు వెళ్ళడంలేదు. ఐస్‌క్రీం కుర్రాడు మాత్రం 'రండిసార్, రకరకాల రుచులు, ఫ్లేవర్స్' అంటూ బాగా వ్యాపారం చేసుకుంటున్నాడు.

"నాన్నా! పీచుమిఠాయి పింకురంగులోనే ఎందుకుంటుంది?" అంది నా కూతురు. "ఆ రంగు వాడతారు కాబట్టి అదే రంగులో ఉంటుంది" అన్నాను.

"నాకు పీచుమిఠాయి కావాలి" అని ఆ బండి దగ్గరకెళ్ళి "నువ్వు పింకురంగు బదులు ఎరుపు, నీలం, పసుపువంటి రకరకాల రంగులు వాడొచ్చు కదా!" అంది.

ఆ కుర్రాడు మౌనంగా పీచుమిఠాయి ఇచ్చాడు.

వారం తర్వాత ఎన్.టి.ఆర్. గార్డెన్స్‌వైపు వెళ్తుంటే, "రండిసార్! రండి. రకరకాల పీచుమిఠాయిలు... ఎరుపు, నీలం, ఆరంజి.. ఒక్కసారితింటే వదలరు" అన్న అరుపు విని బైక్ ఆపాను. ట్యాంక్‌బండ్ దగ్గర చూసిన కుర్రాడే".

వాడూ నన్ను గుర్తుపట్టి "పాప రాలేదా? సార్!" అన్నాడు.

నేను ఆశ్చర్యంగా చూస్తుంటే "అవున్సార్! ఆ రోజు పాపచెప్పిన ఐడియా నచ్చింది. జీడిపప్పుపొడి, బాదం పొడి, ఇలాంటిపొడి చల్లి అమ్మితే ఎలా ఉంటుందనే ఆలోచన కూడా వచ్చి ఇలా మొదలెట్టాను. ఒక్కచోట కాకుండా రద్దీప్రదేశాల్లో అమ్ముతున్నా. గిరాకీ చాలా బాగుందిసార్!" అన్నాడు.

నా కూతురు క్యాజువల్‌గా అన్నమాట వాడి ఆలోచనలో, వ్యాపారంలో మార్పు తేవడం ఆశ్చర్యం కల్గించింది. మామూలుగా ఆలోచిస్తే సాధారణంగా కనిపిస్తుందిగానీ ఆచరణలో దానికి మరో ఆలోచన తోడైతే పెద్దవిజయానికి పునాది వేస్తుంది. వనరులు సక్రమమార్గంలో ఉపయోగించి, సక్సెస్ సాధించాలంటే ఆలోచనలుండాలి. వాటిని ఆత్మీయులతో పంచుకోవాలి.

తాపట్టిన కుందేటికి మూడేకాళ్లంటూ ఒంటి చేతిని గాలిలో ఊపితే చప్పట్లు మోగవు. ఆలోచనకు పదునుపెట్టాలంటే, ఆప్తులు, నమ్మకస్తులతో షేర్ చేసుకోవాలి. అప్పుడే ఆ ఆలోచన సానబట్టినవజ్రంలా, ఆభరణంలా మారుతుంది.

### విజయం అంటే !

పలు భారీబడ్జెట్ చిత్రాలు బాక్సాఫీసులవద్ద డిజాస్టర్స్ కావడం చూశాం. ఆ కోవలోదే 'శక్తి' సినిమా. భారీ సెట్టింగులు, లొకేషన్లు, భారీ తారాగణం, ప్రతిభ గల సాంకేతిక నిపుణులు కష్టపడి తీసిన బడానిర్మాత సినిమా. డిజాస్టరైపోయింది.

'బాహుబలి' కూడా భారీ సినిమానే. ఏకవాక్యంలో చెప్పాలంటే 'దాయాదుల మధ్య పగ, ప్రతీకారం' ఆ చిత్రకథ. కథకుడు, సన్నిహితులతో కలిసి సానబట్టి, ఆ వజ్రాన్ని దర్శకుడిచేతిలో పెట్టాడు.

ప్రపంచంలో ది బెస్ట్ అన్పించుకున్న సాంకేతిక నిపుణులు ఆ చిత్రానికి పని చేశారు.

ఏకంగా ఐదేళ్ళపాటు దర్శకుడి కుటుంబమంతా వివిధవిభాగాల్లో ఆ చిత్రంకోసం నిర్విరామంగా శ్రమించింది. పగలూ, రాత్రీ దాన్నే శ్వాసించారు. ఆలోచనలు షేర్ చేసుకుంటూ కలిసికట్టుగా వాటిని ఆచరణలో పెట్టారు. ప్రపంచం నివ్వెరపోయే గొప్ప ఫలితం సాధించారు. ఇదీ విజయమంటే.

విజయం సాధించాలంటే, ముందు ఆలోచన రావాలి. వాటిని కలలు కనాలి. నీ ఆలోచనలు నీ కలలో దృశ్యరూపమై గోచరించాలి. అప్పుడే ఆ కల సాకారమవుతుంది.

### వ్యక్తిగత విజయం

"ఓ పేదవిద్యార్థి బాల్యంలో చదువుకోవడానికెన్నో కష్టాలుపడ్డాడు. సరైన తిండి, బట్ట లేనివాడు. కట్ చేస్తే ఐ.ఎ.ఎస్ ఆఫీసర్ అయ్యాడు.

సింగిల్‌లైన్ సినిమాస్టోరీలా వినడానికి బాగుంది. క్లాస్‌లోనో, బయటో ఎక్కడో ఓ కుర్రాడు అవమానపడి, 'నీ ముందే కలెక్టర్ అవుతా, నీ ఊరికే తిరిగొస్తా' అనే ఛాలెంజ్, వెంటనే బ్యాక్‌గ్రౌండ్‌సాంగ్, మాంటేజ్ షాట్స్, పాటపూర్తవగానే ఆ కుర్రాడు కలెక్టర్ సీట్లో కూర్చోవడమే సినిమా. కానీ నిజ జీవితంలో ఇలా జరుగుతుందా?

జరుగుతుంది. కానీ ఎవరో ఒక మహానుభావుడు ఆ కుర్రాడి తపన గ్రహించాలి. అబ్బురపడాలి. తెరవెనుక నిలబడి చేయూతనివ్వాలి. అందిన ఆసరాతో ఆ కుర్రాడు ఆశయం నెరవేర్చుకోవడం వ్యక్తి

గత విజయం. ఇక్కడ లబ్ధి పొందిన ఆ విజేత చెబితేనే తెర వెనుక పాత్రలు బయట ప్రపంచానికి బహిర్గతమవు తాయి. లేదంటే తెరవెనుకే కనుమరుగవుతాయి.

ఒక గడ్డిపరక కనీసం పిచ్చుకనుకూడా బంధించ లేదు. అదే పది గడ్డిపరకలు తాడుగా అల్లుకుపోతే ఏనుగునే బంధించగలవు. పైకి కన్పించే తాడు ఒక్కటే, కానీ ఆ లోపల బలంగా మెలితిరిగి పెన వేసుకుపోయిన గడ్డిపరకలెన్నో.

### వ్యక్తిగత విజయం స్వార్థంగా మారకూడదు

అన్ని అర్హతలున్న ఆటగాడు జట్టు సభ్యుడుగా ఎందుకు ఎంపికకాలేదో తెలిస్తే మనం చాలా ఆశ్చర్య పోతాం. అతడు ఆల్‌రౌండర్. అద్భుతమైన ప్రతిభ ఉంది. పలుమార్లు నేషనల్స్‌లో ఆడి జట్టు విజయంలో పలు మార్లు కీలక పాత్ర పోషించాడు.

కానీ ప్రలోభాలకు అలవాటుపడి, వ్యక్తిగత రికార్డులకు ప్రాధాన్యమిచ్చి, జట్టు పరాజయాలకు కారణం తనూ ఒకడవటంతో అతణ్ణి జట్టు నుండి శాశ్వతంగా తొలగించారు.

కానీ అతడు మరచిపోయిన విషయమేంటంటే, ప్రతిభ గుర్తించి, ప్రోత్సహించబట్టే జట్టులో గుర్తింపు తెచ్చుకున్న విషయం. ఆటపరంగానైనా, ఆర్థికంగా నైనా విజయం తనకే దక్కాలన్న స్వార్థ ఆలోచనవల్ల తన పతనానికి తనే పునాది వేసుకున్నాడు.

### సహనం + సంయమనం=విజయం

**నువ్వెంత ప్రతిభగలవాడివైనా సహనం, సంయ మనం కోల్పోతే విజయానికి దూరమవుతావ్**

**–ఎమర్సన్**

అతిచిన్న సంగీతవాద్య పరికరం పేరు 'పికలో'. 'థామస్' దానిని అద్భుతంగా వాయించేవాడు. అడపా దడపా తన పరిజ్ఞానం ఫ్రెండ్స్ దగ్గర ప్రదర్శించేవాడు. వాళ్ళ ప్రోత్సాహంతో స్టేజీ ప్రదర్శనలిచ్చేవాడు. అలా ఓరోజు ప్రోగ్రామ్‌లో ప్రేక్షకుల కరతాళధ్వనులమధ్య థామస్ విజృంభించి తన ప్రతిభచాటుకున్నాడు. ఆ ప్రేక్షకుల్లో ఉన్న ఓ సింఫనీ సంగీతదర్శకుడు థామస్ ప్రతిభ గుర్తించాడు. 'అవకాశం ఇస్తా, ఫలానారోజు వచ్చి కలుసుకో' అని చెప్పాడు. థామస్ ఎగిరి గంతేశాడు.

లండన్ రాయల్ ఆడిటోరియంలో సింఫనీ జరు గుతోంది. వందలమంది వయొలినిస్టులు, గిటారి స్టులు ఒకేసారి ఒక క్రమంలో వాయిస్తుంటే, కరతాళ ధ్వనులు మార్మోగుతున్నాయి.

సింఫనీ సంగీతదర్శకుడు తనను ఎంతకీ పిలవటం లేదనే విచారం, అసహనంతో థామస్ ఆ సింఫనీని ఆస్వాదించలేకపోయాడు. ఎంతకీ తనకి అవకాశం ఇవ్వకపోవటంతో నిరుత్సాహంతో వెళ్ళిపోయేందుకు



## హేట్సాఫ్ ధీరూభాయి



*ధీరూభాయి అంబానీ పేరుచెబితే గుర్తొచ్చేది రిలయన్స్‌సంస్థ. ఒక వ్యక్తి అనూహ్యరీతిలో కిందనుండి పైస్థాయికి ఎదిగి వ్యాపార సామ్రాజ్యం సృష్టించటం, పలురకాలుగా ఆ సామ్రాజ్యాన్ని విస్తరించడం సాధారణవిషయం కాదు. తన వ్యాపారం కలకాలం కొనసాగేలా విభిన్నీకరణ చేశారు. పెట్రోరసాయనాలు, టెలీక మ్యూనికేషన్స్, ఐ.టి., ఎనర్జీ, రిటైల్ టెక్స్‌టైల్స్, మూలధనం, లాజిస్టిక్స్ వంటి రిలయన్స్ సంస్థల కింద 10,000 మంది పని చేస్తున్నారు.*

*ఆది నుండి ధీరూభాయి అంబానీ ప్రజాభి మానం చూరగొన్నారు. పెట్రోరసాయన వ్యాపా రంలో ఆయన విజయం, పేదరికంనుండి అత్యంత ధనవంతుడై తనదైన జీవనశైలితో దేశప్రజల మనస్సులలో నిలిచిపోయాడు.*

*ఆయన ఉత్తమ వ్యాపారనాయకుడేకాదు, మంచి ప్రోత్సాహకుడు. ఆయన ఉపన్యాసాలు కొన్నే అయినాగానీ, నేటికీ ఆచరణయోగ్యాలు.*

* *యువతకు వనరులు కల్పించాలి. వారిని ప్రోత్సహించాలి, వారి దగ్గర అనంతశక్తి నిక్షిప్తమై ఉంటుంది.*
* *నమ్మకం విజయానికి పునాది. నా గతం, వర్తమానంలో నేను నమ్మిందీ, భవిష్య త్తులో నమ్మబోయేదీ నా నమ్మకాన్నే.*
* *ప్రజలే మా బలం.*
* *సకాలంలో పని పూర్తవటం గొప్పకాదు. ఇంకాముందుగా పూర్తిచెయ్యటమే నా ఆశయం.*
* *ఓటమిని దరి చేరనీయకు. ధైర్యమే నీ దృఢ విశ్వాసంగా ప్రారంభించు.*
* *నియమాల్ని మార్చలేము. కానీ అవి మనల్ని నియంత్రించే విధానాల్ని మార్చు కోగలం.*
* *ధీరూభాయి ఒకనాటికి పోతాడు. కానీ ఉద్యోగులు, వాటాదారులే ఈ రిలయన్స్ సంస్థల్ని నడిపిస్తారు. హేట్సాఫ్ ధీరూ భాయ్ అంబానీ.*

లేచాడు. అంతలో ఆ సింఫనీ దర్శకుడు థామస్‌ని పిలి చాడు 'అన్ని వందల వాద్య పరికరాల మధ్య తను ఏపాటి?' అని అనుమానంగా వెళ్ళాడు. వేదిక నిశ్శబ్దమై పోయింది. థామస్‌ని 'పికలో' వాయించమన్నారు. వయొలిన్లతో మంద్రంగా లీడ్ ఇచ్చి సింఫనీలో మిక్స్ చెయ్యటంతో ఆడియన్స్ స్టాండింగ్‌ఓవేషన్ ఇచ్చారు. థామస్ పులకించిపోయాడు. తొందరపడి ఆ ప్రదర్శన లోంచి వెళ్ళిపోయుంటే ఇంతటి గొప్ప గౌరవం థామ స్‌కి దక్కేదేనా?

కాబట్టి ఆవేశం, అసహనం, అనుమానాలు విజయ మార్గంలో అనర్థహేతువులు.

**"మన బలాలు, బలహీనతలు, అవకాశాలు, అను మానాల గురించి పునరాలోచన చేస్తుండాలి. బలహీనతలు మనబలాన్ని అధిగమించినా, అనుమానం, అసహనం తలెత్తినా, అవకాశాలు క్షణంలో చేజారిపోతాయి"**

**–జార్జ్ షీహాన్**

వ్యక్తిగత విజయం శాశ్వతం కావాలంటే, సహ నంతో ఉంటూ, సమయం వచ్చినప్పుడు అవకాశం సద్వినియోగం చేసుకున్న వాళ్ళే విజేతలు.

### వ్యాపార విజయం

వ్యక్తిగత విజయం పర్సనల్. వ్యాపార విజయం ప్రొఫెషనల్. వ్యక్తిగత విజయానికి దోహదపడేవాళ్ళు కొంతమందే. ఆ విజయం ఒక వ్యక్తికే దక్కుతుంది.

వ్యాపార విజయం సాధించడానికి వ్యక్తులు సంఘ టితం కావాలి. పెట్టుబడివల్ల మాత్రమే విజయం రాదు. అణువణువునా తనదిగా భావించే వ్యక్తులు కలిసి కట్టుగా పనిచేస్తేనే వ్యాపార విజయం లభిస్తుంది.

రిలయన్స్ అనగానే అంబానీ, మైక్రోసాఫ్ట్ అన గానే బిల్‌గేట్స్ గుర్తొస్తారు. ఇక్కడ సంస్థలు శాశ్వతం. వ్యక్తులు మారుతుంటారు. సంస్థ అభివృద్ధిలో వ్యక్తులు తమ ప్రతిభ ప్రదర్శిస్తారు. ఆ పథకం అమలుకు వందలు, వేలమంది కష్టించి పనిచేస్తుంటారు.

### ప్రణాళికలు

ఏ విజయానికైనా ప్రణాళిక ఉండాలి. స్వల్ప, దీర్ఘ కాలిక ప్రణాళికలలో అనుకూలమైనది ఎంచుకుని ప్రణాళిక తయారుచేసి ఆచరణలో పెట్టాలి.

ఆర్నెల్ల వ్యవసాయానికి వరినాటు పడాలి. మూడేళ్ళ సాగుకు కొబ్బరితోట వెయ్యాలి. ఐదేళ్ళ రాజకీయాలకి పంచవర్ష ప్రణాళికలు, అదే దీర్ఘకాల ప్రణాళికలను "మనుషుల్ని" నాటాలి. వాళ్ళ పని తనాన్ని ప్రోత్సహించాలి. ముఖ్యంగా యజమాని ఒళ్ళు వంచి నిజాయితీగా పనిచేస్తూ ఇచ్చే ప్రేరణ అద్భుతాలు సాధిస్తుంది.

### సామాజిక విజయం

వ్యక్తిగత విజయం సంస్థలకి, సంస్థల విజయం సమాజానికి ఉపయోగపడితే 'వ్యవస్థ' ఏర్పడుతుంది. పటిష్టమైన వ్యవస్థగల దేశాలే పురోగమిస్తాయి.

అందుకే 'విజయం' ఒక్కరి సొత్తుగా మిగిలిపో కూడదు.

**(ఇంకా వుంది)**

# ఫ్యామిలీ కోర్టు

ఆర్. అనంతపద్మనాభ రావు



**"షటప్! వాట్ నాన్సెన్స్ యూ ఆర్ టాకింగ్" రెచ్చిపోయి అరుస్తోంది కాంతి.**

**"నువ్వు నన్ను అపార్థం చేసుకున్నావు కాంతీ!" బ్రతిమిలలాడాడు సుకుమార్.**

**"నిన్ను పెళ్ళి చేసుకోవడమే అపార్థం. నువ్వొక అబద్ధాల పుట్ట. నాలుగేళ్ళుగా నీతో కాపురం చేస్తూ అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తూనే ఉన్నాను" పెద్దపెట్టున ఏడుస్తూ జుట్టు పీక్కుంది కాంతి.**

"చిన్న పిల్ల శిరీష నిద్రపోతోంది. లేస్తే భయంతో వణికిపోతుంది. హాల్లోకి వెళ్ళి మాట్లాడుకుందాం, ప్లీజ్"

"నీతో సంపర్కానికి ఈ పాడుపిల్ల నాకు జీవితాంతం గుర్తు".

"దానికోసమైనా మనం కలిసిమెలిసి ఉందాం".

"ఇప్పుడా పరిస్థితి చేయి దాటిపోయింది. నీ వంశం వాళ్ళు నన్ను మోసం చేశారు. మేడిపండు పొట్టవిప్పి చూస్తే పురుగులుంటాయి. మీరూ అంతే!".

"కాంతీ! నన్ను లక్ష తిట్టు. ఊరుకుంటాను. మా వంశం ఏం చేసింది?"

"ఇంకేం చెయ్యాలి, నువ్వు మంచివాడివని నన్ను నమ్మించి మోసం చేశారు".

"నేనేం మోసం చేశాను, సెకండ్ సెటప్ పెట్టానా?"

"అంత సీన్ లేదు నీకు. నీ లోకం నీది. 24 గంటలూ కంప్యూటరే నీ భార్య. ఫేస్‌బుక్‌లో 'లైక్'లు మూడొందలొచ్చాయని మురిసిపోతావ్. పక్కనున్న నా ఫేస్ లైక్ చెయ్యవు"

"క్రమంగా నా పద్ధతులు మార్చుకుంటాను".

"ఇంక చాలు నీ నక్క వినయాలు. ఈ నాలుగేళ్ళలో ఏ రోజైనా ఒక్క టూర్‌కి వెళ్ళామా?"

"అమ్మా నాన్నా ఇల్లు కదలలేని వాళ్ళు కదా".

"వాళ్ళ గురించి మన ప్రైవసీ పాడు చేశావు. ఈ నాలుగేళ్ళలో కనీసం నాలుగు సినిమాలైనా చూశామా? మొన్నటికి మొన్న 'బాహుబలి' సినిమాకెళదామంటే శిరీష చిన్నపిల్ల అంది మీ అమ్మ. శ్రీమంతుడు సినిమాకు వెళ్దామంటే దాటవేశావు".

"సరే! ఇక నీ ఇష్టం వచ్చినట్టే వెళదాం".

"ఈ కాకమ్మ కథలు చాలు. నాకు చెన్నయ్ ట్రాన్స్‌ఫర్ వచ్చింది. రేపు నేను రిలీవై వెళుతున్నాను. ఇక శిరీష బాధ్యత నీదే. నీ కాకిపిల్లను నువ్వు ముద్దు చేసి ఎలా పెంచుతావో నీ ఇష్టం!" అంది కాంతి అక్కసుతో.

"కాకి పిల్లో, కోతి పిల్లో... అది మనపిల్ల".

"నాకిష్టమైన నీగ్రో పిల్ల ఫొటో బెడ్‌రూంలో పెట్టుకుంటే తీసేశావు".

"రాత్రిళ్ళు మనం ఏకాంతంగా గడిపేటప్పుడు ఆ నీగ్రోపిల్లను ఊహించుకున్నందువల్లే నీవు ఈ నల్లపిల్లకు జన్మనిచ్చావని సైకియాట్రిస్ట్ చెప్పలేదూ!"

"నువ్వు వ్యాసమహర్షివి" సీరియస్‌గా అంది కాంతి.

"కాంతీ! జరిగిపోయిన విషయాలు మళ్ళీ తవ్వి

పోస్తున్నావు"

"షటప్!" అంటూ బెడ్‌రూంలోంచి బయటికొచ్చి బోల్ట్ పెట్టింది కాంతి. అనవసర రాద్ధాంతం చేయడం ఇష్టం లేక సుకుమార్ చిన్నపిల్ల శిరీషను దగ్గరకు చేర్చుకొని నిద్రకు ఉపక్రమించాడు.

***

తెల్లవారగట్ల లేచిన అత్త శాంతమ్మ బెడ్‌రూం తలుపు బోల్ట్‌పెట్టి ఉండటం, కాంతి హాల్లో సోఫాలో నిద్రపోతుండటం చూసి రాత్రి భార్యాభర్తలు గొడవ పడి ఉంటారనుకుంది. కాంతి మనస్తత్వం తెలిసిన శాంతమ్మ నెమ్మదిగా బెడ్‌రూం తలుపు తీసి చూసింది. శిరీషమీద చేయివేసి నిద్రపోతున్నాడు సుకుమార్.

ఆ తగాదాలో తలదూర్చడం ఇష్టంలేక శాంతమ్మ తన కాలకృత్యాలు పూర్తి చేసింది.

మామగారు రాఘవయ్య ఓ అరగంటకు నిద్రలేచాడు.

కాంతి ఇంకా సోఫాలో నిద్రపోతోంది.

"ఏమమ్మా కాంతీ!" అని మెల్లగా లేపాడు.

ఠపీమని లేచికూర్చున్న కాంతి సీరియస్ ఫేస్‌తో బాత్రూమ్‌కెళ్ళింది.

నిద్రలేచిన సుకుమార్ ఏమీ జరగనట్టుగానే ప్రవర్తిస్తూ దినచర్యకు ఉపక్రమించాడు.

"ఈ సాయంకాలం ఫ్లైట్‌కి చెన్నై వెళుతున్నాను. రేపు అక్కడ ఆఫీసులో జాయిన్ కావాలి. అత్తయ్య, నువ్వు శిరీషను చూసుకోండి" సుకుమార్‌కి చెప్పి ఆఫీస్ కెళ్ళిపోయింది కాంతి.

ఆమె కోపం సుకుమార్‌కెరుకే. సాయంత్రానికి ఆ కోపం తగ్గి యథాస్థితి వస్తుందనుకున్నాడు. ఆ మాటలు సీరియస్‌గా పట్టించుకోలేదు.

మాట పట్టింపులు, పడకపోవడం తమ మధ్య సర్వసాధారణమే. ప్రతి చిన్న విషయాన్నీ రాద్ధాంతం చేసి భూతద్దంలో చూసి చిరాకు పడటం కాంతికి అలవాటేలే అని సరిపెట్టుకున్నాడు సుకుమార్.

***

"డాడీ! డాడీ!" నిద్ర లేచిన శిరీష ఏడుపు ప్రారంభించింది.

"నిద్ర లేచావా చిట్టీ!" అంటూ శిరీషను శాంతమ్మ చంకలోకి తీసుకుంది.

"లేచావా తల్లీ" అంటూ కూతుర్ని సుకుమార్ సముదాయించబోయాడు.

"మమ్మీ! మమ్మీ!" అంటూ గొంతు పెంచి ఏడుస్తోంది.

"నెలరోజులైనా పిల్ల ఎలా ఉందని కనీసం ఫోన్ కూడా చేయలేదు కాంతి. ఈ పిల్లను నువ్వు ఎలా సాకుతావురా" అంది శాంతమ్మ.

"చిట్టీ! కమాన్!" అంటూ టెడ్డీబేర్ చేతిలో పెట్టాడు సుకుమార్.

శాంతమ్మ పాలుకలిపి గ్లాస్ టేబుల్‌మీద పెట్టింది. శిరీషకు మెల్లగా పాలు తాగించాడు సుకుమార్.

"మమ్మీ కావాలి!" ఏడుపు పెంచింది శిరీష.

"అమ్మ టాటా వెళ్ళింది. సాయంకాలానికొస్తుంది. మనమిద్దరం రైల్వే స్టేషన్‌కెళ్ళి తీసుకొద్దాం, సరేనా" అంటూ పాపను లాలించాడు.

అలా ఆరు నెలలు గడిచిపోయాయి.

ఓ రోజు పోస్టులో వచ్చిన రిజిస్టర్ లెటర్‌చూసి ఆశ్చర్యపోయాడు సుకుమార్. చెన్నై అడ్వకేట్ రాగిణి నుండి వచ్చిన లెటర్. 'తన క్లయింట్ శ్రీమతి కాంతి



మతీదేవి విడాకులకు దాఖలు చేస్తోందనీ, ఆరునెలలు సెపరేషన్ కాలం పూర్తయింది గాబట్టి, పరస్పర అంగీకారంపై త్వరగా విడాకులు మంజూరు చేస్తారనీ' సారాంశం.

హైదరాబాద్ ఫ్యామిలీ కోర్టులో విడాకులకు దాఖలు చేసింది కాంతి. ఎన్నిసార్లు ఫోన్ చేసినా కాంతి మొబైల్ 'స్విచ్‌డ్ ఆఫ్' అని వస్తోంది. సుకుమార్ దిగాలుపడటం గమనించిన రాఘవయ్య చొరవ తీసుకుని వియ్యంకుడు పరబ్రహ్మానికి ఫోన్ చేశాడు.

"బావగారూ! నమస్కారం! బాగున్నారా?"

"విషయం చెప్పండి" విసుగ్గా సమాధానమిచ్చాడు పరబ్రహ్మం.

"నేను రాఘవయ్యను మాట్లాడుతున్నా. ఆరు నెలలుగా కాంతి మాతో మాట్లాడటం మానేసింది. చిన్నపిల్ల శిరీష ఒకటే ఏడుపు!"

"ఆరు నెలలకైనా మేం గుర్తుకొచ్చాం సంతోషం! మీరు మా పిల్లను నాలుగేళ్ళు వేపుకొనితిన్నారు. ఇకనైనా దాని మానాన దాన్ని బ్రతకనివ్వండి".

"బావగారూ! కాంతి మా బిడ్డతో సమానం. మాకు ఒక్కగానొక్క కొడుకు. వాడి నీడలోనే ఈ వానప్రస్థం గడపాలని మా తాపత్రయం".

"చిన్నప్పటినుంచీ మీ వాడిని అలానే పెంచారు. 24 గంటలూ కంప్యూటర్‌తో గడిపే భర్త నాకొద్దని, ఒంటరిగా జీవించాలని నిర్ణయించుకుంది నా కూతురు. చిన్నప్పటి నుంచి మా పిల్ల మొండిఘటం. ఫ్రెండ్స్ అంతా ప్రతి శనివారం సినిమాకెళుతుంటే వీళ్ళు సంవత్సరానికో సినిమా కూడా చూడలేదు. సిమ్లా టూర్ కెళ్దామంటే గర్భవతి వెళ్ళకూడదని మీరు అడ్డపడ్డారు".

"పరబ్రహ్మంగారూ! నాదొక చిన్న విన్నపం. తెలిసో, తెలియకో వాళ్ళిద్దరూ మాటపట్టింపులకు పోతే పెద్దవాళ్ళుగా సర్ది చెప్పవలసిన బాధ్యత మనది".

"మీరెందుకు మీ వాడికి బుద్ధి చెప్పలేదు? మాట పట్టింపులేకాదు, పడక పట్టింపులూ చూస్తూ ఊరుకున్నారు".

"వాడికి ఆఫీసు పని ఒత్తిడి. ఇంటికొచ్చినా ఆఫీస్ కాల్స్‌తో రాత్రి 11 గంటల దాకా సరిపోతుంది".

"అలాంటివాడు పెళ్ళి చేసుకోవడమెందుకు?"

"పెళ్ళయిన తర్వాత వాడు మాతో మాట్లాడటం కూడా తగ్గించాడు".

"మీ కొడుకును అమ్మకూచిలా పెంచారు. సంసారం చూసుకునే యోగ్యత నేర్పలేదు. ఎప్పుడూ అమ్మానాన్న అంటూ పిల్లకు దూరమయ్యాడు"

"మీకు చేతులెత్తి నమస్కరిస్తాను. మీరొకసారి చెన్నై వెళ్ళి కాంతితో మాట్లాడి వాళ్ళిద్దర్నీ కలపండి. ఈ క్షోభతో మేమెంతో కాలం బ్రతకం!"

"రాఘవయ్యగారూ! మనసులు విరిగితే అతకవు. ఈ కాలపు ఆడపిల్లల మనస్తత్వాలు బాగా మారిపోయాయి. వీళ్ళు సీతా సావిత్రీ అనసూయలు కారు."

"నాలుగేళ్ళ కాపురం నట్టేట కలపడం మాకిష్టం లేదు. మీరెలానో మంచి మనసు చేసుకొని కాంతిని దారిలోకి తీసుకురండి".

"మీ నయగారాలిక చాలు" ఫోన్ ఠపీమని పెట్టేశాడు పరబ్రహ్మం.

***

"మిస్టర్ సుకుమార్! ఈ విడాకుల విషయంలో మీ వాదన ఏంటి?" ఫ్యామిలీ కోర్టు జడ్జి లలితకుమారి ప్రశ్నించింది.

"నేనిలా దోషిలా నిలబడవలసి వస్తుందని కలలో కూడా ఊహించలేదు".

"మీ అభిప్రాయం?"

"నాకు ఈ విడాకులు ఇష్టం లేదు మేడమ్!"

"మీ ఇష్టాయిష్టాలు అలా ఉంచండి. కాంతిమతీదేవి ఆరునెలలుగా మీకు దూరంగా ఉంది. లాయర్ రాగిణి ద్వారా మీకు లీగల్ నోటీసు పంపింది. మీరు సమాధానం పంపలేదు".

"నేను సమాధానం చెబుతాను మేడమ్!"

"సరే! రాగిణిగారూ! మీ క్లయింట్ తరఫున మీరు వాదించండి" అంది జడ్జి.

"స్వయంగా కాంతి నోట ఆ మాటలు వినాలని ఉంది" సుకుమార్ అభ్యర్థించాడు.

"అది మీ ఛాయిస్ కాదు. లాయర్ ద్వారా వాదించే హక్కు ఆవిడకుంది. సో యువర్ అబ్జెక్షన్ ఈజ్ ఓవర్ రూల్డ్" కరాఖండిగా చెప్పింది లలితకుమారి.

రాగిణి లేచి నుంచుని చేతిలో ఫైలు చూస్తూ ఆర్గ్యూ చేసింది:

"మిలార్డ్! నా క్లయింట్ కాంతిమతీదేవి కోర్టు ద్వారా తక్షణమే విడాకులు కోరుకుంటోంది. పెళ్ళయిన తర్వాత నాలుగేళ్లుగా ఆవిడపడ్డ క్షోభ అర్థం చేసుకోండి. 2010 ఫిబ్రవరి 10న సుకుమార్‌తో కాంతిమతీదేవి వివాహం జరిగింది. ఆమె తండ్రి పరబ్రహ్మంగారు పదిలక్షలకు పైగా ఖర్చుపెట్టి అంగరంగ వైభోగంగా వివాహం చేశారు. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌తో తన కూతురి కాపురం మూడుపువ్వులు, ఆరుకాయలుగా వర్ధిల్లుతుందని ఆశపడ్డారు. రెండేళ్ళు పిల్లలు వద్దనుకొన్నారు భార్యాభర్తలిద్దరూ.

**కోర్టులో విడాకులకు దాఖలు చేసింది ఆమె. వాదనలువిన్న న్యాయమూర్తి ఏకాంతంగా ఆమెను తన ఛాంబర్‌కి పిలిచి ప్రశ్నించింది. నీ భర్త తరచూ నీ మీద చేయి చేసుకునేవాడా? అతనికి అంత సీన్ లేదు. అత్తమామలు హింసిస్తున్నారా? అంత ధైర్యం వాళ్ళకెక్కడిది? నీ భర్తకి అక్రమ సంబంధాలున్నాయా? అతగాడికి అంత టైములేదు. అతనికి నీ మీద అనుమానమా? నో...అని గట్టిగా అరిచింది. ఇంతకీ ఆమె విడాకులకు కారణమేంటి?**

మూడోఏడాది కాంతిమతీదేవి ఆడపిల్లను ప్రసవించింది. భార్యాభర్తలిద్దరూ తెల్లటి తెలుపు. పిల్ల నల్లపిల్ల. డాక్టర్ని సంప్రదించారు. చివరకు సైకియాట్రిస్టు డా. శారదకు కూడా ఏమీ పాలుపోలేదు. ఒకరోజు వీళ్ళ ఇంటికొచ్చింది. యథాలాపంగా వారి బెడ్‌రూం కెళ్ళి చూసింది. ఆ బెడ్‌కెదురుగా నీగ్రోపిల్ల ఫొటో ఉంది. ఆ బొమ్మ కాంతికి ఇష్టం. సుకుమార్ తీసేసినా మళ్లీ మళ్లీ తెచ్చి పెట్టుకునేది. ఆ ఫలితమే నల్లపిల్ల".

మంచినీళ్ళు తాగేందుకు ఓ నిముషం ఆగింది రాగిణి.

"చాలా విచిత్రం! సినిమా కథలా ఉంది. ప్లీజ్ ప్రొసీడ్" అంది జడ్జి.

"తన భర్త తననుతప్ప మరెవర్నీ ఆదరించకూడదనే పొసెసివ్ మనస్తత్వం కాంతిది. సుకుమార్ తన తల్లిదండ్రులపట్ల ఆదరణ చూపేవాడు. భార్యను టూర్లకు, సినిమాలకు తీసుకెళ్ళేతత్వం కాదు. కంప్యూటర్‌తోనే కాలక్షేపం. ఆఫీస్‌కాల్స్‌తోనే నిత్యం సరిపోయేది. పదినిమిషాల సమయంకూడా కేటాయించలేని భర్త తనకు అక్కరలేదనేది నా క్లయింట్ వాదన. ఆరునెలలు విడిగా ఉన్నారు. మై లార్డ్! నా క్లయింట్‌కు వెంటనే విడాకులు మంజూరుచేసి మానసిక శాంతి కలిగించండి" వాదన పూర్తిచేసి రాగిణి కూర్చుంది.

"ఈ కేసును జూన్ 14వ తేదీకి వాయిదా వేస్తున్నాను" అంటూ జడ్జి బెంచి దిగి తన రూంలోకెళ్ళిపోయింది.

***

చెన్నై ఆఫీసు క్యాంటీన్. లంచ్ అవర్లో టేబుల్ ముందు కూర్చుని క్యారియర్ విప్పుతోంది కాంతి.

అర్థాంతరంగా ఎదురుపడ్డ సుకుమార్‌ను చూసి క్యారియర్ సర్దుకుని వెళ్ళిపోయింది కాంతి.

"కాంతీ! ప్లీజ్! లిజన్ టుమీ" ప్రాధేయపూర్వకంగా అన్నాడు సుకుమార్.

"............................" మౌనమే సమాధానం.

"అలా లాన్‌లో కూర్చుని మాట్లాడుకుందాం!"

"కొట్లాటతప్ప మాట్లాడటం తెలియదు నీకు. మీ అమ్మానాన్నలకు వెండి విగ్రహాలు చేయించి పూజ గదిలో పెట్టి నామస్మరణ చేయండి".

"శిరీష జీవితం పాడైపోతుంది... ప్లీజ్!" కాంతి చేతులు పట్టుకుని బ్రతిమలాడాడు.



"నో! నో! నా జీవితం నన్ను బ్రతకనీయండి. మీరు మరో పెళ్ళి చేసుకోండి!"

"స్టాపిట్" చెంపచెళ్లుమనిపించాడు సుకుమార్.

"ఇది ఆఫీస్ క్యాంటీన్. మీపై పోలీస్‌కేసు పెడతాను".

"నన్ను జైలుకు పంపిస్తావా".

"షటప్"

"నువ్వు ఎన్నిసార్లు నా నోరు మూయించలేదు. నా నోరే కాదు, అత్తమామల నోరు కూడా మూయించావు. అయినా మేమెవ్వరం నోరెత్తలేదు".

"మీరు అంతా నంగనాచులు. మీ మీద నేను హెరాస్మెంట్ కేసు పెడితే ముగ్గుర్నీ తక్షణం జైలులో పెడతారు"

"మేం ముగ్గురమేకాదు, శిరీషకూడా మాతో వస్తుంది".

"సింపతీతో నన్ను బంధించాలనుకోవద్దు. మీ కూతురికి మీ లక్షణాలే వచ్చాయి. మీరు హాయిగా జీవించండి. నన్ను వదిలెయ్యండి. ఎన్నడూ లేనివిధంగా నాపై చెయ్యిచేసుకున్నావు".

"మళ్ళీ పెళ్ళి అనగానే మరి నాకు విపరీతమైన కోపం వచ్చింది".

"బై బై" అంటూ విసురుగా వెళ్ళిపోయింది కాంతి.

సుకుమార్ ఇంటిముఖం పట్టాడు. శాంతమ్మ, రాఘవయ్య కుంగిపోయారు.

తమ కళ్ళెదుటే ఒక్కగానొక్క కొడుకు కాపురం నట్టేట మునిగింది.

శిరీష మాటిమాటికీ మారాం చేస్తూ "మమ్మీ కావాలి" అంటోంది.

***

ఫ్యామిలీ కోర్టు జడ్జి కాంతిని తన రూంలోకి ఏకాంతంగా పిలిపించింది.

"కాంతీ! నీ ఫైలు చదివాను. రాగిణి వాదనలు విన్నాను. చివరగా నీ నిర్ణయం చెప్పు!" లలితకు మారి లాలిస్తూ అంది. ఆమె పేరులోనే కాదు ఆమె మాటల్లోనూ లాలిత్యమే.

మౌనంగా కూర్చుండిపోయింది కాంతి.

"పది నిమిషాల్లో విడాకులు మంజూరు చేస్తాను, కానీ...."

"మేడమ్! దయచేసి నన్ను బంధవిముక్తురాలిని చేయండి".

"ఇప్పుడు నీకున్న బంధాలు ఏమిటి కాంతీ?"

"ఇరవైనాలుగు గంటలూ 'అమ్మా నాన్న' అంటూ తిరిగే మొగుడు నాకొద్దు. నిత్యం కంప్యూటర్ ముందు కూర్చునే భర్త నా వాడు కాదు. సినిమాలకు, టూర్లకు, డిన్నర్లకు తీసుకెళ్ళని మగాడు నా దృష్టిలో మగాడు కాదు మృగాడు".

"నీ వేదన నాకు అర్థమైంది. ఈ ఫ్యామిలీకోర్టులో గత రెండేళ్ళల్లో కనీసం ఇరవై జంటలకు విడాకులు మంజూరు చేశాను. అది నా విధి నిర్వహణలో భాగం".

"మాది 21వ జంట అనుకోండి. మీకు జీవితాంతం రుణపడి ఉంటా"

"కాంతీ! మనుషుల్ని కలపడం కష్టం. విడదీయడం సులభం. 'వలనంటె బంధము వలదంటె మోక్షము' అన్నాడు అన్నమయ్య. ఒకసారి విడిపోయిన జంట ఇక జీవితాంతం ఆ చేదు అనుభవాలు నెమరువేసుకుంటూ తెగిన గాలిపటాల వలె తిరుగుతుంటారు".

"సారీ మేడమ్! నేనింక ఏమీ వినదలచుకోలేదు".

"సూటిగా నాలుగు ప్రశ్నలడుగుతాను. ఆలోచించి సమాధానం చెప్పు"

"మీరు వంద ప్రశ్నలడిగినా టకటకా సమాధానం చెప్పగలను".

"సుకుమార్ తరచూ నీ మీద చేయి చేసుకునేవాడా?"

"అంత సీన్ లేదు".

"మీ అత్తమామలు హింస పెట్టేవారా?"

"వాళ్లకంత ధైర్యం ఎక్కడ ఏడ్చింది?"

"సుకుమార్‌కు అక్రమ సంబంధాలున్నాయా?"

"అతగాడికి అంత టైం ఎక్కడిది?"

"నీ మీద అనుమానమా?"

"నో! నో! నో!" గట్టిగా అరిచింది కాంతి.

"ఆరు నెలలు విడిగా ఉండటంతప్ప విడాకులు అడగడానికి నీకు వేరే కారణాలున్నాయా?"

"లేవు. లేవు. మీరు నన్ను కౌన్సెలింగ్ పేరుతో హిప్నటైజ్ చేస్తున్నారు".

"అవును. సుకుమార్ నాకు లంచమిచ్చాడని ఫిర్యాదు చెయ్యి"

"సరే! మీరు చెప్పదలచుకున్నది చెప్పండి!"

"ఆ తలుపువేసి రా, వచ్చి నింపాదిగా నా మాటలు విను. తర్వాత నీ ఇష్టం"

కోపంగా రకీమని డోరు వేసి వచ్చింది కాంతి.

"కాంతీ! నాకు నీ అంత ఓ కూతురుంది. ఇది కల్పిత కథ కాదు. నేనూ, నా భర్తా న్యాయవాదులుగా ఉన్నప్పుడు ప్రేమించి పెళ్ళి చేసుకున్నాం. పెద్దలను ఎదిరించి వర్ణాంతర వివాహం చేసుకున్నాం. మా వారు గొప్ప క్రిమినల్ లాయరు. ఆయన మంచితనం చూసి ప్రేమించాను. హైదరాబాద్‌లో కాపురం పెట్టాం. ఆయనకు ప్రాక్టీసు బాగా పెరిగింది. ఆరేళ్ళల్లో ఆయనకు ఫైల్ బాగా పెరిగింది. ఆర్జన పెరిగింది. హైదరాబాద్ కోర్టుల్లో నేను ప్రాక్టీసు చేశాను"

"మేడమ్! మీరు నన్ను మనసు మార్చుకునేలా మెస్మరైజ్ చేస్తున్నారు" అంది కాంతి కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"నాకు ఆ అవసరమేమీ లేదు. నేనూ నీలా తొందరపడే విడాకులు కోరాను. నా భర్త ఎన్నో రకాలుగా బ్రతిమిలాడాడు. ఇంతలో నాకు డిస్ట్రిక్ట్ జడ్జి సెలక్షన్ వచ్చింది. ఒంగోలులో పోస్టింగ్ ఇచ్చారు. మా ఇద్దరికీ ఓ సంవత్సరం మాట పట్టింపులు. నేనే విడాకులకు పిటిషన్ దాఖలు చేశాను. ఆయన ఉదాసీనంగా ఉన్నారు. నా పలుకుబడి ఉపయోగించి నేను విడాకులు పొందాను".

"అదృష్టవంతులు".

"కాదు. నా జీవితంలో నేను చేసిన పొరబాటు. నాకు ఆ విషయం రెండేళ్ళ తర్వాత తెలిసి వచ్చింది. ఒంటరి ఆడదాని జీవితం ముళ్ల పొద. నానారకాల మనుషుల మధ్య జీవనం. లీగల్‌గా మేం వేరుపడిపోయాం. కానీ మావారు బంగారుకొండ. నన్ను ఆయన మళ్లీ ఆదరించారు. నా తప్పు తెలిసి క్షమాపణ కోరాను. మా జీవితం ఇప్పుడు..."

"సారీ! మేడమ్! నా కంటికున్న పొరలు తొలగించారు. కంటికి గంతలు కట్టిన గుర్రంలా నేను నా తోవలో పరుగెత్తాను. మీరు నా బ్రతుకు బాటను పూలబాట చేశారు".

"మళ్లీ వాయిదా నాటికి సుకుమార్, నువ్వూ కలిసి నా కోర్టుకు వచ్చి కేస్ విత్‌డ్రా చేసుకోండి!"

"అలాగే మేడమ్!" ధారగా వస్తున్న కన్నీళ్ళు తుడుచుకుంటూ లేచింది కాంతి.

**సెల్: 9866586805**

## రకూల్‌కి బోర్ కొట్టిందా?

*మామూలు బోర్ కాదు ఇది! టాలీవుడ్ మీద రకూల్‌కి బోర్ కొట్టింది అంటున్నారు సినీ జనాలు. ఎందుకంటే...ప్రస్తుతం రకూల్ తెలుగులో రెండు సినిమాలు మాత్రమే చేస్తోంది. మధ్యలో కోలీవుడ్‌లో ఓ సినిమా అంగీకరించింది. ఇప్పుడు బాలీవుడ్‌లో ఓ సినిమాకి గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. మొత్తానికి రకూల్ చేతిలో మూడు సినిమాలు మాత్రమే ఉన్నాయి. టాలీవుడ్‌లో సినిమా అడిగిన వారందరికీ డేట్లు లేవని తిప్పి పంపించేస్తోందట! బాలీవుడ్‌లో మాత్రం కథలు వింటోందట!అంటే తెలుగులో డేట్లు ఉండవు కానీ, హిందీ సినిమాకి ఉంటాయా? అన్న అనుమానాన్ని కొందరు వ్యక్తం చేస్తున్నారు.*




**ఎక్కడెక్కడో తిరుగుతూ ఉండిపోయిన నిధి చివరకు ఇంటిదారి పట్టాడు. వీధిలోంచీ ప్రధాన ద్వారం దాటి, ఇంటి ఆవరణలో నడవసాగాడు. నిధి తండ్రి కర్దముడు గున్నమామిడి చెట్టు కింద అరుగుమీద కూర్చున్నాడు. అది అతని శాశ్వత విశ్రాంతి స్థానం. అరుగుమీద అతని దగ్గరగా గాంధారుడు కూర్చున్నాడు. కర్ద ముడికి అతను బాల్యమిత్రుడు. దగ్గరదగ్గరగా ఉన్న ఆ ఇద్దరి తలలూ పక్కపక్కనే ఉంచిన ముగ్గు బుట్టల్లా ఉన్నాయి.**

ఓరకంట నిధి రాకను గమనించిన గాంధారుడు పైకి లేచాడు. 'మీవాడొస్తున్నాడు. తనకి ధైర్యం చెప్పు.'

కర్దముడు కొడుకువైపు చూస్తూ, అలాగే అన్నట్టు తలాడించాడు. గాంధారుడు ప్రధానద్వారం వైపు మెల్లగా అడుగులు వేస్తున్నాడు. నిధి ఎదురు పడగానే ఆగి, అతనివైపు సానుభూతితో చూశాడు.

"అభినందనలు అందుకో నాయనా! ఖడ్గ యుద్ధంలో, గదా యుద్ధంలో అహంకారంతో, ఈర్ష్యతో కేసరి ప్రారంభించిన ముష్టి యుద్ధంలోనూ నీ నైపుణ్యాన్ని కళ్ళారా చూశాను! నీ విన్యాసంలో రెండు అంశాలున్నాయి. అవి నాకు నచ్చాయి. ఆయుధాన్ని ఒడుపుగా, వదులుగా పట్టుకోవడం. నీ శారీరక చలనాన్ని అదుపులో, పరిమితిలో ఉంచుకుని ఆయుధాన్ని నాట్యం చేయించడం! ముష్టాముష్టి, బాహాబాహీ చేసే ముష్టియుద్ధంలో శరీరాన్ని చలనంతో నింపేయాలి. శస్త్ర విద్యావిన్యాసంలో ఆయుధాలకు ప్రాణం పోయాలి. అదే చలనం! నీ విజయానికి కారణాలు ఇవే!"

"విజయం నాది కాలేదు, మామా..." నిధి చిరునవ్వు నవ్వాడు. ఆ చిరునవ్వులో ఆనందం లేదు; తృప్తిలేదు.

"విజయం నీదే అని చూసిన ప్రతీవ్యక్తికీ తెలుసు నిధీ! పందేలు కాసిన వాళ్ళు గెలుపు నీదే అని నిశ్చయించుకున్నారు తెలుసా? నాలుగు చెరగుల నుండీ వచ్చిన యోధుల ద్వారా మన సామ్రాజ్యమంతా నీ విజయం గురించీ, నీకు జరిగిన అన్యాయం గురించీ తెలిసిపోతుంది! రాజుగారిచ్చే బహుమానాల విలువకు కోటి రెట్లు కీర్తి నీ కొంగులో పడింది! వెళ్ళు. నాన్నతో మాట్లాడు" గాంధారుడు ఆప్యాయంగా నిధి చేతిమీద తట్టి కదిలాడు.

నిధి గున్నమామిడి చెట్టువైపు నడిచాడు. కర్దముడు తల పైకెత్తి, కొడుకువైపు చూశాడు "కూర్చో".

### జరిగిన కథ

**సు**భిక్ష రాజ్యంలో వసంత నవరాత్రుల పదవ రోజు వీరదశమి. ఆ సందర్భంగా జరిగిన తుది స్పర్ధలో కేసరీ, నిధీ తలపడతారు. అన్నిట్లోనూ నిధినే విజయం వరిస్తుంది. అయినా స్పర్ధ విజేత ఎవరన్నది ప్రకటించరు. అందుకు కారణం నిధి క్షత్రియుడు కాకపోవడమేనని ప్రకటిస్తారు. దాంతో నిధి బుర్రలో ఆలోచనలు పరుగెడుతుండగా క్రీడాంగణం నుంచి బయటపడతాడు. ఆ తర్వాత...



నిధి అరుగుమీద కూర్చున్నాడు. కర్దముడు చిన్న మట్టిపాత్రను కొడుకువైపు జరిపాడు. "గాయాలు మానడానికి ఆకు పసర్లతో ఔషధం సిద్ధం చేశాను. రాసుకో".

"గాయం – గుండెలో మందు రాయడానికి అందనిచోట అయింది నాన్నా".

కర్దముడు తల పంకించాడు. "నీ ప్రతాపం గురించీ విన్నాను; నీకు జరిగిన అన్యాయం గురించీ విన్నాను.."

"నా విజయానికి నా కులం అడ్డొచ్చింది".

"అడ్డొచ్చింది నీ కులం కాదు నిధీ, ఆ కేసరి కులం!" కర్దముడు కసిగా అన్నాడు. "రాజుగారికి అల్లుడుగా, సింహాసనానికి వారసుడుగా రూపొంద బోయే మేనల్లుడు ఆ కేసరి..."

"రాజుగారికి అల్లుడు కావడానికీ, వారసుడు కావడానికీ వీరదశమి పోటీలో విజయం సాధిం చాలా నాన్నా?" నిధి ప్రశ్నించాడు.

కర్దముడు చిన్నగా నవ్వాడు. "రాజరికం పుట్టు కతో లభించేది. పరాక్రమాలతో పనిలేదు దానికి. స్పర్ధలలో యోధుడిగా పాల్గొనేలా చేయకున్నా కేస రిని సింహాసనం మీద కూర్చోబెట్టవచ్చు. ఎవడు కాదంటాడు? కత్తి పట్టలేని వ్యక్తి కూడా జన్మసిద్ధంగా రాజు కావచ్చు. పిరికివాడు రాజు కావచ్చు. నపుంసకుడు కూడా రాజు కావచ్చు. రాజు సంతతి అయితే చాలు!".

"అయితే కేసరిని స్పర్ధలోకి ఎందుకు దించి నట్టు?" నిధి ప్రశ్నించాడు.

"కీర్తి కండూతి! పేరుకోసం దురద!" కర్దముడు నవ్వుతో అన్నాడు. "అతనూ శస్త్రవిద్యలో ఆరితేరిన వాడే. అంతిమస్పర్ధ దాకా, నీతో సమానంగా ఎగ బ్రాకాడు కద! కాకపోతే, కులం పేరుతో విజయాన్ని నీకు దూరం చేసి, ఓడిపోయిన కేసరి చేతిమీద 'వాత' పెట్టకుండా తప్పించడం నీతిమాలిన చర్య. పరాజితుడిగా ప్రకటించి, అతన్ని పట్టాభిషిక్తుడిని చేస్తే మాత్రం ఎవరు ప్రశ్నిస్తారు? ఇది కీర్తికాంక్షతో, స్వార్థంతో, అహంకారంతో చేసిన పాడు పని!"

నిధి మట్టిపాత్రలోని ఆకుపచ్చ రసాన్ని చూపుడు వేలితో కలియదిప్పుతూ ఉండిపోయాడు.

"మహాభారతంలో శస్త్రపరీక్ష సమయంలో జరి గిన కర్ణుడి ఐతిహ్యం గుర్తొస్తోంది. మహావీర హారాన్ని నీకు దూరం చేయడంలో కర్ణుడి సంఘటనను స్ఫూర్తిగా తీసుకున్నారనిపిస్తోంది!"

నిధి తండ్రివైపు ఆశ్చర్యంగా చూశాడు.

కర్దముడు తల పంకించాడు. "ఇందులో రాజగురువు మేధావి ప్రమేయం ఉండి ఉంటుంది. కుయుక్తులు రచించడంలో అతను మహామేధావి. ఇంక రాజు గారికి రాజగురువు మాటే వేదం; మంత్రి మాట మంత్రం! అలవిమాలిన మంచితనం ఆయనది. అది ఆయన బలహీనత. ఆయన చేతిలో ధరించే రాజ దండం యదార్థ రాజదండం కాదు, ఛాయాదండం. రాజదండం నీడ అది!"

"నన్ను వెంటాడుతూ, వేధిస్తున్న అంశం ఒక టుంది నాన్నా..." నిధి మట్టిపాత్రలో వేలితో కెలు కుతూ అన్నాడు.

"ఏమిటయ్యా?" కర్దముడు ఆప్యాయంగా అడి గాడు.

"కేసరి నన్ను చూస్తూ నవ్విన నవ్వు!" నిధి కసిగా అన్నాడు. ఎర్రటి కళ్ళతో తండ్రి ముఖంలోకి చూశాడు. "చిత్తుగా ఓడిపోయి, పైవాళ్ళ కుతం త్రంతో ఓటమిని దూరం చేసుకుని అతను నవ్విన నవ్వు నా గుండెలో గాయం చేసింది నాన్నా. ఆ నవ్వును ఈచేత్తో చెరిపి వేయాలి!"

కొడుకువైపు జాలిగా చూశాడు కర్దముడు. "నీ స్థితిని అర్థం చేసు కోగలను. జయాపజయాలు, దైవాధీనాలన్నారు పెద్దలు. ఇది అతని అంతిమ విజయం కాదు. ఒకటి ఎప్పుడూ గుర్తుంచుకో నిధీ. చివర నవ్విన వాడిదే నవ్వు! చివర గెలి చినవాడిదే విజయం!".

"నాన్నా..."

"నీకు ఎదురైంది పరాజయం కాదు; అన్యాయం! కేసరికి దక్కింది విజయం కాదు; అపకీర్తి! నీలో రగిలే పగను అదు పులో పెట్టుకో. ఒక సత్యం గుర్తుపెట్టుకో. కేసరి కాబోయే చక్రవర్తి. అంగబలం, అస్త్ర బలం, జనబలం, ధనబలం అన్నీ ఉన్న వాడు. నీ క్షేమం కోసం గుర్తుంచుకో నాయనా!" కర్దముడు నిధి భుజం మీద చెయ్యివేస్తూ అన్నాడు.

నిధి అరుగుదిగి నిలుచుని, తండ్రివైపు తదే కంగా చూశాడు. "ఏనుగు పెద్దది. అంకుశం చిన్నది నాన్నా!"

స్నానాలగదివైపు వెళ్తున్న కొడుకును రెప్ప వేయకుండా చూస్తూ, బరువుగా నిట్టూ ర్చాడు కర్దముడు.

***

సూర్యుడు ఉదయిస్తున్నాడు. అస్తమి



స్తున్నాడు. పగలూ, రాత్రీ ఒకదాన్నొకటి వెంటా డుతూ, కాలాన్ని కొలత వేస్తున్నాయి. గాయాలను మాన్పే శక్తి ఉన్న కాలం నిధిలో రగులుకున్న పరాభ వాన్ని చల్లార్చుతోంది. వీధుల్లో, వాడల్లో, ఆలయాల్లో ఎదురయ్యే ప్రతీ పురుషుడూ, ప్రతీ స్త్రీ, ప్రతీ యువ కుడూ అతన్ని మెచ్చుకునే వారే! గాంధారుడు చెప్పింది నిజమే. తన కీర్తి విశాలంగా విస్తరిస్తోంది. మహారాజుగారి కీర్తి మసకబారుతోంది.

నిధిలో పరాభవాగ్ని చల్లారుతున్నప్పటికీ, ఓడి పోయి కూడా తనను చూసి నవ్విన కేసరి మీద ఆగ్రహం కాలం గడిచేకొద్దీ ఎదుగుతోంది కానీ అణ గారడం లేదు. ఒక సత్యం నిధికి తెలుసు. తను సామాన్యుడు. కేసరి అసామాన్యుడు. సామాన్యుడు అసామాన్యుడిని ఎదుర్కోవాలంటే అవసరమైంది బలం కాదు; కాలం! కాలం కలిసి రావాలి! కాలం కలిసి వస్తోంది. అయితే అది నిధికి తెలీదు!

***

నందికేశ్వర మహారాజు ఆంతరంగిక మంది రంలో కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. విశ్వరూపం ధరించిన ప్రశ్న ఆయన బుర్రను తొలిచేస్తోంది. అటూఇటూ తిరుగుతున్న నందికేశ్వరుడు గోడకున్న నిలువుటద్దం ముందు నిలబడి చూశాడు. కను బొమలు ముడివేసి, నుదురు చిట్లించి ప్రతిబింబం ఆయనవైపు చూస్తోంది. ప్రతిబింబం కళ్ళల్లో ఎర్రజీర స్పష్టంగా కనిపిస్తోంది. ఆలోచన, మెదడును కాల్చే స్తున్న ఆలోచన తన కళ్ళు ఎర్రబడేలా చేసింది. నంది కేశ్వరుడు తనను నరకయాతనకు గురిచేస్తున్న ప్రశ్నకు సమాధానం కోసం వెదుకుతున్నట్టు అద్దం లోకి చూస్తూ ఉండిపోయాడు.

గంటల చప్పుడుతో ఆంతరంగిక మందిరం తలుపులు తెరచుకున్నాయి. ద్వారపాలకుడు విన యంగా తలవాల్చాడు.

"మహారాజుగారికి మనవి. మహామంత్రిగారూ, రాజగురువుగారూ, సేనాపతిగారూ, ఆస్థాన జ్యోతి ష్కులవారూ విచ్చేశారు.."

నందికేశ్వరుడు అద్దంముందు నుండి ద్వారం వైపు తిరిగాడు. వచ్చినవాళ్లను ప్రవేశపెట్ట మన్నట్టు చేత్తో సైగచేశాడు. తన ఆసనం వైపు అడుగులు వేశాడు. రాజగురువు మేధావీ, మహామంత్రి సత్య సంధుడూ, సేనాని వీరకేసరీ, ఆస్థాన జ్యోతిష్కుడు ముక్కంటీ లోపలికి వచ్చారు.

"గురుదేవులకు ప్రణామాలు!" నందికేశ్వరుడు నమస్కరించాడు.

"ఆనందమస్తు!" మేధావి చెయ్యెత్తి గంభీరంగా దీవించాడు, తన ఆసనంలో కూర్చుంటూ.

"అభివాదం చేసినప్పుడల్లా తమరేమో "ఆనంద మస్తు" అని ఆశీర్వదిస్తూనే ఉన్నారు. ఆ దీవెన ఫలిం చిందీ లేదు; ఆనందం మాకు అందివచ్చిందీ లేదు!" నందికేశ్వరుడు బరువుగా నిట్టూర్చి ఆసనంలో కూర్చున్నాడు.

మేధావి చిన్నగా నవ్వాడు. "పోనీ, ఆశీర్వచ నాన్ని మార్చివేద్దాం! ఐశ్వర్యమస్తు!"

"అది అత్యవసరం. మీ దీవెన ఫలించాలని కోరు కుంటున్నాం!" నందికేశ్వరుడు అన్నాడు. "ఆ దీవె నను ఎప్పుడూ మీ నాలుక మీద నాట్యం చేయిస్తూ ఉండండి!"

"ప్రభువులు తీవ్రంగా ఆలోచిస్తున్నట్టున్నారు..." మహామంత్రి సత్యసంధుడు అన్నాడు.

"ఆలోచన కాదు అమాత్యా... సంఘర్షణ! మాలో సంకులసమరం సాగుతోంది. అవునంటే ఆపద; కాదంటే కష్టం!" నందికేశ్వరుడు బరువుగా నిట్టూర్చాడు. "చక్రవర్తి విజయానందులు అత్యవసర రహస్య లేఖ పంపించారు. వార్తాహరుడు సాక్షాత్తూ మా హస్తా లకే అప్పగించి వెళ్ళాడు.."

"లేఖాంశంలోని సారాంశం!" రాజగురువు ప్రశ్నించాడు.

"ఏళ్ళ తరబడీ చెల్లించకుండా ఉన్న కప్పం నిర్ణ యించబడిన వడ్డీతో కలిపి చెల్లించాలి.."

"అంతేనా!" మేధావి తేలిగ్గా అన్నాడు.

"పూర్తిగా వినండి గురుదేవా!" నందికేశ్వరుడు విసుగ్గా అన్నాడు.

"మూడు మాసాల వ్యవధిలో రుణంగా రూపాం తరం చెందిన కప్పం వడ్డీతో సహా చెల్లించి తీరాలి.."

"చెల్లించలేని పక్షంలో చక్రవడ్డీ విధించబడుతుం దన్నారా ప్రభూ?" మహామంత్రి అన్నాడు.

"చక్రవడ్డీ అయినా, వక్రవడ్డీ అయినా బాగానే ఉండేది. చెల్లించకపోతే... మా ఏకైక పుత్రికను చక్రవర్తి గారి ఏకైక పుత్రుడికి ఇచ్చి వివాహం జరిపించాలి. కప్పమా? కన్యాదానమా? ఏదో ఒకటి అట! ఏదో ఒకటి నెరవేర్చకపోతే..."

"నెరవేర్చకపోతే?" మేధావి అన్నాడు.

"యుద్ధానికి సిద్ధం కావాలట!"

**ఆంతరంగిక మందిరంలో నందికేశ్వర మహారాజు కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. ఒకేఒక ప్రశ్న అతన్ని తొలిచేస్తోంది. ఇంతలో మహామంత్రీ, రాజగురువూ, సేనాపతీ, ఆస్థాన జ్యోతిష్కుడూ మందిరంలోకి ప్రవేశించారు. మహారాజు రాజగురువుకు నమస్కరించి, "అనుకోని ఆపద వచ్చిపడింది. అవునంటే ఆపద, కాదంటే కష్టం అన్నట్టుగా ఉంది" అంటూ అంతా వివరించాడు నందికేశ్వరుడు. ఇంతకీ మహారాజుకి వచ్చిన ఆపద ఏమిటి?**

"చక్రవర్తి సైన్యంతో యుద్ధమా! పుష్కరసామ్రాజ్య సైన్యంతో యుద్ధానికి మన సైన్యం చాలదు!" సేనాని వీరసేనుడు ఆందోళనగా అన్నాడు.

"కన్యాదానం చేస్తే మనం రుణపడినంత సొమ్ము మనకు కానుకగా వధుకట్నంగా ఇస్తారట!" నంది కేశ్వరుడు అన్నాడు.

"మన వీరకేసరి అపార్థం చేసుకోకపోతే... కన్యా దానం ఉభయతారకం అనిపిస్తోంది!" రాజగురువు అన్నాడు. "కేసరికి మరో కన్యను చూస్తే సరి!"

"గురుదేవా, మీకు తెలిసినట్టు లేదు. విజయా నంద చక్రవర్తి కుమారుడు దిగ్విజయానందుడు ధృతరాష్ట్రుల వారి అంశతో జన్మించాడు. పుట్టుగుడ్డి!" నందికేశ్వరుడు అన్నాడు.

"శివార్పణం! కబోదికి కన్యను ఎలా ధారపోస్తాం? కప్పమే నయం!" రాజగురువు అన్నాడు.

"ఒకటా? రెండా? ఏడేళ్ళ కప్పం పేరుకుపోయింది గురుదేవా!" మహామంత్రి అన్నాడు. "కొసరుగా వడ్డీ వడ్డిస్తున్నారుగా!"

"బొక్కసం నీళ్ళు లేని చిల్లుకుండలా ఉంది. వర్షా భావం... కాటకం... పన్నులు చెల్లించే రైతులు ఆప న్నులైనారు.." నందికేశ్వరుడు అన్నాడు.

"బొక్కసానికి అందుతున్న కొద్దిపాటి సొమ్ము పరిపాలనా నిర్వహణకే సరిపోతోంది...." మహా మంత్రి నీరసంగా అన్నాడు.

"ఏడేళ్ళ క్రితమే, 'పంచాంగ శ్రవణం' సందర్భంలో మన భావి ఆర్థికస్థితీ, ఆదాయ పరిస్థితీ ఏ విధంగా, నిరాశాజనకంగా ఉంటాయో ప్రభువులకు మనవి చేశాను" అంతవరకూ మౌనంగా ఉన్న జ్యోతిష్కుడు ముక్కంటి అన్నాడు.

"అది గుర్తుకు వచ్చే మిమ్మల్ని పిలిపించాం, ఆచార్య!" నందికేశ్వరుడు అన్నాడు. "ప్రస్తుత స్థితీ, సమీప భవిష్యత్తూ ఎలా ఉండగలవో గణనచేసి చెప్పండి! మాకిప్పుడు ఉపద్రవం నుండి ఉపశమనం కావాలి!"

"చిత్తం. సంవత్సరాది నాడే ఆ పని చేశాను. రాజ కుటుంబసభ్యుల గోచార ఫలితాలతో బాటు సుభిక్ష సామ్రాజ్య గోచారఫలం ఎలా ఉండగలదో పరిశీలిం చాను.."

"సుభిక్ష రాజ్యం! ఆరేడు సంవత్సరాలుగా ఆ పేరు నేతిబీరకాయ అయిపోయింది. సుభిక్ష రాజ్యాన్ని దుర్భిక్షం ఆవరించింది. ఆ దౌర్భాగ్యం మా పుత్రిక కంఠానికి చుట్టుకుంటోంది!"

"ప్రభువులకు ఒక మనవి.." ముక్కంటి అన్నాడు. "మన రాజ్యం సుభిక్షంగా మారి, పూర్వ వైభవాన్ని



సంపాదించుకోడానికి మరో ఐదేళ్ళు పడుతుంది..."

"శివార్పణం!" రాజగురువు అన్నాడు. "అప్పు డెప్పుడో దశరథ మహారాజు కాలంలో శని రోహిణీ నక్షత్ర కక్ష్యలో ప్రవేశిస్తే పన్నెండేళ్ళ పాటు దుర్భిక్షం కరాళ నృత్యం చేస్తుందన్నారని విన్నాం. ఇప్పుడు అలాంటి దుస్థితి.."

"గ్రహవీక్షణ రీత్యా మన రాజ్య భవిష్యత్తు అలా ఉంది ఆర్యా.."

"మన గణనలో ఏవైనా లోటుపాట్లు..." రాజ గురువు సాభిప్రాయంగా అన్నాడు.

"చిత్తం.. ఆర్యులు మన్నించాలి. గణనలో లేశ మాత్రమూ పొరపాటులేకుండా బహు జాగ్రత్తగా ఉంటాను. నేను చేసేది నడివీధి జ్యోతిష గణన కాదు ఆర్యా; మహారాజుగారి ఆస్థాన జ్యోతిష గణన!" ముక్కంటి అన్నాడు. "ఉదాహరణకి ఒక విషయం మనవి చేస్తాను. మొన్నటికి మొన్న మన సర్వసైన్యా ధ్యక్షులు వీరకేసరిగారి సుపుత్రులు... కేసరిగారి జాతకం చూసి, స్పర్ధలతో విజయం కాని విజయం సిద్ధిస్తుం దనీ, శరీరం మీద అగ్నిముద్ర పడదనీ చెప్పాను. అదే జరిగింది!"

"అవును.. ముక్కంటిగారు చెప్పారు. నేనూ, మా వాడూ తేలికగా తీసుకున్నాం.." వీరకేసరి నీరసంగా అన్నాడు.

"ప్రభువులు అనుమతిస్తే అతిరహస్యమైన ఒక అద్భుత విషయం విన్నవించుకుంటాను" ముక్కంటి పైకి లేస్తూ అన్నాడు.

"చెప్పండి ఆచార్య, ప్రస్తుతం ఏదో అద్భుతం జరగాల్సిందే!" నందికేశ్వరుడు అన్నాడు.

ముక్కంటి మహారాజు దగ్గరగా నడిచాడు. అతని చంకలో పట్టువస్త్రంలో చుట్టిన తాళపత్ర గ్రంథం ఉంది. ముక్కంటి ఒకసారి అందర్నీ కలియజూశాడు.

"నేను వెల్లడించబోయేది అతిప్రమాదకరమైన, అద్భుతమైన మహా రహస్యం. ఈ ఆంతరంగిక మందిరం దాటి బైటికి వెళ్ళకూడదు!" పెద్దలు అందుకు అంగీక రించాలి.

"ఆ విషయం అతిరహస్యంగా ఉంటుంది. ఇది మా వాగ్దానం! ఉండాలి. ఇది మా ఆజ్ఞ!" నందికేశ్వర మహారాజు గంభీరంగా అన్నాడు.

అందరూ తలలు పంకించారు.

ముక్కంటి పట్టువస్త్రాన్ని తొలగించి, ఒక తాళ పత్ర గ్రంథాన్ని వెలికితీశాడు. జాగ్రత్తగా మహారాజు ముందున్న గుండ్రటి పీఠం మీద పెట్టాడు.

"ఇది అతి ప్రాచీనమైన గ్రంథం ప్రభూ! రాజ మందిర గ్రంథాలయానికి అధిపతిగా ఉన్న నేను గ్రంథ పఠనను నిరంతరాయంగా కొనసాగిస్తున్నాను. ఒక మూలలో, ఇతర ఉద్గ్రంథాల క్రింద పడి ఉన్న ఈ గ్రంథం నా చేతికి, అప్రయత్నంగా చిక్కింది. తాళపత్రా లను గుదిగుచ్చిన దారం తెగిపోయింది. పత్రాలు వరుసక్రమంలో లేవు. ఓపికగా పరిశీలిస్తూ, క్రమ పద్ధతిలో వాటిని కూర్చి, గ్రంథంగా రూపొందించాను.

"ముక్కంటి ఆచార్యా, గ్రంథం అంటున్నారు, ఆ తాళపత్రాలు గ్రంథ పరిమాణంలో ఉన్నట్టు లేవే..." మహారాజు నందికేశ్వరుడు తాళపత్ర గ్రంథాన్ని చూస్తూ అన్నాడు.

"చిత్తం... పత్రాలసంఖ్య తక్కువే అయినా దానిని గ్రంథం అనే పేర్కొనాలి ప్రభూ. అవతారికలోనూ, ముగింపులోనూ... అంటే 'ఇతిశ్రీ'లోనూ కర్త ఈ చిన్న పొత్తాన్ని 'గ్రంథము' అనే అన్నాడు.."

"సరే... అది జ్యోతిష గ్రంథమా, ఆచార్య" మహా రాజు అడ్డు తగిలాడు.

"కాదు ప్రభూ.... మనవి చేస్తాను. గ్రంథ నామ ధేయం వినగానే ఆ గ్రంథంలోని విషయం అవగత మవుతుంది. గ్రంథం పేరు: "నిధి సన్నిధి".

"ఏమిటీ?! మరొకసారి చెప్పండి!" రాజగురువు అన్నాడు.

"నిధి సన్నిధి".

"అంటే..." నందికేశ్వర మహారాజు కుతూహ లంగా చూస్తూ అన్నాడు.

"ఏముంది ప్రభూ? నిధి అంటే సంపద. 'సన్నిధి' అంటే ఆ సంపద సామీప్యం. 'సంపద ఉన్న చోటు' అని మనం చెప్పుకోవచ్చు" ముక్కంటి అన్నాడు.

"ఏ నిధి? అది ఎక్కడ ఉంది? ఆ గ్రంథం ఏదో కల్పితగాథ కాదని ఎలా చెప్పగలరు?" సత్యసంధ అమాత్యుడు ప్రశ్నించాడు.

"పెద్దలందరికీ, ప్రభువులకూ ఒక విన్నపం. 'నిధి సన్నిధి' గ్రంథం గురించీ, అందులో పేర్కొన్న నిధి ఉనికి గురించీ, ఇంకా ఇతర అంశాల గురించీ వివ రంగా చెబుతాను. కాస్త ఓపికతో ఆలకించమని మనవి.." ముక్కంటి, తాళపత్ర గ్రంథాన్ని జాగ్రత్తగా చేతుల్లోకి తీసుకుంటూ అన్నాడు. "ప్రథమ పత్రంలో గ్రంథం పేరు మాత్రమే ఉంది. గ్రంథకర్త పేరు లేదు. ఇతిశ్రీలో కూడా గ్రంథకర్త తన పేరు చెప్పుకోలేదు. 'అజ్ఞాతకర్త' అని మాత్రమే పేర్కొన్నాడు. గ్రంథ రచనా కాలం ఏదో కూడా మనం ఊహించలేం. దాదాపు శిథిలావస్థలో ఉన్న తాళపత్రాలను ఆధారంగా చేసు కుని, శతాబ్దాల క్రిందటిదని అనుకోవచ్చు.

"ఇందులో ఉన్న లిపీ, భాషా రెండూ గ్రంథ రచన శతాబ్దాల క్రింద జరిగి ఉంటుందన్న ఊహకు ఊతమిస్తున్నాయి. భాష తెలుగే. నేటి తెలుగుకాదు, ఆనాటి తెలుగు. ఆనాటి ప్రాచీన ఆంధ్రభాషను పరి గణనలోనికి తీసుకుని, రచనాకాలం నిర్ణయించలేం. 'నిధి సన్నిధి' ఒక పైశాచిభాష గ్రంథానికి ఆంధ్రాను వాదం అని ఆ అజ్ఞాతకర్త పేర్కొన్నాడు.

## తెలుగులో తమన్నా కనిపించదా?

అవుననే అంటున్నారు టాలీవుడ్ జనాలు. 'బాహుబలి'లో నటించిన నటీనటులందరికీ విశ్వవ్యాప్తంగా పేరు వచ్చినా, తమన్నాకు మాత్రం ఎలాంటి లాభం చేకూరలేదు. ఆ సినిమా తరువాత తమన్నా తెలుగులో నేరుగా చేసిన ఓ సినిమా బాక్సాఫీసు వద్ద బొక్క బోర్లాపడింది. ఆ తరువాత తెలుగులో 'అభినేత్రి'తో కనిపించినా, అదీ ఫ్లాపే! ఈ సినిమా తెలుగు సినిమా కాకపోవడంతో తమన్నా మీద పెద్దగా ప్రభావం చూపలేదు. అయినప్పటికీ కోలీవుడ్‌లో రెండు, బాలీవుడ్‌లో ఒక సినిమా మాత్రమే చేస్తోంది. ఇవేమీ పెద్దప్రాజెక్టులు కావు. తెలుగులో కుర్ర హీరోయిన్ల హవా ఎక్కువయి పోవడంతో మూడు పదులకు దగ్గరలో ఉన్న తమన్న పని అయిపోయింది అంటున్నారు సినీ జనాలు. ఏది ఏమైనా ఇప్పట్లో అచ్చ తెలుగు సినిమాలో తమన్నా కనిపించే అవకాశాలు లేవట!

"కర్త ఎవరో తెలీదు. కాలం ఏదో తెలీదు. ఆ అంశాలను వదిలిపెట్టి ఇతివృత్తం ఏమిటో విందాం!" నందికేశ్వరుడు అన్నాడు.

"చిత్తం" ముక్కంటి అన్నాడు. "తొమ్మిది శ్లోకాలలో శ్రీమహాలక్ష్మీదేవి స్తుతి చేశాడు కర్త. ఒక్కొక్క శ్లోకంలో ఒక్కొక్క నిధి పేరు ఉపయోగిస్తూ లక్ష్మీస్తవం సాగింది. అంటే పద్మం, మహాపద్మం, శంఖం, మకరం, కచ్ఛాపం, ముకుందం, కుందం, నీలం, వరం అనే నవనిధుల నామధేయాలను లక్ష్మీదేవికి అన్వయిస్తూ స్తుతిచేశాడు. తదనంతరం నవనిధుల గురించి వివరాలు పొందుపరిచాడు. భారతదేశ అక్షాంశ, రేఖాంశాలను, నదులను, పర్వతాలను, పుణ్యక్షేత్రాలను పేర్కొంటూ మన సుభిక్ష సామ్రాజ్యం ఉనికిని వివరించాడు. సుభిక్ష సామ్రాజ్యంలోని నదులను, తటాకాలను, పర్వతాలను వర్ణించాడు.

"ముఖ్యంగా సుభిక్ష సామ్రాజ్యానికి ఉత్తర దిశలో, సుభిక్షరాజ్య భూభాగానికి అంచున ఉన్న పౌండరీక పర్వతప్రాంతంలో నవనిధులు నిక్షేపించబడి ఉన్నాయన్నాడు...."

"పర్వతప్రాంతమా? పౌండరీక పర్వతం కొన్ని వందల యోజనాలు విస్తరించి ఉంది!" సత్యసంధుడు అన్నాడు.




జ్యోతిష్కుడు ముక్కంటి చిన్నగా నవ్వాడు. "దాదాపుగా నిధి నిక్షేపించబడిన స్థానానికి దారిచూపే కొన్ని కొండగుర్తులనూ, బండగుర్తులనూ ఉదహరించాడు గ్రంథకర్త. ఆ గుర్తులలో చెట్లూచేమలూ ఉన్నాయి. రాళ్ళూరప్పలూ ఉన్నాయి. అవన్నీ పరిశీలించి చూడాలి. మన ఆలోచనలకూ, ఊహలకూ అందని అంశం ఒకటుంది. నవనిధుల సన్నిధి 'పర్వత గర్భం' అన్నాడు గ్రంథకర్త..."

"అది ఆలోచనకు అందని అంశమా ముక్కంటీ!!" మేధావి ఎగతాళిగా అన్నాడు. "పర్వత గర్భం అంటే గుహ! అంతే!"

"అదే నిజమైతే 'పర్వత కుహరం' అనేవాడుగా ఆర్యా?" ముక్కంటి అన్నాడు. "ఆలోచించండి. నిధులు దాచడానికి గుహ సురక్షితమైన ప్రదేశం కాదు, రహస్య ప్రదేశమూ కాదు. ఆ నిధి సన్నిధిని పట్టుకునే కార్యం అన్వేషకుడికి వదలి పెట్టేద్దాం. పర్వత గర్భం అంటే గుహ అని అంటే తర్కం ఒప్పుకోదు. గుహలోకి ఎవ్వరైనా అలా వెళ్ళవచ్చు, ఇలా రావచ్చు".

"అవును. ముక్కంటి అభిప్రాయం తార్కికంగా ఉంది!" నందికేశ్వరుడు అన్నాడు.

రాజగురువూ, మహామంత్రీ, సైన్యాధ్యక్షుడూ మౌనంగా తలలు ఊపారు.

"నవనిధులు పటిష్టమైన రక్షణలో ఉంటాయన్నాడు గ్రంథకర్త. రక్షణ కల్పిస్తున్నవి క్రూరమైన, భయంకరమైన సర్పాలు!"

ముక్కంటి తాళపత్రాలను సున్నితంగా తిరగవేస్తూ అన్నాడు. "ఆ విషసర్పాల పేర్లు కూడా ఉన్నాయి గ్రంథంలో. ఆలకించండి. 'ఉగ్రక', 'కపింజర', 'కర్కోటక', 'పిండక', 'మణినాగ', 'పిండారక', 'ముద్గర', 'కర్కర' 'శంఖముఖ' నవనిధులకు నవసర్పాలు! అంటే ఒక్కొక్క నిధిని ఒక్కొక్క సర్పం రక్షిస్తూ ఉంటుందన్నమాట..."

"విచిత్రంగా ఉంది. ఈ పేర్లు ఎప్పుడూ వినలేదే!" నందికేశ్వరుడు ఆశ్చర్యంగా అన్నాడు.

"ఇవన్నీకూడా కశ్యప మహర్షి ధర్మపత్ని కద్రువకు జన్మించిన నాగులు. ఒక్కొక్క నామధేయం ఒక్కొక్క జాతి పామును ఉద్దేశించింది. ఉదాహరణకి నాగుపాము అంటాం. అది ఒక పాము పేరు కాదు. నాగజాతి పాములన్నింటినీ అదేపేరుతో వ్యవహరిస్తాం. అలాగే కట్లపాములన్నింటికీ ఒకే పేరు, అలాగే కొండచిలువ.."

"అర్థమైంది!"

"కద్రువ సంతతి అయిన పాముల – సర్పజాతుల నామధేయాలు పురాణేతిహాసాల్లో ఉన్నాయి. ప్రధానమైన అంశం ఏమిటంటే, భయంకర సర్పాల రక్షణలోంచి నిధుల్ని తప్పించి, తీసుకురావడం!"

"ఏదో పుక్కిటిపురాణం వింటున్నట్టుంది ముక్కంటీ!" రాజగురువు అన్నాడు.

"గతంలో, శతాబ్దాలపాటు ఈ గ్రంథాన్ని చదివిన వ్యక్తులు కూడా పుక్కిటి పురాణంగా భావించి ఉంటారు" ముక్కంటి నవ్వుతూ అన్నాడు.

"అలా అనుకోవడం మనకి మంచిదే అయింది. నవనిధులు సురక్షితంగా ఉన్నాయి.."

"కళ్ళతో చూసినట్టు చెప్తున్నావు!" రాజగురువు నవ్వాడు.

"చూశాను ఆర్యా! అయితే నా నేత్రాలతో కాదు; జ్యోతిషనేత్రాలతో!" ముక్కంటి సగర్వంగా అన్నాడు. "గ్రంథం పేర్కొన్న నిధి సన్నిధి స్థలాన్నీ, దిక్కునూ, సుభిక్షరాజ్య నైసర్గిక స్వరూపాన్నీ, రాజధాని ఉనికినీ, మన మహారాజుగారి జాతకచక్రాన్నీ ఆధారంగా చేసుకున్నాను. దారిచూపే వృక్షజాతుల ప్రత్యేకతల్ని ఆధారంగా చేసుకున్నాను. నిధుల తొమ్మిది నామధేయాలను ఆధారంగా చేసుకున్నాను. నవనిధులకు అహర్నిశలూ రక్షకులుగా ఉన్న సర్పాల నామధేయాలను ఆధారంగా చేసుకున్నాను. జ్యోతిషశాస్త్ర సూత్రాలను కచ్చితంగా పాటిస్తూ గణన చేశాను. శోధించాను. సాధించాను. పౌండ్రకపర్వత గర్భంలో నవనిధులు నిక్షేపంగా క్షేమంగా ఉన్నాయి. నందికేశ్వర మహారాజుగారి పాలనలో, సుభిక్షరాజ్య కోశా గారంలో కొలువు తీరడానికి వేచి చూస్తున్నాయి.."

నందికేశ్వరుడు ఉత్సాహంగా చూశాడు. "ఆర్యా ముక్కంటీ, ఒక సందేహం..."

"చిత్తం..."

"పౌండ్రక పర్వతం మన సుభిక్ష రాజ్యానికి పొలిమేర అయినట్టే, అటువైపున ఉన్న కరవీర రాజ్యానికీ పొలిమేర. అవునా?"

"చిత్తం!"

"కరవీర రాజ్యానికీ ఆ నవనిధులు లభించవచ్చుగా?"

"మంచి ప్రశ్న! పౌండ్రక పర్వతం మన రాజ్యానికి ఉత్తర దిక్కులో ఉంది. ఉత్తర దిశ కుబేర స్థానం. ఐశ్వర్యానికి అధిపతి అయిన ఆ కుబేరుడు ఉత్తర దిక్పాలకుడు కూడా. ఆ దిక్పాలక దేవుడి శుభదృష్టి మనమీద, అంటే తమ మీదా, మన రాజ్యం మీదా సహజంగా ఉంటుంది. పోతే, పౌండ్రక పర్వతం కరవీర సామ్రాజ్యానికి దక్షిణ దిక్కులో పొలిమేర. దక్షిణ దిశకు పాలకుడు యమధర్మరాజు. ఆయన పెత్తనం ధర్మం మీద; ధనం మీద కాదు!"

"బాగుంది. ఆర్యా ముక్కంటీ, అన్యథా భావించకండి. నమ్మశక్యం కాని విధంగా ఉంది." మహామంత్రి అన్నాడు.

"అవును. ఏదో కథ విన్నట్టుంది!" వీరకేసరి అన్నాడు.

"నా ఆరోప్రాణమూ, జీవనాధారమూ అయిన జ్యోతిశ్శాస్త్రం మీద ప్రమాణం చేసి చెప్తున్నాను. పరమాత్మ స్వరూపమైన గణితం ఆధారంగా, పరమేశ్వర ప్రసాదమైన అక్షర సంపద ఆధారంగా, గణనచేసి, భవిష్యత్తును దర్శించి, సూచించడం నా వృత్తి. నా జ్యోతిష గణన ఏ  విషయంలోనూ, ఇంతవరకూ తప్పలేదనీ, తప్పుగా తేలలేదనీ ప్రభువులకూ మీకూ తెలుసు.

నవనిధుల గురించిన నా గణన తప్పుగా తేలితే, నా తల తీయించండి!" ముక్కంటి గంభీరంగా అన్నాడు.

నందికేశ్వరుడు మెప్పుగా తలపంకించాడు. "ఆచార్య, ఇన్ని జ్యోతిషగణనలు... నవనిధుల పరంగా చేసిన మీరు మరొక గణన కూడా చేసి ఉంటారని భావిస్తున్నాం".

"ఏమిటి ప్రభూ?"

"నిధి సన్నిధిని అన్వేషించి కనిపెట్టి, అక్కడికి చేరుకుని, సర్పవలయంలోంచి నిధులను సంగ్రహించి తీసుకురాగల ధైర్యశాలి, నిపుణుడు, వీరుడు ఎవరో గణనచేసి చూశారా? అలాంటి మహావీరుడు మన రాజ్యంలో ఉన్నాడా?"

"చిత్తం. పరిశీలించాను ప్రభూ. మన రాజ్యంలో మహావీరహారాలు గెలుచుకున్న వీరులెవరో నాకు తెలుసు. గ్రంథాలయంలో వాళ్ళ వివరాలు ఉన్నాయి. ఈ పదేళ్ళలో మహావీరహారాలు పొందిన యోధుల జాతకాలు పరిశీలించాను. అందుకు ఆధారం జన్మ నక్షత్రాలు, నామ నక్షత్రాలు, నామధేయాలు. ఒక వీరుడు లభించాడు. అతను మన రాజ్యంలో కాదు, మన రాజధానిలోనే ఉన్నాడు.."

"ఎవరు?"

"అతని పేరు... నిధి".

**(ఇంకా వుంది)**




## బుల్లి నిఘంటువు

మీకు తెలియని పదం గురించి తెలుసుకోవాలంటే ముందుగా గుర్తొచ్చేది నిఘంటువు. మార్కెట్‌లో ఎన్నో రకాల నిఘంటువులు అందుబాటులో ఉన్నాయి. అలాగే బుల్లి డిక్షనరీని కూడా తయారుచేశారు. బ్రైసెన్ డిక్షనరీ! ప్రపంచంలోనే అతి చిన్న నిఘంటువు ఇది. దీన్ని చదవాలంటే భూతద్దం వాడాల్సిందే. దీని పొడవు 27మిల్లీమీటర్లు, వెడల్పు 20 మిల్లీమీటర్లు.

ఇంకో విషయం ఏంటంటే పిల్లలు వాడే షార్ప్‌నర్ కంటే ఈ డిక్షనరీ చిన్నగా ఉంటుంది. ఇందులో 384 పేజీలు, 13 వేల పదాలు ఉంటాయి.






## పొడవైన పిజ్జా

టేస్టీ టేస్టీ పిజ్జా అంటే ఎవరికి మాత్రం ఇష్టముండదు చెప్పండి. చీజ్, వెజ్, చికెన్, స్పైసీ ఇలా రకరకాల రుచులతో పిజ్జాలు అందుబాటులో ఉంటాయి. మరి అంతటి టేస్టీ పిజ్జా గిన్నిస్ రికార్డ్ కొట్టేస్తే... ఎలా అంటారా? ప్రపంచంలోనే అతిపెద్ద పిజ్జా తయారుచేసి అమెరికా చెఫ్‌లు రికార్డ్ కొట్టేశారు కదా!

అమెరికాలోని కాలిఫోర్నియాకు చెందిన వందమంది చెఫ్‌లు ఎనిమిది గంటలపాటు శ్రమించి 1.9 కిలోమీటర్ల పిజ్జాను తయారుచేశారు. గిన్నిస్‌రికార్డ్ కొట్టేశారు. ఇంతకుముందు ఈ రికార్డు ఇటలీ పేరుమీద ఉంది. ఇప్పుడు అమెరికా సొంతమైంది. ఈ పిజ్జా తయారీ కోసం 3,632 కిలోల పిండి, 1,634 కిలోల చీజ్, 2,452 కిలోల సాస్ ఉపయోగించారు. కలర్‌ఫుల్‌గా ఉన్న ఈ పొడవైన పిజ్జాను వీక్షించేందుకు ఔత్సాహికులు పెద్ద సంఖ్యలో వచ్చారు.

## లైకులు అమ్మబడును

ఫేస్‌బుక్కు, ట్విట్టరు, లింక్‌డిన్... అప్‌లోడ్లు, షేరింగులు, లైకులు...ఇదీ నేటి ట్రెండ్. చిన్నా పెద్దా తేడా లేదు ఎవరికెన్ని లైకులు వచ్చాయి? ఎవరికెంతమంది ఫాలోవర్లు ఉన్నారు? యువత ఒక చోట చేరితే ఇవే ముచ్చట్లు. సరిగ్గా ఈ అంశాన్నే అవకాశంగా మలుచుకుంది ఓ రష్యన్ సంస్థ. ఏకంగా లైకులు, ఫాలోవర్లను అమ్మే వెండింగ్ మెషీన్‌ను ఏర్పాటుచేసింది.

రష్యా రాజధాని మాస్కో నగరంలో తొలి లైకుల వెండింగ్ మెషీన్ ఏర్పాటుచేశారు. ఇందులో వంద రష్యన్ రూబుల్స్ వేస్తే చాలు సోషల్‌మీడియాలో మీ పోస్ట్‌కి వందల లైకులు వచ్చిపడతాయి. 16 వేల రూబుల్స్ వేస్తే మీ ఫాలోవర్లుగా 50 వేలమంది వచ్చి చేరతారు. అయితే ఇవన్నీ నకిలీ ఖాతాలు. కేవలం లైకులు ఇవ్వడం కోసం, ఫాలోవర్లుగా మారడానికి మాత్రమే సృష్టించిన ఖాతాలు. అయితే ఈ వెండింగ్ మెషీన్ సేవలు కేవలం రష్యన్ సోషల్ మీడియాకి మాత్రమే పరిమితం.



## పార్కంటే చాలా చాలా ఇష్టం

స్వచ్ఛమైన గాలికోసమో, బరువు తగ్గేందుకో తెల్లవారుజామునే లేచి పార్కుల బాట పడుతుంటారు. వారిలాగానే ఓ శునకం కూడా వాకింగ్ కోసం రోజూ పార్కుకి వెళుతోంది.

వాషింగ్టన్‌లోని సియాటెల్‌కి చెందిన జెఫ్ యంగ్ పెంపుడు శునకం ఎక్లిప్స్‌కి పార్క్‌కి వెళ్లడమంటే చాలా ఇష్టమట. నాలుగేళ్ళక్రితం ఓసారి ఎక్లిప్స్‌ని పార్క్‌కి తీసుకెళ్ళాడు జెఫ్. ఆ వాతావరణం, పరిసరాలు దానికి తెగనచ్చేశాయి. దాంతో ఇక ప్రతిరోజూ దాన్ని పార్క్‌కి తీసుకెళ్ళాల్సిందే! పార్క్‌కి జెఫ్ బయలుదేరడం ఏరోజు ఆలస్యమైనా లేక బద్ధకించినా ఎక్లిప్స్ మాత్రం ఎంచక్కా బస్టాప్‌కి వెళ్ళి బస్సెక్కి మరీ పార్క్‌కి వెళుతుంది. ప్రతిరోజూ ఒకే సమయానికి పార్క్‌కి వెళుతుండటంతో ఆ రూట్‌లో వచ్చే బస్సు డ్రైవర్లకు కూడా ఎక్లిప్స్ అలవాటైపోయింది. దీంతో ఆ శునకం కనబడగానే డ్రైవర్లు బస్సు ఆపుతుంటారు. ప్రయాణికులు కూడా దానికి సీటు ఇవ్వడం, దానితో ఆడుకోవడం వంటివి చేస్తుంటారు. ఆ ఏరియాలో ఇప్పుడా శునకం చాలా ఫేమస్!



## శునకాలకు లగ్జరీ ఇళ్ళు

ధనం ఉండాలే గానీ రకరకాల డిజైన్స్‌లో ఇళ్ళు నిర్మించుకోవచ్చు. అదేపద్ధతిలో పెంపుడు శునకాలకు కూడా డిజైనర్ ప్యాలెస్‌లు నిర్మిస్తోంది ఓ బ్రిటీష్ కంపెనీ. చెషైర్ బేస్‌డ్ కంపెనీ హెకాటె వెరోనా ఈ లగ్జరీ డాగ్ హౌస్‌ల నిర్మాణానికి నాంది పలికింది. శునకం సైజునుబట్టి రెండురూములతో వీటి నిర్మాణం ఉంటుంది. కాలనియల్ విల్లా, స్పానిష్ పలాసియో, రోమన్ ఇంపెరియల్ మాన్షన్ ఆకృతుల్లో ఈ కెన్నెల్స్ ఏర్పాటవుతాయి. లివింగ్ రూమ్, బెడ్ రూముల్లో అత్యాధునిక సౌకర్యాలు అమర్చబడి ఉంటాయి. టీవీ, డిస్పెన్సర్లు ఇంకా కాన్ఫరెన్స్ కాలింగ్ సిస్టమ్ కూడా ఉంది. ఈ కెన్నెల్స్ నిర్మాణానికి అత్యంత నాణ్యమైన కలప ఉపయోగిస్తారు. మార్బుల్ ఫ్లోర్, అల్యూమినియంతో వీటిని దృఢంగా నిర్మిస్తారు. ఒక్కో కెన్నెల్ నిర్మాణానికి నాలుగు నెలలు పడుతుంది. మొత్తానికి శునకాలకు కూడా లగ్జరీ ఇళ్ళు నిర్మించేస్తున్నారు.

–నర్మద వాసిరెడ్డి





# ఆచార్య దేవోభవ

**త్వం పితా త్వం చ మే మాతా త్వం బంధుస్త్వం చ దైవతం**
**సంసారప్రీతి భంగాయ తుభ్యం శ్రీ గురవే నమః**

**తాత్పర్యం:** నీవే నా తండ్రివి, తల్లివి, హితుడవు, దేవుడవు. సంసార భయం పోగొట్టే వాడవు, ఓ గురుదేవా నీకు నా నమస్కారములు.

తల్లి, తండ్రి తరువాత దేవుడికంటే ముందు అత్యున్నత స్థానం పొందినవాడు గురువు. అందుకే మాతృదేవోభవ, పితృదేవోభవ అన్న మన పెద్దలు 'ఆచార్య దేవోభవ' అన్నారు. గురువు త్రిమూర్త్యాత్మక స్వరూపుడు. ఆషాఢశుద్ధ పౌర్ణమి వ్యాసమహాముని జన్మతిథి. అనాదికాలంగా అది మనకు మహాపర్వదినం. దీన్నే గురుపౌర్ణమి-వ్యాసపౌర్ణమిగా పిలుస్తాం. బోధివృక్షం కింద జ్ఞానోదయం పొందిన బుద్ధుడు గురుపౌర్ణమినాడే తన శిష్యులకు తొలిబోధ చేశాడని బౌద్ధగాథలు పేర్కొంటున్నాయి. ఆ తొలి బోధనలో నాలుగు ఆర్య సూత్రాలను శిష్యులకు అందించారు. ఈ గురుపూజోత్సవంనాడు గురువును పూజించిన వారికి విశేష ఫలితాలు దక్కుతాయి. అందుకే వ్యాసమహర్షి, ఆదిశంకరాచార్యులు, దత్తాత్రేయుడు, సాయిబాబా మొదలైన గురువులు గురుపౌర్ణమినాడు విశేష పూజలు అందుకుంటారు.

### గురుపూజా మహోత్సవం

వేదవ్యాసుని జన్మతిథి పవిత్రదినంనాడు యోగులు, సన్యాసులు ఒకచోటచేరి వేదాంత విచారణ చేస్తారు. కృష్ణద్వైపాయనుని బ్రహ్మసూత్రాలపై ప్రసంగిస్తారు. చతుర్వేదాధ్యయనంతో బ్రహ్మసూత్రాలు, పద్దెనిమిది పురాణాలు, భారత భాగవతాదులను రచించి వెలకట్టలేని ఆధ్యాత్మిక సంపదను మానవాళికి వారసత్వంగా ప్రసాదించారు. ఆయన బోధనలు, రచనలు ఏ యుగానికైనా ప్రామాణికమే. ఆ రచనల అధ్యయనం, ఆయన బోధనల ఆచరణ మాత్రమే వేదవ్యాసునిపట్ల మనకున్న నిజమైన గౌరవప్రపత్తులకు దర్పణం. అందుకే సాధకులు, యోగులు తమ తమ పూజి



### వ్యాసపూజ

జగద్గురు ఆదిశంకరాచార్యులవారే వ్యాసపూర్ణిమ పర్వదినాన్ని గురుపూర్ణిమగా లోకప్రసిద్ధం చేసినట్టు పెద్దలు చెబుతారు. ఈ పర్వదినాన కొన్ని ఆలయాలలో వ్యాసపూజ చేస్తారు. ఒక కొత్త అంగవస్త్రం పరిచి దానిమీద బియ్యంపోసి, ఆ బియ్యం మీద నాలుగువైపులా నిమ్మకాయలు, పూలు పెట్టి పూజిస్తారు. ఆదిశంకరులు, ఆయన నలుగురు శిష్యులు వాటిని స్వీకరిస్తారని విశ్వాసం. పూజ తర్వాత తలా పిడికెడు బియ్యం తీసుకుని తమ ఇళ్ళలోని బియ్యంలో కలుపుకుంటారు. బియ్యం, నూతనవస్త్రం లక్ష్మీదేవి చిహ్నాలు. నిమ్మపండు కార్యసిద్ధికి ప్రతీక. గురుపూర్ణిమనాడు సాయంత్రం ఆరు గంటల ప్రాంతంలో ఆలయాల్లో ఆవునేతితో దీపం వెలిగిస్తారు. అలాగే గురుస్తోత్ర పఠనం, గురుచరిత్ర అధ్యయిస్తారు. సాయిబాబా, దత్తాత్రేయుడు మొదలైన ఆలయాల్లో అన్నదాన, భజన కార్యక్రమాలు నిర్వహిస్తారు.

**(జూలై 9 గురుపౌర్ణమి)**

స్తారు. గురువులను, మహాత్ములను సత్కరించి వారిని సంతుష్టపరుస్తారు. గృహస్థులు భక్తిశ్రద్ధలతో దానధర్మ సత్కార్యాలు చేస్తారు.

### విశ్వం అంతా గురుతుల్యమే

గురువు మన చెంతనే ఉండాల్సిన అవసరం లేదు. మన చెంత లేకున్నా మన నిరంతర శ్రేయస్సు, అభివృద్ధి కాంక్షించి సహకరించే ప్రతి ఒక్కరూ గురుతుల్యులే. సృష్టిలోని చరాచరాలన్నీ మనకు ఏదో ఒక నీతి బోధ చేస్తూనే ఉంటాయి. మన జన్మసంస్కారాన్ని అనుసరించి నియత గురువులు, అనియత గురువులు మనకి జ్ఞానం ప్రసాదిస్తారు. మనల్ని ఉద్ధరించేందుకు నియమితులైనవారు నియత గురువులు. సమయానుకూలంగా మన జీవితంలోకి ప్రవేశించి మనల్ని సన్మార్గంలోకి మళ్ళించేవారు అనియత గురువులు. ఆ రకంగా మన జీవితంలో సన్మార్గనిర్దేశకులైన ప్రతి ఒక్కరూ అనియత గురువులే. మనిషి ఉనికి ఉన్నంతవరకూ జ్ఞానావశ్యకత ఉంటుంది. జ్ఞానం ఉన్నంత వరకు ప్రపంచం ఉంటుంది. ప్రపంచం ఉన్నంత వరకు గురువు అవసరం ఉంటుంది.

గురుపౌర్ణమి పర్వదినం సాధకులకు అత్యంత ఆనందకరమైనది. పూజ్యనీయులైన ప్రియతమ గురువులపట్ల భక్తిప్రపత్తులను వ్యక్తపరిచే శిష్యులు ఎంతగానో ఎదురుచూసే సుదినం. మానవజీవితంలో కేవలం గురువు మాత్రమే మానవుని బంధపాశాలను తొలగించి భవసాగర విముక్తులను చేయగలడు. దేవుడిని చూపించగలిగిన వాడు కూడా గురువే. త్వమేవ శరణం మమ అంటూ గురుపాదపద్మాలాశ్రయించి శరణాగతి పొందితే చాలు సర్వమూ సిద్ధిస్తాయి.

**న గురో రధికం తత్త్వం న గురో రధికం తపః**
**గురో రధికం జ్ఞానం తస్మై శ్రీగురవే నమః**

శ్రుతులు ఈ విధంగా చెబుతున్నాయి "భగవంతునిపై అచంచలమైన భక్తి విశ్వాసం కలిగి, అంతటి భక్తి విశ్వాసాలతో గురువుకన్నా అధికులు లేరని భావించిన ఉన్నతాత్ములకు ఈ రహస్యం అవగతమవుతుంది. వారు ఆత్మజ్ఞానం పొంది అఖండ తేజోవంతులవుతారు".

**– బ్రహ్మశ్రీ అవధూత శర్మ**

# సైనసైటిస్‌కు హోమియో చికిత్స

సైనసైటిస్...ఈపదం వర్షాకాలం, శీతాకాలంలో ఎక్కువగా వింటాం.సైనసైటిస్‌వస్తే ఆపరేషన్ తప్పని సరి, ఆ తరువాత కూడా మళ్ళీ వచ్చి దీర్ఘకాలికంగా బాధిస్తుందని సైనసైటిస్ బాధితులు చెబుతుంటారు. అయితే సైనసైటిస్‌కు హోమియోపతిలో అద్భుతమైన చికిత్స ఉందని, శాశ్వత నివారణ పొందవచ్చని చెబుతున్నారు ప్రముఖ హోమియోవైద్యులు డాక్టర్ మురళీఅంకిరెడ్డి.

ప్రపంచవ్యాప్తంగా సైనసైటిస్‌బాధితుల సంఖ్య రోజు రోజుకూ పెరుగుతోంది. ఒక్కఅమెరికాలోనే 2.4కోట్లకు పైగా సైనసైటిస్ బాధితులున్నారని అధ్యయనాలు చెబుతున్నాయి. ఇక.. సైనసైటిస్ విషయానికి వస్తే ఇది 3 విభాగాలుగా ఉంటుంది.

1. **అక్యూట్ :** వచ్చి ఒకవారం రోజులు ఉంటుంది.

2. **సబ్ అక్యూట్ :** 4నుంచి 8వారాలు ఉంటుంది.

3. **క్రానిక్ :** ఇది దీర్ఘకాలిక సైనసైటిస్. 8-10 వారాలపైన ఉంటుంది. సైనసైటిస్ ఇన్ఫెక్షన్, వైరస్, బ్యాక్టీరియా వల్ల వస్తుంది. ముఖ్యంగా స్ట్రెప్టోకోకస్ న్యుమోనియా, ఇన్ఫ్లూయెన్‌జా వల్ల వస్తుంది. ప్రతి మనిషి తన జీవిత కాలంలో సైనసైటిస్ బారిన పడటానికి 90% అవకాశాలున్నాయి. అత్యధికంగా వెళ్ళే సర్జికల్ ప్రాసెస్‌లో ఈ సైనసైటిస్ కూడా ఒకటని ఒక పరిశోధనలో తేలింది. సుమారు 2 లక్షల కేసులు సర్జరీకి దారితీస్తాయి. ఏదెలా ఉన్నా సైనసైటిస్‌కు హోమియోలో అద్భుత చికిత్స ఉంది. పూర్తిగా మందుల ద్వారా నివారించడమే కాకుండా, వ్యాధి నిరోధక శక్తిని పెంచి మళ్ళీ మళ్లీ రాకుండా నివారించ వచ్చు. ముఖంలో కళ్లదగ్గర, ముక్కు పక్క భాగంలో, ఎముకలు ఉండే సన్నని గాలితో నిండే ప్రదేశాన్ని సైనస్ అంటారు. ఈ భాగం ఇన్‌ఫెక్షన్లతో వాచిపోవడమే సైనసైటిస్. రకాలు: 1. ఫ్రంటల్ 2. పారా నాసల్ 3. ఎత్మాయిడల్ 4. మాగ్జిలరీ 5. స్ఫీనాయిడల్ ఇవి కూడి, ఎడమగా రెండు జతలుంటాయి. **కారణాలు:** ఇన్‌ఫెక్షన్, బ్యాక్టీరియా, వైరస్, ఫంగస్, ఉపరితల శ్వాసకోశ వ్యాధులు, ముక్కులోదుర్వాసన, ముక్కులో దుర్మాంసం పెరుగుదల, అలర్జీ, పొగ, విష వాయువుల కాలుష్యం, వాతావరణ కాలుష్యం, అకస్మాత్తుగా వాతావరణ మార్పులు, చలికాలం, వర్షా కాలం, గాలిలో తేమ ఎక్కువగాఉండే సమయం. నీటిలో ఈదటంవల్ల, జలుబు, గొంతునొప్పి, పిప్పిపన్ను, టాన్సిల్స్ వాపు, రోగనిరోధక శక్తి తగ్గిపోవటం. **లక్షణాలు:** ముఖంలో భారంగా ఉంటుంది. తలనొప్పి, బరువు, ముఖంలోవాపు, సైనస్‌భాగంలో నొప్పి ముక్కు దిబ్బడ, ముక్కుదురద, నీరుకారడం, గొంతులోనికి ద్రవంకారడం, గొంతుగరగర, దగ్గు,జలుబు, చెవిలో చీము, కోపం, మానసిక స్థైర్యం కోల్పోవడం. అలసట, విసుగు, పనిపై ఆసక్తి తగ్గటం, హోరు దగ్గు. **నిర్ధారణ:** ఎక్సరే, సిటీస్కాన్, సైనస్‌భాగంలో నొక్కినపుడు నొప్పి కలిగితే కూడా సైనసైటిస్‌ను నిర్ధారించవచ్చు. **దుష్పరిణామాలు:** ధీర్ఘకాలికంగా సైనసైటిస్ వ్యాధితో బాధపడేవారు కనురెప్పల వాపు, కనుగుడ్లు పక్కకు జరిగినట్లు ఉండటం, కన్నునరం దెబ్బతిన్నపుడు చూపు కోల్పోవడం, వాసనలు తెలియక పోవడం, తరుచూవచ్చే జ్వరం, ఎదుగుదల లోపాలు కలుగుతాయి. **సైనస్‌ను గుర్తించే ప్రశ్నావళి:** మీరు పది రోజుల కంటే ఎక్కువగా ఈ కింది వాటిలో దేనితోనైన బాధ పడుతు న్నారా? అయితే మీకు సైనసైటిస్ ఉన్నట్టే. వెంటనే డాక్టర్‌ను సంప్రదించడం మంచిది.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

1, ముఖబాగంలో నొప్పి - అవును / కాదు.

2.తలనొప్పి - అవును / కాదు. 3. ముక్కుదిబ్బడ - అవును/ కాదు 4. చిక్కటి పసుపు, ఆకుపచ్చ ముక్కు స్రావాలు - అవును/కాదు. 5.జ్వరం (99-100 ఫారెన్‌హీట్స్) - అవును/కాదు. 6.నోటి దుర్వాసన - అవును/కాదు.. 7. పంటినొప్పి - అవును /కాదు.

**నివారణ:** మీ నోటిని తరుచూ గోరు వెచ్చని నీటితో శుభ్రం చేస్తూండాలి. అలర్జీకి సంబంధించిన దుమ్ము, ధూళికి దూరంగా ఉండాలి. ఇల్లుపరిశుభ్రంగా ఉంచుకొని చుట్టూ బురద లేకుండా చూసుకోవాలి. ఈత కొలనులో ఎక్కువ సమయం ఉండకూడదు. ఎందుకంటే ఆనీళ్లు ముక్కు లోపలి దళసరిచర్మాన్ని దెబ్బతీస్తాయి. ఎక్కువగా చల్లని పదార్థాలు, చల్లని గాలి తగలకుండా చెవిలో దూది పెట్టుకోవడం, వేడి ఆవిరి పట్టడం వల్ల దీన్ని కొంత వరకు నివారించవచ్చు. **హోమియోచికిత్స:** హోమియోపతిలో అపరేషన్‌లేకుండా మంచి మందులున్నాయి. వాటిలో ముఖ్యంగా కాలిబైక్, కాలిసల్ఫ్, హెపార్‌సల్ఫ్, మెర్క్‌సాల్, సాంగ్న్యూలియా, లెమ్‌నార్ మైనార్, స్పైజిలియా వంటి మందులు మంచి ఫలితాన్నిస్తాయి.

**www.starhomeopathy.com** | తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక । దుబాయి । లండన్ । మాంచెస్టర్ | ✆ 90300 64224

# మహిళల్లో సంతానలేమి ఆధునిక పరిష్కార మార్గాలు

**సంతానం అనేది స్త్రీలకు దేవుడిచ్చిన వరం, కానీ ప్రస్తుతం చాలా మంది స్త్రీలు కొన్నిరకాల కారణాలువలన 'సంతానలేమి' సమస్య తో బాధపడుతున్నారు. మనసమాజం ఆధునికతను సంతరించుకుంటున్నకొద్దీ ఎంతోమంది దంపతులు "సంతానలేమి" సమస్యను ఎదుర్కోంటున్నారు. దీనికికేవలం శారీరక వ్యాధులు, లోపాలే కాదు, మారుతున్న జీవనశైలి, ఆహారపు అలవాట్లు, రాత్రివేళ ఉద్యోగాలు, మానసిక ఒత్తిడి వంటివి గణనీయమైన పాత్ర పోషిస్తున్నాయి. అయితే ఆధునిక విజ్ఞానం పెరిగిన ఈ రోజుల్లో సంతానలేమికి చక్కటి పరిష్కారాలు అందుబాటులో ఉన్నాయి కనుక ఆందోళన చెందవలసిన అవసరం లేదు అంటున్నారు మన ఫర్టీ 9 హాస్పిటల్ వైద్యులు డా॥ సి.జ్యోతి.**

అసలు సంతానలేమి అంటే ఆరోగ్యవంతులైన దంపతులు ఎటువంటి గర్భనిరోధక పద్ధతులు పాటించకుండా ఏడాది పాటు దాంపత్యజీవనం సాగించినా పిల్లలు కలగపోవటాన్ని 'సంతానలేమి'అంటారు. దీనికి కవలం స్త్రీలమనిందించటం సర్వసాధారణం. కానీ నిజానికి స్త్రీ పురుషులిద్దరూ సమాన భాగస్వాములే. **స్త్రీలలో సంతానలేమిని 2 రకాలుగావిభజించవచ్చు:** 1.ప్రైమరీ ఇన్‌ఫెర్టిలిటీఅంటే స్త్రీ ఏడాదినుండి రెండేళ్ల పాటు సాధారణ లైంగిక జీవితం గడిపినప్పటికీ గర్భం ధరించకపోవటం. 2. సెకండరీ ఇన్‌ఫెర్టిలిటీ అంటే స్త్రీ సాధారణ లైంగిక జీవితం గడపటంవలన ఒకసారి గర్భ ధారణ జరిగి, పిల్లలు కలిగినా లేదా గర్భస్రావమై, రెండవ సారి గర్భధారణ జరగక పోవటం. **స్త్రీలలో సంతానలేమికి గల కారణాలు: స్త్రీ ప్రత్యుత్పత్తి వ్యవస్థలోలోపాలు:** అవి ముఖ్యంగా 1. చిన్న గర్భ సంచి ఉండటం (ఇనెఫాంటైల్ యుటి రస్) లేదా అసలు గర్భ సంచి లేకపోవటం. 2.రెండుగదులు గా ఉండే గర్భసంచి ( బైకార్న్ మేట్ యుటిరస్) 3.యోని మార్గం చిన్నగాఉండటం లేదా మూసుకుపోవటం 4.ఫాలో పియన్‌ట్యూబ్స్ మూసుకు పోవటం. **బీజవాహికలలో లోపాలు:** 1. సాల్పింజైటిస్-ఇది బీజ వాహికల్లో వచ్చేవాపు. 2. హైడ్రో సాల్పింక్స్-దీనిలో బీజవాహిక లు ద్రవంలో నిండి మూసుకుపోతాయి. ఇది ముఖ్యంగా గర్భసంచి ఇన్‌ఫెక్షన్‌ల వల్ల ముఖ్యంగా టి.బి. లైంగికంగా సంక్రమించే వ్యాధుల వల్ల వస్తుంది. 3.ఎక్టోపిక్‌ప్రెగ్నెసీ **హార్మోన్ సమస్యలు:** 1.థైరాయిడ్, మధుమేహంవంటివి. 2.ఎఫ్.యస్.హెచ్, ఎల్.హెచ్, వంటివి ప్రొలాక్టిన్ వంటి హార్మోన్ల అసమతుల్యత 3. పి.సి.ఒ.డి 4. ఎ.ఎమ్.హెచ్ వంటి హార్మోన్స్ స్థాయిలు తగ్గటం వలన కూడా సంతానఅవకాశాలుతగ్గుతాయి.5.అండా శయంలో కణుతులు లేదాపాలిసిస్టిక్ ఓవరీస్ వంటివి. **యోని, గర్భ సంచిలో లోపాలు:** మహిళల్లో సంతానలేమి సమస్యలకు 5% కారణాలు దీనికి సంబంధించినవే. 1. ఎండోమెట్రియో సిస్ 2. గర్భసంచిలో కణితులు ఏర్పడటం (యుటిరైన్ ఫైబ్రాయిడ్స్)పాలిప్స్, సర్వైకల్ ఫైబ్రాయిడ్స్, ఎడినోమయోసిస్ వంటివి. 3.యోనిలోఉండే మ్యూకస్‌పొర అధికఆమ్ల గుణాన్ని కలిగి ఉండటంవలన కూడా శుక్రకణాలుచనిపోవటంవంటివి సంతానలేమికి కారణాలు. 4.గర్భసంచికి సోకే టి.బి. లైంగికం గా సంక్రమించే వ్యాధులు ( ఎస్.టి.డిస్ )గర్భసంచి ఇన్‌ఫెక్షన్స్. **ఇతర కారణాలు:** 1.వయసు, అధిక బరువు, 2. స్త్రీలలో 30 సంవత్సరాల వయసు దాటిన తర్వాత గర్భందాల్చేఅవకాశాలు తగ్గుతాయి. వయసుతో పాటు అండాల ఉత్పత్తి తగ్గటం, హార్మోన్స్ స్థాయిలలో తేడాలు కూడా అధిక గర్భస్రావానికి అవకాశా లను పెంచుతాయి. వయసు పెరిగిన కొద్ది సంతాన అవకాశా లు తగ్గుతాయి. 3.కొన్నిసార్లు ఎటువంటి కారణం లేకుండా కూడా సంతానలేమి ఉంటుంది. ఇటువంటి వారికి కృత్రిమ పద్ధతుల ద్వారా చికిత్స చేస్తారు. **స్త్రీలలో సంతానలేమికి నిర్ధారణ పరీక్షలు:** 1. థైరాయిడ్ పరీక్షలు, హార్మోనల్ ఎస్సే (ఈస్ట్రోజన్,ప్రొజెస్టిరాన్,ఎఫ్.సి.హెచ్, ఎల్.హెచ్, ప్రోలాక్టిన్ వంటివి). 2.అల్ట్రాసౌండ్‌పెల్విక్‌స్కానింగ్. 3. ఫాలిక్యు లార్ స్టడీ 4.హిస్టిరో సాల్పింజియోగ్రామ్ [హెచ్.ఎస్.జి] 5.డయా గ్నోస్టిక్ లాప్రోస్కోపి వంటివి. **వీటికిచేయదగినచికిత్సలు:** ఇందు లో ముఖ్యమైనవి 1.హార్మోన్ థెరపీ 2. ఐ.యు.ఐ 3. ఐ.వి.ఎఫ్ 4.ఇక్సీ 1.హార్మోన్‌థెరపిలో మందులద్వారా ఋతుచక్రసంబంధ లోపాలను సవరించ వచ్చు. అండాల విడుదలను ప్రేరేపించ వచ్చు. 2.లాప్రోస్కోపిక్ సర్జరీ ద్వారా అండాశ యంలోని నీటి తిత్తులను (పిసిఒడి) ని సవరించవచ్చు. 3. ఐ.యు.ఐ. దీనిలో పురుషుల్లోని శుక్రకణాలను నేరుగా స్త్రీ గర్భశయంలోకి ప్రవేశపెడతారు. దీన్ని అండం విడుదలజరిగినపుడు వేయడం ద్వారా గర్భధారణకి అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. దీన్ని ఎక్కువగా వీర్యకణ లోపాలు ఉన్నపుడు, స్త్రీలలో బీజవాహిక లలో సమస్యలు ఉన్నపుడు సూచిస్తారు. దీన్ని 6నుంచి 10 రుతుచక్రాలు ప్రయత్నించ వచ్చు. అంతేకాక ఇది తక్కువ వ్యయం కూడా. 4. ఐ.వి.ఎఫ్. దీన్ని"టెస్ట్‌ట్యూబ్‌విధానం" అంటారు. దీనిలో స్త్రీ అండాన్నిపురుషుడి శుక్రకణాన్ని లేబరేటరీ లో ఫలదీకరణం చెందించి తిరిగి స్త్రీ గర్భాశయం లోకి ప్రవేశపెడతారు. దీన్ని ఎక్కువగా స్త్రీలలో ట్యూబులు మూసుకున్న వారికి, శుక్రకణాల సంఖ్య కదలికల్లో లోపాలు మగవారిలో ఉన్నపుడు, దంపతుల వయసు ఎక్కువగా ఉన్న పుడు సూచిస్తారు. 5. ఇక్సీ దీన్ని ఐ.వి.ఎఫ సత్ఫలితాలను ఇవ్వ నిసందర్భంలో ఉపయోగిస్తారు. ఇందులోశుక్రకణాలనుకృత్రిమ పద్ధతి ద్వారా అండంలోకి ప్రవేశపెట్టి ఫలదీకరణం చెందిస్తారు. అలా ఫలదీకరణం చెందించిన దాన్ని తిరిగి స్త్రీ గర్భాశయంలోకి ప్రవేశపెడతారు. ఇటువంటి అత్యాధునిక చికిత్సల ద్వారా సంతానలేమికి మంచి పరిష్కారాన్ని పొందవచ్చు. "**ఫర్టీ 9 హాస్పిటల్** " లో నిపుణులైన వైద్యులు పరీక్షలు నిర్వహించి, మీ సమస్యలకు తగిన సంతాన సాఫల్య చికిత్సలను సూచిస్తారు. దీని ద్వారాఎంతో మంది దంపతులు సంతాన భాగ్యాన్ని పొందుతున్నారు.

**- డా॥ సి.జ్యోతి ఫెర్టిలిటీ స్పెషలిస్ట్**
**ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం**

ADVT

✆ 90300 15588 | సికింద్రాబాద్ । కూకట్‌పల్లి । మదాపూర్ । సంతోష్‌నగర్ । వరంగల్ | **www.ferty9.com**

CRIME

# తప్పు చేసి తప్పించుకోలేరు..

సమయం రాత్రి సుమారు తొమ్మిదిగంటలు.

నల్లటి నీడలా నలుగురు యువకులు లోపలికి అడుగుపెట్టారు.

మూలనున్న టేబుల్‌దగ్గర కూర్చుని ఆర్డర్ చేశారు. ఓ కుర్రవాడు నాలుగు సారా ప్యాకెట్లు, నాలుగు గ్లాసులు, రెండు సోడాసీసాలు తెచ్చిపెట్టాడు. నలుగురూ ప్యాకెట్లలోని సారా గ్లాసుల్లో ఒంపుకుని, అందులో సోడా కలుపుకుని కొద్దికొద్దిగా తాగుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

అంతలో "అబ్బా, ఇక్కడంతా గోలగోలగా ఉంది. అదే మన చెరువుగట్టుమీద అయితే ఎంత ప్రశాంతంగా ఉంటుందో... అక్కడ హాయిగా తాగుతూ, మాంసంముక్కలు నంజుకుంటుంటే స్వర్గంలో ఉన్నట్టుంటుంది, ఏమంటారు?" అన్నాడు వాళ్ళల్లో ఒకడు.

"అవునవును" అంటూ తలలూపారు మిగతా ముగ్గురూ.

వెంటనే నలుగురూ లేచారు. బిల్లు చెల్లించి ఓ పది సారాప్యాకెట్లు కొనుక్కుని చెరువు దగ్గరకి వెళ్ళారు. అక్కడ చెట్టు కింద కూర్చుని సారా తాగుతూ మాంసం ముక్కలు తింటూ మజా చేశారు. నిజానికి వాళ్ళలో ముగ్గురు తాగుతున్నట్టు నటించారు. ఒకడి చేత మాత్రం బాగా తాగించారు.

ఆ యువకుడు కదలలేని స్థితిలో మత్తుగాపడిపోయాడు. దాంతో మిగతా ముగ్గురూ కళ్ళతోనే ఒకరికొకరు సైగలుచేసుకుని నెమ్మదిగా లేచారు. వాళ్ళలో ఒకడు, మత్తుగా పడి ఉన్న యువకుడి కాళ్ళు కదలకుండా గట్టిగా పట్టుకుంటే మరొకడు చేతులు కదలకుండా గట్టిగా పట్టుకున్నాడు. మూడో వ్యక్తి ఆ యువకుడి గుండెలమీద కూర్చుని పీక నులిమాడు. ప్రాణాలకోసం పెనుగులాడిన యువకుడు చనిపోయాడని నిర్ధారించుకున్న తర్వాత ఆ శవాన్ని మోసుకెళ్ళి దగ్గర్లో ఉన్న పొదల్లో పారేశారు. దర్జాగా కబుర్లు చెప్పుకుంటూవెళ్ళి చీకట్లో కలిసిపోయారు.

***

సమయం ఉదయం పదిగంటలు.

ఇన్‌స్పెక్టర్ సింగ్ డ్యూటీలో ఉన్నాడు.

బక్కపలుచని ఓ వ్యక్తి పరుగుపరుగున పోలీస్ స్టేషన్‌లోకి వచ్చాడు. అతను దుఃఖం ఆపుకోలేకపోతున్నాడు. "సార్ నా కొడుకును ఎవరో చంపి చెరువుగట్టున పారేశారంటూ భోరున విలపిస్తున్నాడు. అతన్ని సముదాయించి కాసేపటికి వివరాలు తెలుసుకున్నాడు ఇన్‌స్పెక్టర్. అతడిపేరు రామనాథ్. అజీజ్‌నగర్ గ్రామం. అతని కొడుకు కువర్ నిన్నరాత్రి నుండీ ఇంటికి రాలేదు. ఊరు చెరువుగట్టు దగ్గరలోని పొదల్లో అతని కొడుకు శవం పడి ఉందని ఊరివాళ్ళు చెబితేగానీ ఆ తండ్రికి తెలియలేదు.

ఇన్‌స్పెక్టర్ సింగ్ రిపోర్ట్ రాసుకుని అతడిని వెంటబెట్టుకుని తన బలగంతో ఘటనాస్థలికి చేరుకున్నాడు. మృతదేహాన్ని క్షుణ్ణంగా పరిశీలించాడు. ఒంటిమీద గాయాలులేవు. మృతుడి నోట్లో ఖాళీ సారాప్యాకెట్టు కనిపిస్తోంది. మితిమీరి తాగడం వల్లనే మరణించి ఉండొచ్చని లేదా కల్తీసారా కారణం కావొచ్చనీ అనుకున్నాడు సింగ్. కానీ హతుడి నోట్లో ఖాళీ సారాప్యాకెట్టు ఉండటం అసహజంగా అనిపించింది అతనికి. 'ఎంత మితిమీరి తాగినా ప్యాకెట్టు అలా నోట్లో పెట్టుకుంటాడా ఎవడైనా?' అనే ప్రశ్న ఇన్‌స్పెక్టర్ సింగ్‌ను తొలిచేస్తోంది. పోస్ట్‌మార్టం రిపోర్టు ఎలా ఉంటుందో చూడాలి అనుకుంటూ, పంచనామా జరిపించి శవాన్ని పోస్టుమార్టం నిమిత్తం ప్రభుత్వ ఆస్పత్రికి తరలించాడు.

**అంతటి అపురూపమైన అందగత్తె వాడికి భార్యా? సహించలేకపోయాడతను. పెళ్ళయ్యాక ఆ జంట అతడి పక్కింట్లోనే కాపురం పెట్టింది. ఏడాది తిరిగేసరికి ఆమె ఓ బిడ్డకు తల్లిగా మారింది. అయినా ఆమెలో అందం రెట్టింపైంది. ఆమెను లొంగదీసుకునేందుకు సమయం కోసం ఎదురుచూస్తున్నాడతను. అతను కోరుకున్న ఆ సమయం రానే వచ్చింది. ఆమె ఒంటరిగా దొరికింది. అతను ఏం చేశాడు?**

కువర్‌కిగానీ, అతని తండ్రికిగానీ శత్రువులు లేరని పోలీసుల ప్రాథమిక దర్యాప్తులో తేలింది. కానీ మర్నాడు పోస్టుమార్టం రిపోర్ట్ చదివి ఉలికిపడ్డాడు ఇన్‌స్పెక్టర్ సింగ్. కువర్ ఊపిరి ఆడక చనిపోయాడు. మృతదేహం మెడమీద నల్లటి చారలున్నాయి. ఎవరో గొంతునులిమి చంపారని నివేదిక స్పష్టంగా చెబుతోంది. ఇక ఆలస్యం లేకుండా రంగంలోకి దిగాడు సింగ్. కువర్ పనిచేసిన షాప్ దగ్గర పనివాళ్ళను విచారించాడు. దర్యాప్తులో అతి విలువైన సమాచారం తెలిసింది. అమూల్యమైన విషయం తెలిసింది. హత్యకు ముందురోజు రాత్రి ఎనిమిది, తొమ్మిది మధ్యన ముగ్గురు వ్యక్తులు వచ్చారు. కువర్ వాళ్ళ వెంట వెళ్ళిపోయాడు.

వెంటనే సింగ్‌కు కువర్ నోట్లో ఖాళీ సారా ప్యాకెట్టు గుర్తొచ్చింది. అంటే వీళ్ళంతా కలిసి బాగా తాగారన్నమాట. కువర్‌కి బాగా తాగించి చంపి ఉంటారని ఊహించాడు. అయితే ఘటనాస్థలంలో సారా ప్యాకెట్లు, తిని పారేసిన పదార్థాలులాంటి సాక్ష్యాలేమీ దొరకలేదు. ఆ టైమ్‌లో ముగ్గురు, నలుగురు కలిసి తిరిగినట్టు, తాగినట్టు ఎలాంటి ఆధారాలు దొరకలేదు. హంతకులు తెలివిగా సాక్ష్యాధారాలు మాయం చేశారా? అతడి ఆలోచనలు తెగట్లేదు. ఒకవేళ వేరే చోట తాగివచ్చారా? లేక ఎక్కడో చంపి తీసుకొచ్చి ఈ చెరువుగట్టు పొదల్లో పడేశారా? లేక ఈ సారా ప్యాకెట్టే తనను తప్పుదారి పట్టిస్తోందా? చాలాసేపు రకరకాల ఆలోచనలు చేశాడు ఇన్‌స్పెక్టర్ సింగ్. చివరకు ఓ నిర్ణయాకొచ్చాడు. యస్! బహుశా అంతేనేమో, అందుకే క్లూస్ లేవు అనుకున్నాడు.

***

ఇన్‌స్పెక్టర్ సింగ్ చెప్పిన దాని ప్రకారం, ఊళ్ళో సారా అంగళ్లకు వెళ్ళి సమాచారం సేకరించారు కానిస్టేబుల్స్. హత్యకు ముందురోజురాత్రి, కువర్ వెంట ఎవరైనా వచ్చారా? గ్రూపులుగా వచ్చినవారి కదలికలపై ఆరా తీశారు.

చివరకు రైల్వేస్టేషన్ దగ్గరున్న సారాఅంగడిలో కుర్రవాడి నుండి సమాచారం రాబట్టారు. 'కువర్ ముగ్గురు వ్యక్తులతో సారా దుకాణానికి వచ్చాడు. కొద్దిసేపటికి ఆ నలుగురూ సారాప్యాకెట్లు, మాంసం ముక్కలు కొనుక్కొని పక్కనే ఉన్న చెరువుదగ్గర కెళ్ళారు.' కుర్రాడు చెప్పినదాని ప్రకారం, ఆ ముగ్గుర్నీ ఇన్‌స్పెక్టర్ సింగ్ అరెస్ట్ చేసి విచారించాడు. మొదట ఒప్పుకోలేదు. పోలీసు పద్ధతిలో లాఠీలు నాట్యం చేసేసరికి చిలకల్లా నోరు విప్పారు.

***

వ్యవసాయం చేసి బతికే రామనాథ్‌కి ఒక్కగా నొక్కకొడుకు కువర్. కొడుకు బాగా చదివి సర్కారీ నౌకరీ చేస్తుంటే కళ్ళారా చూడాలని కలలుగన్నాడు. కానీ తండ్రి కలలు కల్లలయ్యాయి. ఒక్కొక్కక్లాసులో రెండేసేళ్ళు గడుపుతున్న కువర్‌కి చదువు అబ్బదని తండ్రికి అర్థమైపోయింది. బడి మానిపించి పొలం పని నేర్పించే ప్రయత్నం చేశాడు. కువర్‌కు వ్యవసాయం ఇష్టం లేదు. దాంతో అప్పుచేసి ఓ దుకాణం



పెట్టించాడు. అది బాగానే నడుస్తోంది. కొడుకు ప్రయోజకుడవుతున్నాడని రామనాథ్ సంతోషించాడు. అంతలోనే కువర్‌కి పెళ్ళి వయసొచ్చింది. పొరుగూర్లో ఉన్న రజనితో పెళ్ళైంది. యవ్వనపు నునుపు, తీర్చిదిద్దిన అంగసౌష్ఠవంతో పదహారేళ్ళ పరువంలో ఉన్న రజని చూపరులను అమాంతం ఆకర్షిస్తుంది. అందమైన భార్యను చూసి తనంతటి అదృష్టవంతుడు లేడని మురిసిపోయాడు కువర్.

సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ మొదటి రాత్రి గదిలోకి అడుగుపెట్టింది రజని.

గదిలోకి రాగానే ఆమెను దగ్గరకు లాక్కుని గట్టిగా కౌగలించుకున్నాడు కువర్.

రజనీ ముఖాన్ని ముద్దులతో ముంచెత్తాడు. మృదువుగా ఆమెను ఎత్తుకుని మంచంమీద పడుకోబెట్టి, ఆమెమీద వాలిపోయాడు.

తమకంతో భర్తను తీగలా అల్లుకుపోయింది రజని.

***

ఏడాదికల్లా బిడ్డ తల్లైంది రజని. ఆమె అందం, ఒంపుసొంపులు రెట్టింపైనట్టు అనిపించేది కువర్‌కి. ఎప్పుడూ భార్యకొంగు పట్టుకుని తిరిగేవాడు. అలా వాళ్ళ సంసారం సుఖంగా సాగుతున్న సమయంలో హఠాత్తుగా జబ్బుపడ్డాడు కువర్.

హైడ్రోసిల్ బారినపడ్డాడు. తన సమస్య పైకి చెప్పుకోవడానికి సంకోచించాడు. దాంతో జబ్బు ముదిరింది. రకరకాల మందులు వాడాడు. నాటు మందులు వాడినా గుణం కనిపించలేదు. పట్నంలో ఆపరేషన్ చేయించుకుని కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకున్నాడు. ఆపరేషన్ గాయం మానాక తిరిగి షాపు తెరిచాడు. కానీ కువర్ మునుపటి మనిషి కాలేకపోయాడు. నీరసించిపోసాగాడు. రోజురోజుకు తనలో కామవాంఛలు తగ్గిపోవడం గమనించి మరింత భయపడ్డాడు.

భార్యకు దూరంగా జరిగాడు.

అయితే వయసు పదునులో ఉన్న రజనికి అతని సమస్య అర్థం కాలేదు.

భర్త తనను ఎందుకు దూరం పెట్టాడో అర్థం చేసుకోలేకపోయింది. పరువంలో కోరికలు శరీరాన్ని వేధించేవి. నిద్రపట్టక పక్కమీద దొర్లుతూ కోరికల్ని అణచుకునేది. అప్పుడే ఆమెకు కుమార్ తారసపడ్డాడు. కువర్ చిన్నాన్న కొడుకు. కువర్ ఇంటిని ఆనుకునే కుమార్ కుటుంబం ఉండేది. రజని ఆ ఇంట్లో అడుగు పెట్టినప్పటినుండే ఆమెపై కుమార్ కన్నుపడింది. ఆమె అందం అతడిని గిలిగింతలు పెట్టేది. అంతటి అందగత్తె కువర్ సొంతం కావడాన్ని ఊహించలేకపోయాడు. ఆ అందాలరాశి రోజూ తనముందే తిరుగుతుంటే ఆమె అందాన్ని కళ్ళతోటే తాగేవాడు. తరుచుగా రజనీతో కబుర్లు చెప్పేవాడు. ఈ మధ్య చనువు పెరిగింది.

కువర్ జబ్బు పడటం, అతను భార్యకు దూరంగా ఉండటం పసిగట్టాడు.

సమయం కోసం ఎదురు చూశాడు. ఆ సమయం రానే వచ్చింది. ఒకరోజు రజని ఏకాంతంగా దొరికింది. ఆమెను చప్పున దగ్గరకు లాక్కుని కౌగలించుకుని ముద్దులు పెట్టుకోసాగాడు. మొదట్లో కోపం వచ్చింది. కానీ అతడి చేష్టలు ఆమెలో నిద్రపోతున్న కోరికలను తట్టిలేపాయి. ప్రతిఘటించలేదామె. దాంతో కుమార్ ఆమెను పూర్తిగా ఆక్రమించుకున్నాడు.

***

వాళ్ళ మధ్య సంబంధం నిరాటంకంగా సాగిపోయింది.

చేజారిన సుఖం మళ్ళీ లభించటంతో రజని ముఖం కళకళలాడుతోంది. ఆమెలో మార్పు గమనించాడు కువర్. ఒకరోజు రెడ్‌హ్యాండెడ్‌గా ఇద్దరినీ పట్టుకున్నాడు. కుమార్ తప్పించుకుని పారిపోయాడు. రజనీని చావబాదాడు కువర్. మర్యాదగా ప్రవర్తించమని రజనీని మర్నాడు ఉదయం కువర్ మళ్ళీ హెచ్చరించాడు. కుమార్‌తో సంబంధం వదులుకోకపోతే అతడిని హతమారుస్తానని తీవ్రంగా హెచ్చరించి దుకాణానికి వెళ్ళిపోయాడు.

కుమార్ కౌగిట్లో ఒదిగిపోయి జరిగినదంతా అతడికి వివరించింది రజని. ఆలోచనలో పడ్డాడు కుమార్. కువర్‌వల్ల తనకు ప్రమాదం పొంచి ఉంది. ఇక అతన్ని వదలకూడదనుకున్నాడు. ఆ రోజంతా ఆలోచిస్తూ ఉండిపోయాడు. మెరుపులా ఓ ఆలోచన తట్టింది. స్నేహితులకు తన ప్లానేమిటో చెప్పాడు. వాళ్ళు అలాగే అని తలలూపారు.

హత్యరోజురాత్రి ఎనిమిది, తొమ్మిది గంటల మధ్య కుమార్ తన స్నేహితులను వెంటబెట్టుకుని కువర్ దుకాణానికి వెళ్ళాడు. వాళ్ళను చూసిన కువర్, కుమార్‌ని కొట్టబోయాడు. కుమార్ స్నేహితులు స్పందించలేదుగానీ కుమార్ మాత్రం చేతులు జోడించి కువర్‌ను క్షమించమని అడిగాడు. ఇంక అలా ప్రవర్తించనన్నాడు. కువర్ మెత్తబడ్డాడు. కువర్‌ని కబుర్లలోకి దించి, పార్టీ చేసుకుందాం రమ్మని పిలిచాడు. వద్దని తిరస్కరించాడు. చివరికి తిరస్కారభావంతోనే కుమార్ వెంట వెళ్ళాడు. ఆ నలుగురూ కలిసి సారా దుకాణానికి వెళ్ళారు.

అలా తన ప్లాన్ అమలు చేశాడు కుమార్.

***

ఇన్‌స్పెక్టర్ సింగ్ అన్ని సాక్ష్యాధారాలతో పకడ్బందీగా దర్యాప్తు పూర్తిచేసి సెక్షన్ 302 కింద కేసు నమోదుచేసి వాళ్ళని కోర్టులో హాజరుపరిచాడు.

ప్రస్తుతం నేరస్థులు జైల్లో ఉన్నారు!

—సూర్యనేత్ర



# (పరి)పక్వం

## పోలాప్రగడ జనార్దనరావు

**పున్నమిచంద్రుడికైనా పుత్తడిరంగు తెప్పించగల ఘనుడు పురుషోత్తం.**

**సింగరేణి బొగ్గునైనా సిసలైన బంగారం అని నమ్మించి అమ్మేయగల అఖండుడు.**

**చీప్ యాపిల్‌నైనా పాలిష్ చేయించి సిమ్లా యాపిల్ అని భ్రమ కలిగించగల ఘనా ఘనుడు.**

**పక్వానికి రాని కాయల్ని కార్బైడ్‌వేసి హడావిడిగా మాగపెట్టి కుళ్ళిపోకుండా ఎవర్రడీ పళ్ళలా అమ్మి లాభాలు పొందడం పురుషోత్తం వ్యాపార రహస్యం.**

**అతను సంపాదించింది, సంపాదించేది ఇలాగే.**

ఆ పళ్ళు తిన్నవాళ్ళ ఆరోగ్యం గురించి అతనికి అనవసరం. అన్నీ పట్టించుకుంటే ఎన్నో అవస్థలు పడాల్సొస్తుందనేది అనుభవంమీద అతను నేర్చుకున్న పాఠం. పట్టించుకోకూడదన్నది అతని సిద్ధాంతం.

చెకింగ్ కొచ్చిన అధికారుల చేతులు తడపడమంటే, పచ్చికాయల్ని కార్బైడ్ నీళ్ళలోముంచి పళ్ళుగా మార్చెయ్యడం అంత తేలిక అతనికి.

పాపం! అతడికి ఎంత ఆస్తి ఉండీ ఏం లాభం? ఆ ఆస్తి అనుభవించడానికి పిల్లలు లేరు.

పిల్లలు లేరన్న దిగులు ఈ మధ్య మరీ ఎక్కువైంది. ఇంక పుట్టరేమోనని వయసు హెచ్చరించాక, పిల్లలకోసం అతని భార్య పార్వతమ్మ మొక్కని దేవుడు లేడు, చెయ్యని పూజ లేదు, తిరగని గుళ్ళు లేవు. యాత్రలకి తన కూడా తిప్పుకోవడానికి పురుషోత్తం బుర్రలో 'పాపభీతి బీజం' ఎప్పుడో నాటింది.

"ఏ జన్మలోనో తెలియక ఏదోపాపం చేసుంటాం. ఈ జన్మలో తెలిసి తెలిసీ జనం ఆరోగ్యం పాడు చేసే వెధవ యాపారం చేస్తూ ఇంకా ఇంకా పాపం మూటగట్టుకుంటున్నాం. ఎంతోమంది తల్లిదండ్రుల ఉసురోసుకుంటున్నాం. ఆళ్ళ శాపం మూలానే మనకి పిల్లలు లేరు."

"యాపారానికి పిల్లలు పుట్టడానికి సంబంధం ఏటే ఎర్రి మాలోకం? బ్యాంకులు యాపారం చేసి లాభాలు గడిస్తున్నాయి. పెద్దపెద్ద కంపెనీలు తక్కువ ఖరీదుకి సరుకులు తయారుచేసి, ఎక్కువ ధరకి అమ్మి లాభాలు వెనకేసుకుంటున్నాయి. మరి ఆళ్ళందరికీ పిల్లలు పుట్టకపోతే దేశంలో నూటపాతికకోట్ల జనాభా ఎక్కడి నుంచి పుట్టుకొచ్చిందంటావ్?"

"నీ యాపారం తెలివితేటలు, మాటలగారడీ నామీద సూపించకు, దేవుణ్ణి నమ్ముకో"

"నేను దేవుణ్ణీ, ఆయన నన్నూ నమ్ముకోబట్టే మా యాపారం సజావుగా సాగుతోందే పిచ్చిమొగమా"

పురుషోత్తానికి భగవంతుడంటే భక్తికన్నా భయమే ఎక్కువ. అందుకే తన లాభాల్లో ఆయనకి కాస్త వాటా ఇచ్చి, కొంత భయం తగ్గించుకుంటున్నాడు. కానీ ఆ భార్యాభర్తల మధ్య ఎడతెగని తగవు.

"నువ్వు ఎన్నైనా సెప్పు. తప్పుడు యాపారం సేస్తే, తప్పుడాలోచనలొస్తాయి. తప్పుడాలోచనలు

ఎప్పుడూ తప్పుడు పనులే సేయిస్తాయి. దేవుణ్ణి నిజాయితీగా, నీతిగా నమ్ముకోవాలి. భగవంతుణ్ణి వ్యాపార భాగస్వామిగా సూడకూడదు. బాధలు తీర్చేవాడిగానే సూడాలి"

"సరే! నీతో వాదనెందుకు. నన్నేం సేయమంటావో సెప్పు?"

"ఈ యాపారం మానేసి మంచి యాపారం మొదలెట్టు"

"ఎర్రి బాగుల్దానా! మంచి యాపారం సెడ్డ యాపారం అంటూ ఉండదే. తిమ్మిని బమ్మిని సేయడమే యాపారం అంటే. నిజాయితీగా సేత్తే, మనపెట్టుబడి రాదు సరికదా సేతికి సిప్పే. ఇయన్నీ నీకు సెప్పినా అర్థంకాదుగానీ, యాపారం సంగతి నాకొదిలి, పిల్లల్నికనే సంగతి నువ్వు సూసుకో"

"ఇద్దరం సజావుగా సంసారం సేత్తేనే పిల్లలు పుట్టేది. ఎవరికిష్టమైంది ఆళ్లు సేసుకునేకాడికి పెళ్ళెందుకు? పిల్లలెందుకు?"

సర్లే! నీ సోదికేంగాని రేపు పౌర్ణమికి మనం అన్నవరం ఎళ్ళి..."

"నాకు కుదర్దే. ఇప్పుడు మామిడికాయల సీజను. అదయ్యాక ఎడదాంలే"

"సముద్ర కెరటాలు ఆగాక స్నానం సేస్తానన్నాట్ట ఎనకటికి నీలాటోడే. సత్తనారాయణసామి కథ నీ గురించే... నాకు మొక్కుంది..."

"ఆపు ఎదవసోద. ఇంతకీ ఏమంటావు?"

"అన్నవరం ఎళ్ళి వ్రతం సేసుకుని, అట్నించి తిరుపతెళ్ళి కల్యాణం సేయిద్దాం. సామికి ముడుపులు సెల్లిద్దాం. నా మాట కాదంటే నన్ను సంపుకు తిన్నంత ఒట్టు" అంటూ ఏడుపుమొహం పెట్టింది పార్వతమ్మ.

తప్పక తలూపాడు పురుషోత్తం.

***

కిందటి జన్మలో పార్వతమ్మ చేసుకున్నపుణ్యంలో కొంత శేషం, పురుషోత్తం ఈ జన్మలో దేవుడికిచ్చిన షేరులో మరికొంత శేషం కలిశాయి. ఫలితంగా వాళ్ళ కలలు ఫలించి పాప పుట్టింది.

తన తల్లి లక్ష్మీదేవమ్మ పేరు పెట్టుకున్నాడు పాపకి. చామనఛాయే అయినా చారడేసికళ్ళతో అందంగా, ఆరోగ్యంగా పుట్టింది.

పాపవల్ల నిశ్శబ్దం, నిరాశాపోయి ఆ ఇంటికి కళొచ్చింది. పురుషోత్తం దినచర్య దిశ మారింది. వ్యాపారం దశ మారి మరింత లాభాలు రావడం మొదలెట్టాయి. దాంతో పాపమీద మరింత ప్రేమ ఎక్కువైంది. 'పండూ! పండూ' అంటూ ముద్దుగా పిలుస్తూంటే పాక్కుంటూ వస్తోంది పాప. మా అమ్మ...మా అమ్మ అంటూ ఎత్తుకుని దింపేవాడు కాదు. మోడర్న్‌గా పెద్దబంగళా కట్టించి 'లక్ష్మీ నిలయం' అని పేరు పెట్టాడు. కారు కొన్నాడు.

ఉన్నట్టుండి 'పండు'లో ఏదో తెలియని మార్పొచ్చింది. ఎందుకో తెలియదు. ఏడిస్తే ఒకటే ఏడుపు. నవ్వితే ఒకటే నవ్వు. నిద్రపోతే పగలూ రాత్రీ తేడా లేకుండా మొద్దు నిద్రే.

పసిపిల్లలకి బాలారిష్టాలు మామూలే అని సరిపెట్టుకున్నారు. కాని రాన్రాను విపరీత లక్షణాలు కనబడేసరికి డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళారు. ఆయన మందులిచ్చి కంగారులేదన్నాడు.

మందులు వాడినా 'పండు' ధోరణిలో మార్పు లేకపోయేసరికి తల్లడిల్లిపోయింది తల్లి. అందరి దేవుళ్ళకు మొక్కుకుంది. తాయెత్తులు కట్టించింది. మంత్రాలు వేయించింది. అయినా పాపలో మార్పు లేదు. ఆరోగ్యం మాత్రం బాగానే వుంది. వెన్ను ముదిరితే సర్దుకుంటుందని సరిపెట్టుకున్నారు.

***

స్కూలు కెళ్ళే వయసొచ్చేసరికి 'పండు' ప్రవర్తనలో మార్పొచ్చింది. కానీ ధోరణి మారలేదు. హమ్మయ్య అనుకున్నారు. పెనం మీదనుంచి పొయ్యిలో పడ్డాం అనుకోలేదు.

పండుది మంకుపట్టు. ఏది కావాలంటే అది క్షణాల్లో ఇవ్వాల్సిందే. అది ఇచ్చేవరకు నిద్రపోయేది కాదు. నిద్రపోనిచ్చేది కాదు. ఒకటి తీరాక ఇంకొకటి. గుడ్డిలోమెల్ల ఎవరితో దెబ్బలాడేది కాదు. ఎవరితోనూ ఎక్కువ మాట్లాడేది కాదు. తన ధోరణి తనదే.

తండ్రి హడావుడిగా మార్కెట్‌యార్డ్‌కి వెడుతుంటే తనూ వస్తానని పేచీ పెట్టింది పండు.

"తీసుకెళ్ళు. ఇంట్లో వుంటే నన్ను కాల్చుకు తింటుంది"

"తీసుకెడితే నన్ను వేపుకుని తింటుంది."

"తీసుకెళ్ళడానికి భయపడుతున్నావంటే అక్కడ నువ్వేసే యదవేసాలు సూత్తుందనా? సిన్నపిల్ల దానికేం తెలుస్తాయి నీ గారడీలు"

"సిన్నపిల్లా? సిసింద్రీ. అగ్గిపుల్ల లేకుండా అల్లరితోనే గోడౌను తగలబెట్టేస్తాది"

"అందుకనే నలుగురూ తిట్టుకునే యాపారం మానేసి, మెచ్చుకునే యాపారం సెయ్యమంటున్నా, ఏదో ఒక రోజు ఓ గట్టిదెబ్బ తగిల్తేగానీ నీకు బుద్ధి రాదు"

"సేపనార్థాలు పెట్టమాక, తీసుకెడతాలే"

మొగుడూ పెళ్ళాలు వాదించుకుంటుంటే పండు ఏడుపు మొదలెట్టింది. ఇల్లు కూలి పందిరెయ్యాక ముందే పండుని ఎత్తుకుని తీసుకెళ్ళాడు పురుషోత్తం.

గోడౌన్‌లో కూలీలు పొట్లాల్లో కార్బైడు కట్టి

పచ్చికాయలమధ్యలో వేసి ఆ కాయల్ని పెట్టెల్లో పెట్టి మూత పెడుతున్నారు.

నీళ్ళ తొట్టెలో కార్బైడ్ కలిపి దాంట్లో పచ్చి అరటి కాయలు ముంచి తీస్తున్నారు. ఆకుపచ్చగా ముని గిన కాయలు పైకొచ్చేసరికి పసుపుపచ్చగా తయా రవుతున్నాయి.

అక్కడ జరుగుతున్న తతంగమంతా చూసి ఆశ్చర్యపోయింది పండు. కూతురు చూపులు గ్రహించి "అది మ్యాజిక్. అబ్రకదబ్ర అంటే రంగు మారిపోతుందంతే, నడు నడు" అంటూ పండుని తొందర చేశాడు తండ్రి.

"ఆ మ్యాజిక్ నేనూ చేస్తా" అంటూ పేచీకి దిగింది పండు. పట్టినపట్టు వదలదని తెలుసు గనుక తప్పదనుకుని, "అలాగే కానియ్యి" అని నెత్తిన చెయ్యెట్టుకుని కూర్చున్నాడు.

నీళ్ళల్లో కార్బైడ్ కలిపి, అందులో అరటికాయలు ముంచితీస్తూ కేరింతలు కొట్టింది. శ్రమ తగ్గినందుకు కూలీలు సంబరపడ్డారు. ఇంతలో గోడౌన్ గుమస్తా పళ్ళెంనిండా ముక్కలు తెచ్చాడు.

"ఎందుకు తెచ్చావ్?" అంటూ కూతురు చూడక ముందే అక్కడినుంచి తీసుకుపొమ్మని అరిచాడు పురుషోత్తం. అవే తింటానంటూ ఏడుపు లంకించు కుంది. అవన్నీ తినేసింది. ఆ పిల్ల తిండిచూసి పని వాళ్ళందరూ తెల్లబోయారు.

***

'పండు' కాలేజీ చదువుల కొచ్చేసరికి ఏపుగా, ఎత్తుగా అందంగా ఎదిగింది. ఆమె ఆలోచనలు, ఆచరణలో కూడా మార్పులొచ్చాయి. ఇదీ ఒకందుకు మంచిదే అనుకున్నారు అమ్మానాన్న. కానీ దాంట్లోని సాధకబాధకాలు అర్థమయ్యేసరికి వాళ్ళల్లో ఆందో ళన ప్రారంభమైంది.

టీ తాగి తెల్లవార్లూ చదివేది, పరీక్షలున్నా లేకున్నా. స్పోర్ట్స్ వీక్ వచ్చిందంటే ఆడుతూనే ఉండేది. కల్చరల్ వీక్ వస్తే పాడుతూనే వుండేది.

'పండు' తన ఆలోచనలు ఆచరణలో పెట్టే వరకు ఎవరితోనూ ఏదీ షేర్ చేసుకునేది కాదు. అది నెరవేరే వరకు ఇంకో ధ్యాసే ఉండేది కాదు.

'పండు'లో ప్రకృతి సిద్ధమైన శారీరక పరిపక్వం రావడం లేదు. విరుద్ధమైన మానసిక మార్పులు మాత్రమే వస్తున్నాయి. దాంతో అమ్మానాన్నలకి అనుమానం వచ్చింది. పండుకి నచ్చజెప్పి, బతి మాలి, బామాలి లేడీ డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళారు. జెనెటిక్ ప్రాబ్లమ్, కంగారు లేదు, మందులు వాడ మంది డాక్టర్.

"నీ వల్లే దానికీ అనారోగ్యం. కల్తీ యాపారం చేస్తూ ఎంతమంది తల్లిదండ్రుల కడుపు కొడతావు?" కన్నీళ్ళు పెట్టుకుంది పార్వతమ్మ.

"పిల్లకేమొచ్చినా నా యాపారంతో లింకెడతా వేంటి? తల్లిదండ్రుల వృత్తుల్ని బట్టి పిల్లల ఆరోగ్యం, ప్రవర్తనా ఉండదే!" ఒళ్ళుమండి ఘాటుగానే సమా ధానం చెప్పాడు పురుషోత్తం.

"ఆడపిల్ల అన్నిటికీ తండ్రినే ఆదర్శంగా తీసు కుంటుంది"

"నువ్వు చేసినగారం వల్లే ఈ యింత ప్రవర్తన."

"పిల్లల్ని కంటాంగాని వాళ్ళ బుద్ధుల్ని కనలేం."

"ఒక్కగానొక్క కూతురని నెత్తికెక్కించుకోవడం ఎందుకు? ఇప్పుడు బరువైందని బాధపడ్డం ఎందుకు?"

"నేనేం బాధపడ్డంలేదు. నువ్వే, అసలే ఆడపిల్ల అని, అనుమానం వచ్చినప్పుడల్లా డాక్టర్ దగ్గరికి పరుగు తీయిస్తున్నావు."

ఇంతలో ఊరునుంచి పురుషోత్తం చెల్లెలు పద్మావతమ్మ రావడంతో ఆ మాటల యుద్ధానికి తాత్కాలికంగా తెరపడింది.

పద్మావతమ్మ ఎందుకొచ్చిందో మాటలమధ్య మెల్లగా బయటపెట్టింది. "అన్నయ్యా! మీ 'పండు'కి మా అబ్బాయికి ఈడూజోడూ బావుంటుంది. నువ్వూ వదినా ఊ అంటే శ్రావణ మాసంలో పెళ్ళి చేద్దాం."

పురుషోత్తం అవాక్కయ్యాడు. అప్పుడే పెళ్ళేంటని ఆందోళన పడ్డాడు. పార్వతమ్మ కంగారు పడింది.

**పండ్ల వ్యాపారంలో ఆరితేరినవాడతను. తిమ్మినిబమ్మిని చేయగలడు. కార్బైడ్‌వేసి బలవంతంగా పండ్లను పక్వానికి రప్పించగలడు. పాపపుణ్యాల జోలికెళితే కష్టాలు తప్పవని అతనికి తెలుసు. అందుకే తన వ్యాపారంలో దేవుడికి కూడా కొంత వాటా ఇచ్చేవాడు. ఎంత ఆస్తి సంపాదించినా అనుభవించడానికి పిల్లలు లేరనే బెంగపట్టు కుంది అతనికి. ఎలాగైతేనేం అతడింట కూడా ఓ కాయ కాసింది. మరి ఆ కాయ పక్వానికి వచ్చిందా? లేదా?**

"చెల్లెమ్మా! పండు ఇంకా చిన్నపిల్ల. డిగ్రీ అయ్యాక ఆలోచిద్దాంలే."

"పెళ్ళయ్యాక కూడా చదువుకోవచ్చు అన్నయ్యా! దాని చదువు విషయంలో నాది భరోసా!"

"అది కాదు వదినగారూ! దానంతట అది పెళ్ళి ఊసెత్తాకే సంబంధాలు సూద్దాం అనుకుంటున్నారు మీ అన్నయ్య" సర్దిచెప్పేందుకు అప్రయత్నంగా ఏదో అంది పార్వతమ్మ.

"వదినా నీ వెర్రిగానీ, సంప్రదాయ కుటుం బంలో ఏ ఆడపిల్ల అయినా తనంతట తాను పెళ్ళి చేసుకుంటానని అంటుందా? ఆస్తుల విషయంలో మీతో తూగలేకపోయినా, ఆత్మాభిమానం చంపు కుని, మొగపిల్లాడి తల్లిననే గర్వంలేకుండా అడుగు తున్నా. పుట్టింటిమీద మమకారం చంపుకోలేక అడిగా. మీ ఇష్టం" కళ్ళొత్తుకుని ముక్కు చీదింది.

కూతురి 'అసలు' విషయం ఎక్కడ బయట పడుతుందో అని పార్వతమ్మ కంగారుపడింది.

రాత్రి పురుషోత్తం చెవిలో అసలు విషయం ఊదింది. "ఇంటి ఆడబడుచు కన్నీళ్ళెట్టుకుంటే శుభం కాదు. పెళ్ళి విషయం తర్వాత మాట్లాడ దామని నచ్చచెప్పి చీరపెట్టి మీ చెల్లెల్ని వెంటనే పంపేయ్. అసలు విషయం పసిగడితే అందరికీ తెలిసిపోతుంది. అసలే మీ సెల్లెలు పెద్ద చరవాణి" అని మొగుడుకి నచ్చచెప్పింది.

అన్నావదినల బెదురుచూపులు, గుసగుసల వెనకనున్న అసలు కారణాన్ని దేవాంతకురాలైన పద్మా వతమ్మ ఇట్టే పట్టేసింది.

మళ్ళీ పెళ్ళి ఊసెత్తకుండా, పెట్టిన పట్టుచీర కట్టుకుని ఏమీ ఎరగనట్టు వెళ్ళిపోయింది.

ఆవిడ పుణ్యాన కులపోళ్ళలోనూ, బంధువుల్లోనూ అడిగినవాళ్ళకి అడగనివాళ్ళకి అందరికీ అసలు విషయం తెలిసిపోయింది.

'పండు' వయసొచ్చినా పెద్దమనిషి కాలేదని, జెనెటిక్ ప్రాబ్లమ్ అని, సంసారానికి పనికిరాదని.

తన పక్కలో పడుకుని ఏడుస్తున్న అమ్మని గమనించింది పండు. కాని తన ఐపాడ్‌లో 'దొంగా పోలీసు' ఆట ఆడుతోంది. దొంగ పోలీసులకి దొర క్కుండా, దోచిన సొమ్ము రకరకాలుగా, రహ స్యంగా దాస్తున్నాడు.

'ఎందుకు ఏడుస్తున్నావమ్మా?' అని కూడా అడ గని కూతుర్ని చూసి ఇంకా ఏడ్చింది పార్వతమ్మ.

"నేనుపోయాక ఈ పాపిష్టి జనం మధ్య నిందలు మోస్తూ, అనారోగ్యంతో ఎలా బతుకుతావే తల్లీ" అంటూ కూతుర్ని కౌగిలించుకుని మరీ మరీ ఏడ్చింది.



## హీరోయిన్ కొడుకుతో డేటింగ్?

ఈ ఆచారం ఇంకా దక్షిణాదికి పాకలేదు. బాలీవుడ్‌లో సర్వసామాన్యమైన ఈ వ్యవహారం ఇటీవలే బయట కొచ్చింది. ఇంతకీ అసలు సంగతేమిటంటే.....సోనాల్ చౌహాన్ తెలుగులో ఒకటి రెండు సినిమాల్లో చేసింది. ఆ తరువాత ఈ అమ్మడిని ఇక్కడ ఎవరూ పట్టించుకోకపోవడంతో బాలీవుడ్‌కి ఫిక్స్ అయిపోయింది. అక్కడ కూడా సేమ్ సీన్ రిపీట్ అయింది. చిన్నాచితకా సినిమాలు చేస్తున్న సోనాల్ ఇప్పుడు ఓ మాజీ హీరోయిన్ కొడుకుతో ప్రేమలో పడింది. అతగాడినే పెళ్ళాడబోతున్నట్టు వార్తలు గుప్పుమంటున్నాయి. బాలీవుడ్ మాజీ హీరోయిన్ భాగ్యశ్రీ గుర్తుంది కదా! ఒకటిరెండు సినిమాలు చేసి ఎంచక్కా పెళ్ళి చేసుకుని సెటిలైపోయింది. ఇప్పుడు ఈవిడగారి కొడుకుతోనే సోనాల్ ప్రేమ వ్యవహారం జరుపుతోందని బాలీవుడ్ కోడైకూస్తోంది. ఇంత వరకూ ఇరు వర్గాల్లో ఎవరూ దీన్ని ఖండించకపోవడంతో ఈ పుకార్లే నిజమని కూడా కొందరు అంటున్నారు.



కూతురికి అర్థమయ్యేటట్టు ఆడపిల్ల పెద్ద మనిషవడం గురించి, పెళ్ళీ, పిల్లలు పుట్టడం గురించి ఏడుస్తూనే విపులంగా చెప్పింది.

అమ్మ ఎందుకేడుస్తోందో, తన అనారోగ్యం ఏమిటో అప్పుడు అర్థమైంది పండుకి.

***

హాల్లో కూర్చుని లెక్కలు చూసుకుంటున్నాడు పురుషోత్తం. 'ఏ పని చేసే సమయంలోనైనా ఆ పనికి సంబంధించిన జ్ఞానం అవసరం. ఏ పని ముట్టుతో ఏ పని చెయ్యాలని నిర్దేశించబడిందో అదే చెయ్యాలి. జల్లెడతో జల్లించాలి కాని, చిల్లులెక్కువున్నాయని, గాలి బాగా తగులుతుందని కిటికీలా, అమర్చుకోకూడదు' భక్తి ఛానల్‌లో స్వామీజీ ప్రసంగం శ్రద్ధగా వింటోంది పార్వతమ్మ.

అమ్మ పక్కనే కూర్చుని ఐపాడ్‌లో దొంగా పోలీస్ ఆట ఆడుతూ స్వామి మాటలు కూడా వింటోంది పండు. ఇంతలో ట్రక్‌లో కార్బైడ్‌టిన్నులు పెట్టుకుని గోడౌన్ గుమస్తా కంగారుగా పురుషోత్తం ఇంటికొచ్చాడు.

"అయ్యగారూ! మన గోడౌన్ మీద రైడింగ్ జరగబోతోందట. ఈ రోజు ఉదయం పదిగంటలకి సడన్ చెకింగ్‌కి ఆఫీసర్లు రాబోతున్నారని, ఆళ్ళ ఆఫీసునుంచే మన మనిషి ఇన్ఫర్మేషన్ ఇచ్చాడు. ఏం చెయ్యాలో తెలియలేదు. వెంటనే గోడౌన్ వెనక డోర్నుంచి సరుకంతా తీసుకొచ్చేశా" ఆయాసపడుతూ చెప్పాడు గుమస్తా.

ఒక్కక్షణం ఆలోచించాడు పురుషోత్తం.

"మంచి పని చేశావ్. ఆ స్టాకంతా, మన బంగళాలో వాచ్‌మన్ బాత్‌రూమ్‌లో దాచేయ్. ఒకవేళ బాత్రూమ్ కూడా చెక్ చేస్తామంటే ఫ్లష్‌అవుట్ పాడైంది, కంపు కొడుతోంది, బాగు చేయిస్తున్నాం అని నువ్వక్కడే ఉండి నాటకం ఆడు, కంగారుపడకు" అంటూ గబగబా గోడౌన్‌లకేసి వెళ్ళాడు పురుషోత్తం.

ఆఫీసర్లు పురుషోత్తం ఇంటికి రానే వచ్చారు. చెకింగ్ చెయ్యనే చేశారు. ఎక్కడా ఏం దొరకలేదు. తిరుగు మొహం పట్టనే పట్టారు.

హమ్మయ్యా! గండం గడిచిందని హాయిగా నిద్రపోయాడు పురుషోత్తం. గొడవ సద్దుమణిగాక తీరిగ్గా కార్బైడ్ టిన్నులు గోడౌన్‌కి పంపుదామని వాచ్‌మన్ బాత్‌రూమ్‌లోకెళ్ళాడు పురుషోత్తం. ఒక్క టిన్ను కూడా అక్కడలేదు. కంగారుగా ఇల్లంతా వెతికాడు. కనబడలేదు. స్టాక్ అంతా ఏమైందో తెలియక షాకయ్యాడు. గుమస్తాని అడిగాడు. అక్కడే దాచానన్నాడు. వాచ్‌మన్‌ని అడిగాడు. నాకేం తెలీదన్నాడు. భార్యని అడిగాడు.

"నువ్వు చేసే పాపపు పనిలో నాకేటి సంబంధం" రుసరుసలాడింది పార్వతమ్మ.

"మాటిమాటికీ పాపం... పాపం అంటావేమిటి? ఆ పాపపు సొమ్ము నువ్వూ మెక్కుతున్నావుగా. ఆ సొమ్ముతో నువ్వూ భోగాలనుభవిస్తున్నావుగా."

మొగుడూ పెళ్ళాల మధ్య మాటామాటా పెరిగింది. అరుచుకోవడం మొదలెట్టారు.

పరుగు పరుగున అక్కడికి వచ్చింది పండు. వాళ్ళ దెబ్బలాట వింటూ ఐపాడ్‌లో తన ఆట తను ఆడుకుంటోంది.

కూతుర్ని చూసేసరికి పార్వతమ్మకి కోపం దుఃఖంగా మారింది. మళ్లీ మొదలైంది మాటల యుద్ధం.

"నీ పాపానికి ప్రత్యక్ష సాచ్చం నీ కూతురే. నీవల్లే నాకీ క్షోభ. దానికీ బాధ. నీవల్లే దాని బతుకు బండలైంది"

"ఏటే! మాటిమాటికీ నావల్లే నావల్లే అంటావు. అప్పటికేదో నీవల్ల..." మాట జారబోయి ఆగాడు.

"చ్ఛేత్రం మంచిదైనా, బీజంలో దోసముంటే ఫలితం ఇలాగే వుంటుందట, సాములోరు సెప్పారు. నువ్వు సేసే పనిలో పాపం ఉండబట్టే పండంటి 'పండు' జీవితం పుండైంది. నా కడుపున పుట్టడం అది ఏ జన్మలో చేసుకున్న పాపమో."

"దాని అనారోగ్యానికి కారణం నేనే అని ప్రతిసారి, నన్నే తప్పు పడతావేంటి?"

"తప్పుకాక, నువ్వు చేస్తున్న పని ఒప్పేంటి? నేనెప్పుడూ తప్పుడు పనులు, పాపపు పనులు సెయ్యలేదు. అయినా నాకెందుకీ బాధ. సెయ్యని తప్పుకి ఆ పసిదానికెందుకు ఇంత పెద్ద శిక్ష" అంటూ ఏడుస్తూ నెత్తి బాదుకుంటూ మొగుడు కాలరు పట్టుకుని హిస్టీరియా పేషంటులా గుంజడం మొదలెట్టింది.

తన ఎదురుగా అమ్మానాన్నలు తన గురించే గొడవ పడుతుంటే, తనేం చేయాలో మొదటిసారి ఆలోచించడం మొదలెట్టింది పండు.

***

పురుషోత్తం కార్బైడ్ స్టాక్ పండు బాత్‌రూంలో దొరికింది. ఘనరూపంలో కాదు, ద్రవరూపంలో. అక్కడ వాతావరణం చూసేసరికి కాళ్ళూ, చేతులూ ఆడలేదు. మెదడు మొద్దుబారిపోయింది. ఒళ్ళంతా చెమటలు పట్టాయి. ఏం జరిగిందో అర్థం కాలేదు. కంగారెక్కువైంది. తడబడుతూ అడుగుముందుకేశాడు పురుషోత్తం.

బాత్‌రూమ్ నిండా ఖాళీ కార్బైడ్ టిన్నులు సునామీలో శవాల్లా చిందరవందరగా పడున్నాయి.

బాత్ టబ్ నిండా కార్బైడ్ ద్రవంలో తేలుతున్న పచ్చికాయల మధ్య వనకన్యలా పడుకుని వుంది 'పండు'.

టబ్ అంచులమీద నుంచి నీళ్ళు పొర్లి పొర్లి కన్నీళ్ళులా కారుతున్నాయి. పక్కనే దాంట్లో ముంచిన పచ్చికాయలు పక్వానికి రాని 'పండు' కేసి జాలిగా చూస్తున్నాయి.

మొగ్గ ప్రకృతి ధర్మంగా వికసించేవరకు ఆగాలి. బలవంతంగా ప్రయోగంచేసి వికసింపచేయడానికి ప్రయత్నిస్తే రేకులు విరిగిపోతాయి. మొగ్గ నేల రాలిపోతుంది.

కాయ అయినా, కాయమైనా అంతే. ఇన్నేళ్ళు వ్యాపారం ముసుగులో, లాభాల మసకలో, పక్వానికి రాని న్యాయం, ధర్మం ఈనాడు పశ్చాత్తాపంతో పరిపక్వానికి వచ్చాయి పురుషోత్తముడికి 'పండు' చావుతో.

**సెల్: 98491 42361**






- రాజశుక

# ముందు గొయ్యి వెనుక నుయ్యి!

**డీఎంకే నాయకుడు స్టాలిన్ ప్రస్తుతం రాజకీయంగా దిక్కుతోచని పరిస్థితిలో ఉన్నారు. తదుపరి ఎన్నికల్లో తాను విజయం సాధించడానికి ఏం చేయాలో అర్థం కాక అయోమయంలో కొట్టుమిట్టాడుతున్నారు.**

తమిళనాడులో డీఎంకే నాయకుడు ఎం.కె. స్టాలిన్ పరిస్థితి అడకత్తెరలో పోకచెక్కలా ఉంది. ఒకపక్క అన్నాడీఎంకే వర్గాలు, మరోపక్క రజనీకాంత్, మరో పక్క ప్రబల శత్రువు బీజేపీ. బీజేపీ ప్రోద్బలంతో అన్నాడీఎంకే వర్గాలు విలీనమయ్యే అవకాశాలు రోజురోజుకూ మెరుగుపడుతుండడం, అయితే గియితే తమిళనాడు సూపర్‌స్టార్ రజనీకాంత్ రాజకీయాల్లోకి రావడానికి అవకాశం ఉండడం ప్రతిపక్ష నాయకుడు స్టాలిన్‌కు కంటి మీద కునుకు పట్టనివ్వడం లేదు. జయలలిత జీవించి ఉన్న కాలంలో కూడా ఇటువంటి రాజకీయ సందిగ్ధావస్థ తనకు ఎదురు కాలేదని స్టాలిన్ తన సన్నిహితులతో అంటున్నారు. అన్నాడీఎంకే వర్గాలు కలిసిపోయినా, రాజకీయాల్లోకి ప్రవేశించిన రజనీకాంత్‌కు బీజేపీ మద్దతు ఇచ్చినా తన పరిస్థితి కుడితిలో పడ్డ ఎలుక చందంగా మారుతుందని స్టాలిన్ లోలోపల ఆందోళన చెందుతున్నారు.

ప్రస్తుతం తన సన్నిహితులతోనూ, రాజకీయ విశ్లేషకులతోనూ ఇదే విషయం మీద చర్చలు, సంప్రదింపులు జరుపుతున్నారు. ఓ పది పదిహేను రోజుల క్రితం స్టాలిన్ తన తండ్రి ఎం.కె. కరుణానిధికి అత్యంత సన్నిహితుడైన ఓ ప్రముఖ రాజకీయ విశ్లేషకుడిని సంప్రదించారు. రజనీకాంత్ రాజకీయ ప్రవేశంపై ఆయన అభిప్రాయం అడిగారు. రాష్ట్ర రాజకీయాలపై రజనీకాంత్ ప్రభావం అంతగా ఉండకపోవచ్చని తన పార్టీ నాయకులు కొందరు భావిస్తున్నారని కూడా స్టాలిన్ ఆయనకు చెప్పారు. "మిగిలినవారి గురించి ఆందోళన చెందకు. నీ సంగతేమిటని ఆలోచించు" అని ఆ రాజకీయ విశ్లేషకుడు సూచించారు. 2016 మేలో జరిగిన ఎన్నికల్లో డీఎంకే, కాంగ్రెస్, మరికొన్ని చిన్న పార్టీలు కలిసి 37 శాతం ఓట్లు సంపాదించాయి. రజనీకాంత్ గనుక రాజకీయాల్లో ప్రవేశిస్తే తదుపరి ఎన్నికల్లో 40 శాతం ఓట్లు ఆయన (పెట్టబోయే) పార్టీకి దక్కే అవకాశం ఉందని కొన్ని సర్వేలు, అధ్యయనాలు, అంచనాలు తేల్చి చెబుతున్నాయి. బీజేపీ, విజయకాంత్ పార్టీ, పీఎంకే వంటి పార్టీలు 30 శాతం వరకూ ఓట్లు సంపాదించుకునే అవకాశం ఉంది. మిగిలిన 30 శాతం ఓట్లు అన్నాడీఎంకే వర్గాలు చేజిక్కించుకోవచ్చు. అందువల్ల స్టాలిన్ ఇప్పటి నుంచే ఎంత జాగ్రత్త పడితే అంత మంచిదని ఆ విశ్లేషకుడు తెలిపారు. అప్పటి నుంచి స్టాలిన్ ఆందోళన ఎక్కువైంది.

గత ఏడాది జరిగిన శాసనసభ ఎన్నికల్లోనే కాక, 2014లో జరిగిన లోక్‌సభ ఎన్నికల్లో కూడా స్టాలిన్ నేతృత్వంలో డీఎంకే పోటీ చేసింది. లోక్‌సభ ఎన్నికల్లో డీఎంకేకి ఒక్క సీటు కూడా రాలేదు. లోక్‌సభ ఎన్నికల్లో ఘోరంగా దెబ్బతిన్న తరువాత స్టాలిన్ వేష భాషలు మరింతగా మార్చారు. లుంగీ స్థానంలో ప్యాంటూ షర్టూ వచ్చాయి. సోషల్ మీడియాను హద్దుల్లేకుండా ఉపయోగించుకున్నారు. యువ ఓటర్లను ఆకట్టుకోవడానికి చేయాల్సిందంతా చేశారు. అయితే, అన్నాడీఎంకే ఓట్లలో చీలిక తేవడంలో మాత్రం ఆయన విఫలమయ్యారు. ఏ పార్టీతోనూ పొత్తు పెట్టుకోకపోవడం వల్ల ఆయన మెజారిటీ సంపాదించుకోలేకపోయారు. ఫలితంగా 2016లో జయలలిత నాయకత్వంలో అన్నాడీఎంకే మళ్లీ అధికారంలోకి వచ్చింది. అయితే, శాసనసభలో ఆయన పార్టీకి సీట్ల సంఖ్య మాత్రం బాగా పెరిగింది.

**రజనీ ప్రభావం**

ఏది ఏమైనా మున్ముందు జరిగే ఎన్నికలు ముఖ్యమంత్రి అభ్యర్థులైన స్టాలిన్, రజనీకాంత్‌ల మధ్యే జరుగుతాయనడంలో ఏమాత్రం సందేహం లేదు. స్టాలిన్‌కు అందిన సమాచారం ప్రకారం రజనీకాంత్ రాజకీయాల్లోకి రావడమనేది దాదాపు ఖాయమై పోయింది. సినీ హీరోల కోసం ప్రాణత్యాగాలు చేయడానికి సైతం వెరవని తమిళనాడు యువతను ఆకట్టుకోవడం ఈసారి తనకు తలకు మించిన భారం కాబోతోందని స్టాలిన్ ఆందోళన చెందుతున్నారు. ఆందోళన చెందుతూ కూర్చోవడం వల్ల ఉపయోగం లేదని, తాను వ్యూహ ప్రతివ్యూహాలకు సిద్ధమై, ఎదురు దాడి సాగించాలని స్టాలిన్ సన్నిహిత రాజకీయ విశ్లేషకులు, పార్టీ నాయకులు ఆయనకు హితబోధ చేస్తున్నారు.

స్టాలిన్‌కు రాజకీయానుభవం ఉంది. అంతకు మించి పాలనాపరమైన అనుభవం కూడా ఉంది. పాలనాదక్షుడని ఆయన డీఎంకే హయాంలో పేరు



కూడా తెచ్చుకున్నారు. తనకున్న ఆ ఇమేజ్‌నే ఆయన ప్రజల ముందుంచుతున్నారు. ప్రజలతో మరింత మమేకం కావడానికి ఆయన అనేక రాజకీయ, వ్యక్తిగత, పాలనాపరమైన మార్గాల ద్వారా ప్రయత్నిస్తున్నారు. చెరువులు, బావుల్లో పూడికలు తీయాలని ఆయన ఇటీవల తన శ్రేణులకు సూచించారు. ఇటువంటి కార్యక్రమాల విషయంలో పాలక పక్షం విఫలం అవుతుండడంతో ప్రతిపక్షంగా తామే ఈ బాధ్యతలను స్వీకరిస్తున్నట్టు ఆయన ప్రజల్లో, ప్రభుత్వంలో ఓ అభిప్రాయాన్ని కలిగిస్తున్నారు. ఈ కార్యక్రమాన్ని ఆయన గత ఏడాది సెప్టెంబర్ లోనే చేపట్టారు. అప్పట్లో ముఖ్యమంత్రి, అన్నాడీ ఎంకే అధినాయకురాలు జయలలిత ఆస్పత్రిలో ఉన్నారు. జయలలిత ఆస్పత్రిలో చేరిన దగ్గర నుంచి అన్నాడీఎంకే ప్రభుత్వం అచేతనంగా మారడం ఆయనకు కొంత ఉపకరించింది.

ఇక జయలలిత మరణానంతరం అన్నాడీఎంకేలో చీలికలు రావడంతో పాలనా యంత్రాంగం స్తంభించిపోయింది. పరిశ్రమల్లో పెట్టుబడులు పెట్టడం బాగా తగ్గిపోయింది. కొత్త కంపెనీలు, కొత్త పరిశ్రమలు రావడం ఆగిపోయింది. పైగా ఇవి పక్క రాష్ట్రాలకు మళ్లాయి కూడా. అంతేకాక, గత 140 ఏళ్ల కాలంలో కనీ వినీ ఎరుగని విధంగా కరువు కూడా చుట్టుముట్టింది. కావేరీ జలాలపై కర్ణాటక రాష్ట్రంతో ఉన్న విభేదాలు, వివాదాలు శ్రుతిమించాయి. ఈ సంక్షోభం నుంచి రాష్ట్రాన్ని గట్టెక్కించగల ఏకైక నాయకుడుగా ఆయన ప్రజల్లో అభిప్రాయం కలిగించారు. గత అయిదు దశాబ్దాలుగా డీఎంకే, అన్నాడీఎంకేలకే పరిమితమైన తమిళనాడు రాష్ట్రం ఎటువంటి పరిస్థితులలోనూ బీజేపీ వంటి ఉత్తరాది పార్టీల చేతుల్లోకి వెళ్లదని, ఒకవేళ బీజేపీ రజనీకాంత్‌ను ఆశ్రయించినా ఇక్కడ నెగ్గుకు రాలేదని ఆయన ఇంతకాలం భావిస్తూ వస్తున్నారు. అయితే, కీడెంచి మేలెంచడం మంచిదని ఆయనకు విశ్లేషకులు సలహా ఇస్తున్నారు.

## పని చేయని వ్యూహాలు

రజనీకాంత్‌కు తమిళనాడులో అభిమానులు ఎక్కువ. ఆయన గనుక పార్టీ ప్రారంభించే పక్షంలో ఇతర పార్టీల నుంచి కూడా వలసలు కట్టే అవకాశం ఉంది. చిన్నపార్టీల నుంచే కాకుండా అన్నాడీఎంకే, డీఎంకే వంటి పెద్ద పార్టీల నుంచి కూడా పలువురు నాయకులు, కార్యకర్తలు రజనీకాంత్ పార్టీలోకి వెళ్లే సూచనలున్నాయి. రజనీకాంత్ రాజకీయ ప్రవేశంతో రాష్ట్రంలో రాజకీయ సమీకరణాలన్నీ మారిపోయే అవకాశం ఉంది. ఏ పార్టీ పరిస్థితి ఎలా ఉంటుందో అంచనా వేయడం కూడా కష్టమే. అంతేకాదు. పార్టీ అంటూ పెడితే డీఎంకే, అన్నాడీ ఎంకేలను బలహీనపరచడమే రజనీకాంత్ రాజకీయ వ్యూహం అవుతుంది. అదే జరిగితే, మొదటి దెబ్బ స్టాలిన్ పార్టీకే తగులుతుంది. ఇదే విషయాలను విశ్లేషకులు స్టాలిన్‌కు పదే పదే చెబుతున్నారు.

దెబ్బ మీద దెబ్బలా త్వరలో 2జి కేసు మీద తీర్పు రాబోతోంది. ఈ తీర్పులో ఏ. రాజా, కనిమొళిలు దోషులుగా తేలే పక్షంలో డీఎంకే ఓ అవినీతి పార్టీ అనే ముద్ర పడిపోతుంది. డీఎంకే పార్టీని వృద్ధ నాయకుల పార్టీగా యువతరం భావించనప్పటికీ, 2జీ కుంభకోణంతో మాత్రం ఓ అవినీతి పార్టీగా భావించే అవకాశం ఉంది. ఈ అభిప్రాయాన్ని తొలగించడానికి స్టాలిన్ నానా పాట్లూ పడక తప్పదు. ఈ పార్టీకి తాను అధినేతనని, తన పార్టీ వృద్ధ పార్టీ గానీ, అవినీతి పార్టీ గానీ కాదని ఆయన నిరూపించుకోవాల్సి ఉంటుంది. ఒక విధంగా చెప్పాలంటే, రజనీకాంత్, నరేంద్ర మోదీ జోడీని డీఎంకే తక్కువ అంచనా వేస్తున్నట్టు కనిపిస్తోంది. అన్నాడీఎంకేని బీజేపీ నియంత్రిస్తున్న తీరుపై స్టాలిన్ అడపాదడపా ధ్వజమెత్తుతున్నారు గానీ, రజనీకాంత్ మీద మాత్రం ప్రత్యక్షంగా విమర్శలు చేయలేకపోతున్నారు. కరుణానిధికి రజనీకాంత్ సన్నిహితుడు కావడమే అందుకు కారణంగా కనిపిస్తోంది. "జయలలిత గనుక మళ్లీ అధికారంలోకి వస్తే ఈ తమిళనాడును ఇక ఆ దేవుడే కాపాడాలి" అంటూ రజనీకాంత్ చేసిన వ్యాఖ్యలు 1996లో డీఎంకే అధికారంలోకి రావడానికి దోహదం చేసింది. ఈ సంగతి స్టాలిన్‌కు బాగా గుర్తుంది.

**రజనీకాంత్ రాజకీయరంగ ప్రవేశం దాదాపు ఖరారైన దశలో డీఎంకేకు ముందు నుయ్యి వెనుక గొయ్యి పరిస్థితి ఏర్పడింది. రజనీకాంత్ పెట్టబోయే పార్టీకి నలభైశాతం ఓట్లు దక్కే అవకాశం ఉంది గనుక డీఎంకే ఇప్పటి నుంచే జాగ్రత్త పడాలనే రాజకీయ విశ్లేషణ, 2జీ కేసు తీర్పు రానున్న నేపథ్యంలో డీఎంకే అవినీతిపార్టీ కాదని నిరూపించుకోవాల్సిన ఆవశ్యకత వంటివి స్టాలిన్‌ను మరీ ఎక్కువ ఆందోళనకు గురిచేస్తున్నాయి.**

విచిత్రమేమిటంటే, స్టాలినే కాదు, ఒక అన్నాడీఎంకే వర్గానికి నాయకుడైన మాజీ ముఖ్యమంత్రి ఓ. పన్నీర్ సెల్వం కూడా రకరకాల కారణాలపై ఆందోళన చెందుతున్నారు. అందులో ముఖ్యమైంది రజనీకాంత్ రాజకీయ ప్రవేశం. రజనీకాంత్ ముఖ్యమంత్రి అభ్యర్థిగా ప్రకటించుకున్నా, బీజేపీ, రజనీకాంత్ పార్టీ, ప్రత్యర్థి అన్నాడీఎంకే వర్గం చేతులు కలిపినా తనకు ఇక రాజకీయంగా పుట్టగతులు ఉండవని ఆయన భావిస్తున్నారు. "రజనీకాంత్‌ను రాజకీయాల్లోకి తీసుకురావడానికి బీజేపీ చేస్తున్న ప్రయత్నాలు సానుకూలపడతాయని నేను అనుకోవడం లేదు"అంటూ ఇటీవల పన్నీర్ సెల్వం ఓ ప్రకటన చేశారు. అది తనను తాను మభ్యపెట్టుకునే ప్రయత్నమేననడంలో సందేహం లేదు. రజనీకాంత్ రాజకీయాల్లోకి ప్రవేశించారంటే మొదటగా తెర మరుగయ్యేది తానేనని ఆయన భయపడుతున్నారు.

## పళనిస్వామి కలవరం

ప్రస్తుతం ముఖ్యమంత్రిగా ఉన్న ఎడప్పాడి



పళనిస్వామికి అటు బీజేపీని, ఇటు రజనీకాంత్‌ను మచ్చిక చేసుకోవడం తప్ప మార్గం లేదు. ఒకవేళ రజనీకాంత్ పార్టీ పెడితే, ఆ పార్టీకి మొదట మద్దతు ఇచ్చేది, అవసరమైతే పొత్తు కుదుర్చుకునేది ఆయన నాయకత్వంలోని అన్నాడీఎంకే వర్గమే. రాష్ట్రపతి ఎన్నికలో ఎన్డీఏ అభ్యర్థికి ఓటు వేయడానికి ఆయన మారు మాట్లాడకుండా ఒప్పుకున్నారంటే అందుకు కారణం బీజేపీ సహకారం లేకుండా తాను అధికారంలో కొనసాగలేనని ఆయనకు అర్థం కావడమే. ఆయన వర్గానికి చెందిన టి.టి.వి. దినకరన్ తరచూ బీజేపీ నాయకులను కలుసుకుంటూ సన్నిహితం అవుతున్నారు. ఆయన శశికళకు బంధువు కూడా. తన మీద వచ్చిన అవినీతి కేసు విషయంలోనే కాకుండా, తమ ప్రభుత్వాన్ని కాపాడే విషయంలో కూడా ఆయన బీజేపీ అగ్రనాయకులను కలుసుకునే ప్రయత్నం చేస్తున్నారు. అయితే, అవినీతి కేసు విషయంలో తామేమీ చేయలేమని బీజేపీ నాయకులు ముందుగానే చేతులు ఎత్తేశారు.

తమ అన్నాడీఎంకే వర్గం మున్ముందు యథాతథంగా ఉంటుందా, ఇంకా కకావికలు అవుతుందా అన్నది కూడా పన్నీర్ సెల్వం, పళనిస్వామికి సందేహమే. రజనీకాంత్ గనుక రాజకీయ ప్రవేశం చేస్తే తాము తప్ప మిగిలిన సీనియర్, జూనియర్ నాయకులంతా పోలోమంటూ ఆయన పార్టీలోకి వలస పోవడం ఖాయమని వారిద్దరూ గట్టి నమ్మకంతో ఉన్నారు. కలిసిపోయి, రజనీకాంత్‌కు వ్యతిరేకంగా వ్యూహం తయారు చేసుకోగలిగితే తాము కొంత కాలం అధికారంలో నిలబడగలమని ఇద్దరికీ ఆలోచన ఉన్నా, ప్రస్తుత పరిస్థితుల్లో, అంటే అవినీతి, ఆదాయానికి మించిన ఆస్తుల కేసులు విచారణలో ఉన్న సమయంలో, చేతులు కలపడానికి ఆ రెండు అన్నాడీఎంకే వర్గాలకు మనసొప్పడం లేదు. తమిళనాడు రాజకీయ రంగం ఈ సందిగ్ధావస్థ నుంచి, సంక్షోభం నుంచి బయటపడాలంటే రజనీకాంత్ రాజకీయ ప్రవేశం చేస్తారా, చేయరా అన్నది తేలాల్సి ఉంది.

**మూడు రోజులుగా హడావుడిగా ఉన్న బ్యాంకు ప్రాంగణం చిన్నబోయింది. తాత్కాలికంగా ఏర్పాటు చేసిన తలుపులు మూసేస్తూ,**

**"పోండి, పోండి!" అని ప్రజలందరినీ వెళ్ళగొట్టాడు డీయస్పీ.**

**పది నిమిషాల్లో దాదాపు వందమంది పోలీసులు ఆ ప్రాంగణాన్ని ఖాళీ చేసేశారు.**

**నేను వెళ్తూ వెళ్తూ ఆ వ్యక్తి వైపు చూశాను. ఆ వ్యక్తి కళ్ళల్లో మెరుపు స్పష్టంగా కనిపించింది. ఇప్పుడో మరుక్షణంలోనో అతని జేబులో ఉన్న ఫోనుకు చైతన్యం వస్తుంది.**

మొత్తం పోలీసులంతా ఎక్కడి వాళ్ళు అక్కడికి వెళ్ళిపోయాక, ఒక ఇరవైమందిమి ఆ ఊరికి దూరంగా, హైవేపై ఉన్న ఒక దాబాలోకి వెనుక తలుపు గుండా ప్రవేశించి టెంపరరీ హెడ్‌క్వార్టర్స్ ఏర్పరుచుకున్నాము. అదంతా పకడ్బందీగా జరిగిపోయింది. బంధువులు ఎవరో చనిపోయారని, ఊరెళ్తున్నానని చెప్పి ఆ దాబా ఓనర్ దాబా మూసేసి బయట తాళం వేశాడు. లోపల మేము కూర్చుని ఏం చేయాలా అని ప్లాన్ చేస్తున్నాం.

ఇదంతా రహస్యంగా జరగాలి కాబట్టి పోలీస్ వెహికల్స్ అన్నింటినీ వదిలేశాం. ఒక సెవెన్ సీటర్ ఆటోను ఏర్పాటు చేసుకున్నాం. ప్రసాద్ రెండు రోజుల క్రితమే వేరే పని మీద ఊరెళ్ళాడు.

దాబాలో కూర్చున్న నాకు రాత్రి ఎనిమిది గంటలకు ప్రసాద్ ఫోన్ చేసి,

"సార్! డ్రాగన్ రాయచూర్ నుండి బయలుదేరింది." అన్నాడు.

"ఎక్కడి వరకు?"

"టికెట్ హైదరాబాదు వరకూ ఉంది."

"ఓకే! నువ్వు నా రేంజ్‌లోకి రాగానే వాకీటాకీ ఉపయోగించు. మొబైల్ సిగ్నల్స్ లేకపోయినా, మనలాగే సింహాద్రి మనుషులెవరైనా మన ఫోనులు ట్రాక్ చేసే ప్రమాదం బారిన పడకుండా ఉండేందుకూ, ముందు జాగ్రత్త" అన్నాను.

అందుకే, సింహాద్రీ, ప్రసాదూ ప్రయాణిస్తున్న రైలు, కృష్ణా స్టేషన్ ఔటర్‌లోకి రాగానే ప్రసాద్ వాకీటాకీలో మాట్లాడాడు.

మోస్ట్ ప్రాబబ్లీ సింహాద్రి ఈ స్టేషన్‌లోనే దిగాలి. లేకపోతే, మేము ప్లాన్ 'బీ' అమలు పరచాల్సి ఉంటుంది.

సిగ్నల్ ఇవ్వకపోవడంతో, రైలు ఔటర్‌లోనే ఆగింది. మళ్ళీ నాకు ఇవాళ సాయంత్రం జరిగిన విషయాలు గుర్తుకొచ్చాయి.

మేము మూటా ముల్లే సర్దుకుని పోవడం గమనించిన సింహాద్రి తాలూకు వ్యక్తి, ఆ విషయం సింహాద్రికి పాస్ ఆన్ చేసి,

"తొందరగా వచ్చి నగలు, నగదు తీసుకుపొమ్మని, మళ్ళీ ఎవరికీ అనుమానం రాకముందే, వీలయితే తెల్లవారే లోగానే రమ్మని" గట్టిగా చెప్పాడు. మరాఠీ, హిందీ కలిసిన ఆ యాస ఎవరిదో నాకు బాగా గుర్తే.

అతని మాటలకు సింహాద్రి కంగారు పడి, "ఇంకో రెండు రోజులు ఆగుదామని" అంటే మాక నూరులోని వ్యక్తి ఒప్పుకోలేదు.

"నేను మా ఊరికి పోవాలి. నాసిక్‌లో మా మామయ్యకు ఆరోగ్యం బాగాలేదు. నువ్వు రాకపోతే నేను నా వాటా నగలు, నగదు తీసుకుని పోతా"నని బెదిరించాడు.

వాళ్ళిద్దరి మధ్య మొన్నటి నుండి జరిగిన సంభాషణలన్నీ రికార్డవుతూనే ఉన్నాయి. ఈ సంభాషణ కూడా రికార్డు అయింది.

దాంతో విధి లేక సింహాద్రి, మేము మాక నూరును వీడిన రెండుగంటలకు అంటే ఎనిమిది గంటల ప్రాంతంలో, రాయచూరు నుండి ప్యాసింజర్ రైలులో బయల్దేరాడు. అతన్ని అనుసరించి ప్రసాద్ కూడా ట్రైన్ ఎక్కాడు. గత రెండు రోజులుగా ప్రసాద్ అతన్ని రకరకాల వేషాల్లో వెంబడిస్తున్నాడు. సింహాద్రి కూడా ఈ రోజు బాబా వేషంలో ఉన్నాడని ప్రసాద్ చెప్పాడు.

ప్లాట్‌ఫారం మీదకు రాబోతున్న రైలు ఒక్కసారిగా బొంయ్యిమని గర్జించేసరికి నేను ఉలికిపడి ఆలోచనల్లో నుండి తేరుకున్నాను. రైలు ఇంజన్ కనపడగానే నేను మా వాళ్ళందరినీ అలర్ట్ చేశాను.






రైలు ఆగిన తర్వాత, మాకు కావాల్సిన వ్యక్తిని పట్టుకోవడానికి ప్లాట్‌ఫారం మీదా, మరోవైపు కూడా మనుషులున్నారు. అందరూ అటెన్షన్‌లో ఉన్నారు. నా కళ్ళకున్న నైట్ గాగుల్స్ ద్వారా అంతా, అందరూ స్పష్టంగా కనిపిస్తున్నారు.

ఇంతలో ప్రసాద్ కంగారుగా ఫోన్ చేశాడు.

"సార్! స్లో కాగానే, డ్రాగన్ రైలు నుండి దూకి పారిపోయాడు సార్! నేను కూడా అతన్ని ఫాలో అవుతున్నాను సార్!" అని వగరుస్తూ అన్నాడు. పరిగెడుతున్న అడుగుల చప్పుడు వినిపిస్తోంది.

"డోంట్ వర్రీ గూర్ఖా!" అన్నాను.

"సార్!" అన్నాడు ప్రసాద్ ఆత్రుతగా.

నేను నవ్వుకున్నాను. నాకు తెలుసు డ్రాగన్ ఎక్కడికి వెళుతున్నాడో! అక్కడ డీయస్పీ తన మనుషులతో సిద్ధంగా ఉన్నాడు. అందుకే,

"జాకాల్! డ్రాగన్ నీ వైపే వస్తోంది!" అని డీయస్పీని అలర్ట్ చేశాను. నాకీ పేర్లు ఉచ్చరిస్తుంటే, అంత టెన్షన్‌లోనూ నవ్వొస్తోంది. 1970, 80 ప్రాంతాల్లో తెలుగులో వచ్చిన చీప్ కౌబాయ్ సినిమాల్లోని పేర్లలా అనిపించాయి. అందరిలోకి డీయస్పీకి 'జాకాల్' అని పేరు పెట్టినందుకు ప్రసాద్‌ను అభినందించాను.

నేను నాకు తెలిసిన విషయాలు ఎవ్వరికీ పూర్తిగా చెప్పలేదు. ఇంత క్లోజ్ అయిన యస్సై ప్రసాద్‌కు కూడా చిన్న మల్లయ్య విషయం చెప్పలేదు. ఒక జిగ్‌సా పజిల్‌లోని అన్ని గదులను నింపి పూర్తి చేసినప్పుడే ఆట ముగుస్తుంది. అంతవరకు మన దగ్గరున్న పాచికలను, పజిల్ సొల్యూషన్స్‌ను రహస్యంగానే ఉంచాలి. డీయస్పీకి 'డ్రాగన్' అంటే ఎవరో తెలియదు. కానీ, అతన్ని పట్టుకోవడానికి అక్కడ పురమాయించాను.

ఎవ్వరికీ ఏం జరుగుతోందో అర్థం కావడం లేదు. అందరూ ఊపిరి బిగపట్టి చూస్తున్నారు.

కటిక చీకటి. కేవలం నీటి అలల చప్పుడు తప్ప, అక్కడంతా నీరవ నిశ్శబ్దంగా ఉంది.

మాకనూరులో జరిగిన ఘోర విపత్తుకు సంతాపంగా ప్రకృతి కాంత కారుస్తున్న కన్నీటి చప్పుడులా వినిపిస్తోంది నదిలోని నీటి గలగలల శబ్దం.

ఆ నీటి చప్పుడులో తేడా నాకు మాత్రమే తెలుసు. నైట్ విజన్ గ్లాసులు ధరించిన వారి దృష్టి నది మీద లేదు. అందుకే అందులో ఈతకొడుతున్న వారి గురించి వారికి తెలియదు.

"సార్!" అన్నాడు డీయస్పీ.

"సార్!" అన్నాడు ప్రసాద్.

నేను ఒక్క క్షణం నది వైపు చూశాను. నేను అనుకున్న క్షణం రానే వచ్చింది. అంతే,

"యా... స్స" అని భూనభోంతరాళాలు దద్దరిల్లేటట్టుగా, దిక్కులు పిక్కటిల్లేలా అరిచాను.

వెంటనే, ఒక్కసారిగా ఆ ప్రదేశమంతా దేదీప్యమానమైన వెలుగులతో నిండిపోయింది. దాదాపు ఇరవై 10 KV లైట్ల వెలుతురులో అదొక విశాలమైన సినిమా సెట్టింగులాగా మెరిసిపోతోంది. కానీ, ఇక్కడి నది, నిజం నది. అడవి, నిజం అడవి. చుట్టూ ఉన్న పోలీసులు, నిజం పోలీసులు. వీటన్నింటి మధ్య, కృష్ణా నదీ గర్భం నుండి లాక్కొచ్చిన బ్యాంకు సొమ్ముతో నిలబడ్డ సింహాద్రి గ్యాంగు మాత్రం నిజం కాదు. వాళ్ళు దొంగలు.

లైట్లు వెలగగానే, టీవీ కెమెరాలు ఆవురావురుమంటూ షూటింగ్ మొదలుపెట్టాయి.

## జరిగిన కథ

ఇంటర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో మిడిల్ మేనేజ్‌మెంట్ స్థాయి అధికారి అతను. కేసులోకి ఎంటరయ్యాడంటే మొదటిరోజే ఫైల్లో సక్సెస్ అని రాసుకోవచ్చు. వైట్‌కాలర్ నేరాలను ఎన్నింటినో ఛేదించాడు. ఓ బ్యాంకు రాబరీ కేసు పనిమీద హైదరాబాద్ వస్తాడు. తరువాత బ్యాంకు దోపిడీ జరిగిన మాకనూరు వెళ్ళి, అక్కడంతా పరిశీలించి, కొన్ని వివరాలు సేకరిస్తాడు. ప్రణాళిక ప్రకారం ఆ ఊరిప్రజలను, పోలీసులను మోటివేట్ చేసి, అవసరమైన సమాచారం తెచ్చినవారికి లక్ష రూపాయల రివార్డ్ ప్రకటిస్తాడు. నేరస్థుడు ఎవరో తెలియటంతో, అతని కోసం మాటు వేస్తాడు ఆ అధికారి.

ఆ తర్వాత....

దేశంలో అతి విచిత్రమైన బ్యాంక్ దోపిడీకి సంబంధించిన దృశ్యాలను మింగేస్తూ, ప్రపంచానికి లైవ్ రిలే ద్వారా అందిస్తున్నాయి. ఒకటి రెండు నేషనల్ ఛానల్స్, దాదాపు అన్ని ప్రాంతీయ ఛానళ్ళ రిపోర్టర్ల వ్యాఖ్యానాలతో ఆ ప్రాంతమంతా దద్దరిల్లిపోయింది.

చిమ్మ చీకటిలో, దొంగ సొమ్ముతో పారిపోదామనుకుని, నదీ గర్భం నుండి నగలు, నగదు తీసుకుని ఒడ్డుకు వచ్చిన సింహాద్రి, అతని బంధువు, మాకనూరులో టీ అమ్మే పాటిల్ ఒక్కసారిగా లైట్లు వెలిగే సరికి విస్తుపోయారు. ఆశ్చర్యంతో దిమ్మ తిరిగి నిశ్చేష్టులై నిలబడ్డారు. ముగ్గురి చేతుల్లో ఆరు బరువైన పెద్ద పెద్ద ప్లాస్టిక్ బ్యాగులున్నాయి. వాటిల్లో మాకనూరు బ్యాంకులో ప్రజలు దాచుకున్న నగలు, నగదు నిక్షేపంగా, భద్రంగా ఉన్నాయి. వాళ్ళు ముగ్గురూ వెర్రి ముఖాలేసుకుని, ఆటలో బొమ్మల్లా నిలబడ్డారు. పారిపోయే ప్రయత్నం కూడా చేయలేదు.

డీయస్పీ కోపం పట్టలేక వాళ్ళ చెంపలు వాయించాడు. అప్పుడు మాత్రం టీవీ కెమెరాలు ఏదో పని ఉన్నట్టుగా కృష్ణానది వైపు చూశాయి. రైల్వే పోర్టర్ వేషంలో ఉన్న ప్రసాద్ వాళ్ళ ముగ్గురికీ బేడీలు వేశాడు.

ఇంతలో, చేతిలో ఉన్న సెల్‌ఫోన్ అదే పనిగా మోగసాగింది.

వనజ... బెంగుళూరు నుండి.

"బాస్! కంగ్రాట్స్! యూ డిడ్ ఇట్ అగైన్ బాస్!" అని ఆనందం పట్టలేక అరవసాగింది. ఇంతలో బాస్ దగ్గర నుండి ఫోన్ వస్తున్నట్టుగా బీప్ సౌండ్ రావడంతో, వనజను హోల్డ్‌లో పెట్టాను.

ఆయన "వెల్ డన్ మై బోయ్!" అన్నాడు. ఇంతలో దుగ్గల్ కూడా ఫోన్ చేశాడు.

"ఐయాం ఆన్ మై వే రా! ప్రెస్‌మీట్‌లో నేనే మాట్లాడుతాను." అన్నాడు.

నేను నవ్వుకున్నాను.

'ఎంతటివాడికైనా పబ్లిసిటీ పిచ్చే!' అనుకున్నాను.

నదీతీరంలో చీకట్లు విచ్చుకుంటున్నాయి. తను ఇంకా రాకముందే ఇంత వెలుగు ఎక్కడిదా అని

ఆశ్చర్యపోతూ సూర్య భగవానుడు పరుగు పరుగున వచ్చేస్తున్నాడు.

ఇంతలో పొలాలకు వెళ్ళే రైతులు, ఆసాములు, నదీతీరంలో ఈ హడావుడి అంతా గమనించి ఊరి ప్రజలకు ఉప్పందించారు. పది నిమిషాల్లో ఊరు ఊరంతా అక్కడికి చేరుకుంది.

నది ఒడ్డు అంచున నీళ్ళల్లో తడిసిన బట్టల్లో నిలబడ్డ సింహాద్రి, అతని బంధువు, తమ ఊరివాడే అని నమ్మి ఆదరించిన పాటిల్, వాళ్ళ చేతుల్లో ప్లాస్టిక్ బ్యాగుల్లో ఉన్న తమ కష్టార్జితమైన నగలు, నగదును చూసి భోరుమన్నారు. అరుపులు, కేకలతో ఆ ప్రాంతమంతా దద్దరిల్లింది. సంతోషం పట్టలేక స్త్రీలు ఏడుస్తున్నారు. కొంతమంది ముసలి వాళ్ళయితే ఛాతీని లయబద్ధంగా కొట్టుకుంటూ ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నారు.

నేను సైగ చేశాను. ప్రసాద్, డీయస్పీ కలిసి దొంగలందరినీ ఒక వ్యానులోకి, నగదు నగలను మరొక పోలీస్ వ్యానులోకి ఎక్కించి దూరంగా తీసుకుపోయారు. మాబ్ ఎక్కువై, ఉద్రేకాలు ఎక్కువయితే ప్రజలను కంట్రోల్ చేయలేము.

ఛానల్స్ వాళ్ళు, షూటింగ్ అయిపోగానే, ఇక అఫీషియల్ అనౌన్స్‌మెంట్ కోసం హడావుడి చేయసాగారు.

నేను వారిని కాసేపు వెయిట్ చేయమని చెప్పి, వారందరికీ కాఫీలు సరఫరా చేయమని బ్యాంకు సిబ్బందికి పురమాయించాను.

నది ఒడ్డున, ఇంకా పూర్తిగా తెల్లవారకముందే, చీకట్లు విచ్చుకుంటున్న సమయాన, ఒక చారిత్రాత్మకమైన ఘట్టాన్ని లైవులో చిత్రీకరించిన వాళ్ళు కూడా ఉద్విగ్నంగానే ఉన్నారు.

ఆ టైములో పొగలు కక్కుతున్న కాఫీ గనుక గొంతులో పడితే భలే రొమాంటిక్‌గా ఉంటుందని పించింది.

మనుమలకు చెప్పుకుంటారు. నేను కూడా నా మనుమలు, ముని మనుమలకు చెప్పుకునే కథల్లో నేనే హీరోనని చెప్పుకుంటాను.

డీయస్పీ, ప్రసాద్, దుగ్గల్, చిన మల్లయ్య ఇలా ఎవరికి వారు తమ కథల్లో తామే హీరోలై పోతారు.

# లాకర్ నెం.369

## కూపన్ నెం.1 విజేత

**డి.పద్మ**
**మందమర్రి, మంచిర్యాలజిల్లా**

చివరకు సింహాద్రి, పాటిల్ కూడా హీరోలుగానే ఫీలయిపోతారు, కొన్ని రోజుల ఇనీషియల్ షాక్ తర్వాత.

నేను ఆలోచనల్లో ఉండగానే దుగ్గల్ రానే వచ్చాడు.

ఆ నదీతీరంలోనే ప్రెస్‌మీట్ అరేంజ్ చేయించాను.

నేనూ, దుగ్గల్ కూర్చున్నాం. డీయస్పీ ఒకటే సైగలు చేస్తున్నాడు తనను కూడా పిలవమని. దుగ్గల్‌కు చెప్పి అతన్ని కూడా కూర్చోబెట్టుకున్నాం. మా ముందర అన్ని ఛానల్స్ మైకులూ ఉన్నాయి. మా వెనకాల సింహాద్రి, అతని బంధువు, పాటిల్‌ను నిలబెట్టారు.

కొంచెం దూరంలో బ్యాంకు మేనేజర్, హెడ్ క్యాషియర్ నిలబడ్డారు. బ్యాంకు జోనల్ మేనేజర్ ఈ మహత్తర క్షణాలను వదులుకోలేడు కాబట్టి హైదరాబాదు నుండి బయలుదేరి వస్తున్నానని, ప్రెస్ మీటింగు అప్పటి వరకూ ప్రారంభించవద్దని చాలాసేపటి కింద చెప్పాడు. కానీ, దుగ్గల్ ఇంక వెయిట్ చేయడం ఇష్టం లేక అతని అభ్యర్థనను కొట్టి పారేసి, మీటింగ్ ప్రారంభించాడు. జోనల్ మేనేజర్ వస్తే, ప్రెస్ వారి దృష్టి అతని మీదకు మళ్ళుతుంది. అది దుగ్గల్‌కు ఇష్టం లేదు. ప్రెస్, టీవీ వాళ్ళ దృష్టి, అటెన్షన్ అంతా తన మీదే ఉండేలా ప్లాన్ చేశాడు.

అతను మైక్ చేతిలోకి తీసుకుని,

"సో! వెల్‌కం ఫ్రెండ్స్! ఇట్స్ ఏ గ్రేట్ డే ఇన్ మై లైఫ్!" అంటూ ప్రారంభించాడు.

**జరిగిన ఘోర విపత్తుకు సంతాపంగా ప్రకృతి కాంత కారుస్తున్న కన్నీటి చప్పుడులా వినిపిస్తోంది నదిలోని నీటి గలగలల శబ్దం. ఆ నీటి చప్పుడులో తేడా అతనికి మాత్రమే తెలుసు. అందరూ అతనివైపే చూస్తున్నారు. కానీ అతను మాత్రం నదిని చూస్తున్నాడు. నదిలో ఈతకొడుతున్న వారిని చూస్తున్నాడు. అనుకున్న క్షణం రానేవచ్చింది. అంతే... ఒక్కసారిగా దిక్కులు పిక్కటిల్లేలా అరిచాడు. అతను ఎందుకలా అరిచాడు? అసలక్కడ ఏం జరుగుతోంది?**

సమయం సరిగ్గా ఆరు. గత తొంభై ఆరు గంటలుగా నా కనురెప్ప వాలలేదు. కేసు విజయవంతంగా సాల్వ్ అయ్యేసరికి ఎంతో టెన్షన్‌తో గడిపిన క్షణాలు మాయమై మనసంతా శూన్యంగా తోచింది.

నా కెరీర్‌లో, నాకు ఇదొక కేసుగా మాత్రమే గుర్తుండి పోతుంది. కానీ, మాకనూరు ప్రజల జీవితాల్లో ఇదొక అపూర్వమైన ఘట్టం. కొన్ని తరాల సంతతి వరకూ ఈ సంఘటనను కథలు కథలుగా చెప్పుకుంటారు. వారు చెప్పే కథల్లో నేనుండను. ఎవరికి వారే కథానాయకులై తాము ఏ విధంగా దొంగలను పట్టుకున్నారో తమ మనుమలు, ముని

ఈ కేసు సాల్వ్ చేయడంలో తనే విధంగా కష్టపడిందీ చెప్పాడు. మొత్తం క్రెడిట్ అంతా తనూ, తన పోలీస్ డిపార్టుమెంట్‌కే దక్కేలా క్యాష్ చేసుకునే ప్రయత్నం చేస్తున్నాడు.

ఆ విషయం నాకు అర్థమవుతూనే ఉంది. అందుకు నాకు అభ్యంతరం కూడా లేదు. ఎందుకంటే, దుగ్గల్ ప్రభుత్వ సర్వీసులో, ఒక ముఖ్యమైన హోదాలో ఉన్నాడు. లోకల్ అధికారిగా విధులు నిర్వహిస్తున్నాడు. ఈ కేసును సాల్వ్ చేసిన కీర్తి అతనికి దక్కితే, దుగ్గల్‌కు మంచి పేరొస్తుంది. సర్వీస్ రికార్డు మెరుగు పడుతుంది. ప్రమోషన్లలో, ప్రభుత్వం ఇచ్చే సేవా పతకాలలో ప్రాధాన్యం లభిస్తుంది.

నా వరకు నాకు దొంగ సొమ్ము రికవరీ కావడం, బ్యాంకు పరువు కాపాడడం, నా కంపెనీకి పేరు ప్రతిష్ఠలు తేవడం... ఇవే నాకు ముఖ్యం. టీవీల్లో కనిపించడానికి పెద్ద ప్రాముఖ్యం లేదు నా దృష్టిలో. అందుకే, దుగ్గల్ ఎన్ని కోతలు కోస్తున్నా నాకు అభ్యంతరం లేదు. నేను సంతృప్తిగా, సంతోషంగా ఉన్నాను.

కానీ, ప్రెస్ వాళ్ళు దుగ్గల్‌ను ప్రశ్నలతో ఉక్కిరిబిక్కిరి చేయడంతో, విధిలేక, సమాధానం చెప్పలేక,

"ఇతను నా ఫ్రెండ్! ఈ కేసును డీల్ చేస్తున్న సెక్యూరిటీ ఏజెన్సీలో సీనియర్ ఆఫీసర్. వీరి సహాయంతోనే మేము ఈ కేసు సాల్వ్ చేయగలిగాం. హీ విల్ ఆన్సర్ ఆల్ యువర్ క్వశ్చన్స్." అంటూ మైక్ నాకు అందించాడు.

"దొంగ సొమ్ము నదిలో దాచిపెట్టాడని మీకు ముందే తెలుసా?";

"ఈ దొంగతనంలో బ్యాంకు వాళ్ళ ప్రమేయం ముందా?";

"ఊరివారెవరైనా ఇందులో ఇన్వాల్వ్ అయ్యారా?";

"బ్యాంకు మేనేజర్ని సస్పెండ్ చేశారా?"

అంటూ ప్రశ్నల వర్షం కురిపించారు.

ప్రెస్ వాళ్ళు, ఛానల్ వాళ్ళతో ఒక చిక్కుంది. వాళ్ళు వాళ్ళంత తెలివిగల వాళ్ళు ప్రపంచంలో మరొకరు లేరనుకుంటారు. వాళ్ళయితే ఇట్లాంటి కేసును చిటికెలో సాల్వ్ చేసే వాళ్ళమన్న భ్రమలో ఉంటారు. పోలీసులకు మెదడు మోకాళ్ళలో ఉంటుందనుకుంటూ ప్రశ్నలు సంధిస్తూ ఉంటారు. కానీ, ట్రాఫిక్ కానిస్టేబుల్ స్కూటర్ ఆపితే ఆ సమయంలో పానిక్ అయి కమీషనర్ తెలుసునని, వదిలేయమని బ్రతిమిలాడుతుంటారు.

నేను ఇవన్నీ హైదరాబాద్ సిటీ డీసీపీగా ఉన్నప్పుడు రుచి చూసిన అనుభవాలే.

నేను మైక్ తీసుకుని, అందుకే, కూల్‌గా,

"ఈ కేసు సాల్వ్ చేయడంలో యస్పీ దుగ్గల్ గారూ, డీయస్పీ గారూ, యస్సై ప్రసాద్ గార్ల కృషి అమోఘం. ఈ జిల్లా పోలీసులు అత్యంత ప్రతిభావంతులు. వారి సహాయంతోనే ఈ దొంగతనాన్ని ఛేదించగలిగాం."

మొత్తం మహబూబ్‌నగర్ పోలీసులంతా ఆనందబాష్పాలు కార్చి ఉంటారు, నా మాటలు విని. నాక్కావాల్సింది కూడా అదే! పెద్ద వాళ్ళకు ఎలాగూ మెడల్స్ వస్తాయి. కానీ, చిన్న ఉద్యోగులకు కనీసం మాటల మెప్పు అన్నా ఉండాలి. అది వాళ్ళల్లో 'మొరేల్' పెంచుతుంది. కానీ, అది కొరవడినందుకే కిందిస్థాయి పోలీసులు ప్రజలతో కర్కశంగా వ్యవహరిస్తుంటారు.

"దొంగతనం జరగగానే అలర్ట్ అయి ఉంటే ఇంత ఆలస్యం జరిగి ఉండేది కాదు. బ్యాంకులో దొంగిలించబడిన సొమ్ము వంద కిలోల బంగారం, యాభై కోట్ల రూపాయలని మాకు రిపోర్టు వచ్చింది. అంత సొమ్మును, సుమారు రెండు వందల కిలోల బరువున్న మూటలను, బ్యాంకు ప్రెమిసెస్ నుండి తరలించడం ఒక్కడి వల్ల సాధ్యం కాదు. అందుకే ఎవరో ఒక బయటి వ్యక్తి హస్తముందని అనుమానించాను. మాకనూరు ప్రజలు బాగా చైతన్యవంతులు. శనివారం మధ్యరాత్రి వరకు బ్యాంకులో లైట్లు వెలుగుతున్నాయని గమనించారు. అనుమానం వచ్చి అక్కడే కాపు కాశారు. సింహాద్రి, అతని తోడు దొంగలూ, ఆ రాత్రి బరువైన సంచులతో రైల్వే స్టేషనుకు వెళ్ళడం చిన మల్లయ్య వంటి కొంతమంది గమనించారు. కానీ, సింహాద్రి బ్యాంకు ఉద్యోగి కావడంతో, వారికి దొంగతనం జరిగిందన్న అనుమానం రాలేదు. సింహాద్రి అండ్ కో ఆ రాత్రి దొంగ సొమ్ముతో ఉడాయించే వాళ్ళే కానీ, ఆ రాత్రి రైల్వే పోలీసుల స్పెషల్ డ్రైవ్ ఉండడంతో ట్రైన్‌లో, స్టేషన్‌లో రైల్వే పోలీసులు పహారా కాస్తుండడంతో రైలు ఎక్కడానికి భయపడ్డారు. వాళ్ళకేం చేయాలో తోచలేదు. వాళ్ళు వేసుకున్న ప్లాన్ 'బీ' ప్రకారం, రైల్వే ప్లాట్‌ఫారం చివరి వరకు నడిచి, మొత్తం సొమ్మునంతా తమతో తెచ్చుకున్న వాటర్ ప్రూఫ్ ప్లాస్టిక్ సంచుల్లో నింపి, తాళ్ళతో కట్టి కృష్ణా నది గర్భంలో పాతి పెట్టారు. గుర్తుగా అక్కడో పెద్ద చెట్టు కొమ్మను నాటారు. సంచులు ఎటూ పోకుండా తాళ్ళతో దగ్గరలో ఉన్న రాళ్ళకు కట్టేశారు.

ఇక్కడ నదికి ప్రవాహం అసలే లేకపోవడంతో అవి భద్రంగా ఉన్నాయి. కానీ, నదిలో దొంగ సొమ్ము దాచి పెట్టడమన్న ఆలోచన వాళ్ళకు ఎలా వచ్చిందో తెలియదు. బహుశా, నదికి ప్రవాహం లేకపోవడం గమనించి ఆ నిర్ణయానికి వచ్చి ఉంటారు. ఏమైనా సరే, ఆ ఐడియా ఇంట్రెస్టింగ్. దీంతోనే వీళ్ళు మామూలు దొంగలు కారన్న విషయం కూడా బోధపడుతోంది. ఎందుకంటే, ప్రొఫెషనల్సే 'ప్లాన్ బీ' రెడీగా ఉంచుకుంటారు.

ఆ రాత్రి గడిచి తెల్లవారితే, దొంగతనం జరిగిన విషయం బయటపడితే ముందుగా తననే అనుమానిస్తారని ఊహించి సింహాద్రి, అతని బంధువు రాత్రికి రాత్రే కర్నూలుకు పారిపోయారు. ఇక్కడి విషయం గమనించి తమకు తెలియచేస్తుండమని పాటిల్‌ను ఇక్కడే ఉంచారు. బ్యాంకు దొంగతనం జరగగానే మాకనూరులో పోలీస్ గస్తీ ఎక్కువైంది. దానికి తోడు అనుమానం తనమీదకే రావడంతో, సింహాద్రి ఊళ్ళోకి వచ్చి నగలను తీసుకుపోయే సాహసం చేయలేదు.

మేమూహించినంత తెలివితక్కువ వాడు కాదు సింహాద్రి. మేము వాళ్ళ స్వంత ఊరికి వెళ్తాడేమోనని అక్కడ నిఘా పెంచాం. కానీ, సింహాద్రి వాళ్ళ ఊరికి వెళ్ళలేదు. అతనూ, అతని బంధువూ కలిసి ఉంటే ప్రమాదమని, విడిపోయి అనేక ఊళ్ళు తిరిగారు. కోడ్ భాషలో మాట్లాడుకున్నారు. అయితే, నాలుగ్గోరోజు రాత్రి నుండే మేము సింహాద్రి, అతని బంధువు, పాటిల్ ఫోన్లు ట్రాక్ చేసి, ట్యాప్ చేసి, వాళ్ళు మాట్లాడుకున్న మాటలన్నీ రికార్డు చేశాం. కానీ, మేం ఇక్కడే క్యాంపు వేసుకుని ఉండడంతో దొంగసొమ్ము తీసుకోవడానికి రావడం లేదని గ్రహించి, క్యాంపు ఎత్తి వేశాం. పరిస్థితులు చేయి దాటిపోతాయేమోనని పాటిల్ తొందరపెట్టడంతో, మేము అక్కడి నుండి బిచాణా ఎత్తేసి దగ్గరలోనే మరో స్పాట్‌లో సమావేశమయ్యాం.

మా ఆఫీసర్లు సింహాద్రిని, అతని బంధువును, పాటిల్‌ను అనుక్షణం ఫాలో అవుతూనే ఉన్నారు.

మా పాచిక పారింది. వాళ్ళు మా ట్రాప్‌లో చిక్కారు.

చివరకు, ఇదిగో, ఇలా మీ ముందు దోషుల్లా నిలబడ్డారు."

ఇంతలో జోనల్ మేనేజర్ పరుగుపరుగున ప్యాంట్ సర్దుకుంటూ వచ్చి, మాతో జాయినయ్యాడు.

'ప్రమోషన్ ఎక్కడ రాకుండా పోతుందోననీ, కోల్‌కతాకు ఎక్కడ ట్రాన్స్‌ఫర్ ఆగిపోతుందోననీ తప్పితే నగలు, నగదు పోయినందుకు కించిత్తు బాధపడని జోనల్ మేనేజర్ అసలు సమయానికి,

---

**ఈవారం లాకర్ నెం. 369 చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## లాకర్ నెం. 369-3 (12-7-2017)

మా ప్రశ్న: దొంగిలించిన సొమ్మునంతా వాటర్‌ప్రూఫ్ ప్లాస్టిక్ సంచుల్లో నింపి ఎక్కడ పాతిపెట్టారు?

మీ జవాబు------------------------------------------------------------

చిరునామా------------------------------------------------------------

---------------------------------------------------------------------

--------------------------------పిన్--------------------ఫోన్‌నెం--------------------

ఈ కూపన్‌ను 11 జూలై 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

**వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్ స్టోర్స్ మెయిన్‌రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...**

*నిబంధనలు వర్తిస్తాయి

టీవీల్లో కనిపించే ప్రెస్‌మీటుకు మాత్రం ఠంచనుగా హాజరయ్యాడు. ఇప్పుడు క్రెడిట్ కొట్టేయడానికి వచ్చిన అతన్ని చూసి నాకు ఒళ్ళు మండింది. ఇన్ని రోజులుగా ఏ మాత్రం పట్టించుకోకుండా, కనీసం ఈ నాలుగు రోజులుగా ఫోన్ కూడా చేయని మనిషి, ఇప్పుడు పళ్ళికిలిస్తూ రావడంతో నాకు కోపం నషాళానికి ఎక్కింది. దానికి తోడు, ఆ బ్యాంకు మీదున్న అసహనాన్ని వెళ్ళగక్కే అవకాశం దొరికింది. అందుకే, ఆయన్ని చూస్తూ,

"ఈ మొత్తం ఎపిసోడ్‌లో మొదటి దోషి బ్యాంక్ మేనేజిమెంటే! ఇన్ని నగలూ, ఇంత నగదూ బ్యాంకు ఛెస్ట్‌లో పెట్టుకోవడం అంటే పేలడానికి సిద్ధంగా ఉన్న బాంబును పక్కలో పెట్టుకుని పడుకున్నట్టే. రూల్స్ ప్రకారం వీటన్నిటినీ ఎప్పుడో హైదరాబాద్‌లోని మెయిన్ బ్రాంచికి, కరెన్సీ ఛెస్టుకు తరలించాల్సి ఉంది. పోనీ, ఇక్కడే ఉంచినా ఎంత అలర్ట్‌గా ఉండాలి! కనీసం ఒక్క సెక్యూరిటీ గార్డ్ కూడా లేడు. పోలీస్ అలారం లేదు. పోలీస్ బీట్ ఎందుకు ఆగిపోయిందో కనుక్కునే నాథుడే లేడు. సీసీటీవీలు ఎందుకు పనిచేయడం లేదో అడిగే దిక్కే లేదు. జోనల్ ఆఫీసులో మొహంతి అనే సెక్యూరిటీ ఆఫీసర్ ఉన్నాడు. అతని పనే ఇది. ఇవన్నీ మరిచిపోయి అతను హాయిగా బ్యాంకు టైములో క్యారమ్ బోర్డు ఆడుకుంటున్నాడు. ఇక్కడేమో మేనేజర్ లేడు, హెడ్ క్యాషియర్ లేడు. ఇంత సొమ్మున్న లాకర్ రూము తాళం చెవులు టేబుల్ మీద పడేసి వెళ్ళిపోతారు. వాటీజ్ దిస్? ఇదేమైనా సులభ్ కాంప్లెక్సా? మీరు దొంగలకు ఇన్విటేషన్ పంపడమొక్కటే తక్కువైంది. ఇదంతా చూస్తుంటే ఎవరో కావాలని చేసినట్టే అనిపిస్తోంది. ఈ సింహాద్రి కాకపోతే మరొకడెవడో ఎప్పుడో ఒకప్పుడు దోచేసేవాడే. ఈ సింహాద్రికి కూడా బుద్ధి లేదు. దోచిన సొమ్మంతా ఇక్కడే దాచిపెట్టాడు, మీ అదృష్టం బాగుండి. లేకపోతే, అందులో నుంచి ఎంతో కొంత తీసుకుని వెళ్తే, అప్పుడు.... నా సామి రంగా..... ప్రజలే ఈ బ్యాంకు వాళ్ళ భరతం పట్టేవారు...." అంటూ ఆవేశంగా ఇంకా ఏదో మాట్లాడబోతుంటే దుగ్గల్ టేబుల్ కింద నుంచి నా కాలు మీద చెయ్యేసి, 'కూల్ మ్యాన్!' అని మెల్లిగా అన్నాడు. నేను చటుక్కున ఆవేశం తగ్గించుకుని విలేకర్లు అడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పాను.

ఇంతలో,

"మీరు ఇన్ఫార్మర్లకు నగదు బహుమతులు ప్రకటించారని విన్నాం. నిజమేనా?" అని ఒక విలేకరి ప్రశ్నించాడు.

"అవును. బాగా గుర్తు చేశారు" అంటూ, నా సూట్‌కేసు తెరిచి, దుగ్గల్ వైపు తిరిగి,

"ఐ నౌ రిక్వెస్ట్ శ్రీ దుగ్గల్ గారూ టు హ్యాండోవర్ వన్ లాక్ రూపీస్ చెక్స్ టూ...."

అంటూ దుగ్గల్ చేతుల మీదుగా చిన్న మల్లయ్య, యష్షె ప్రసాద్, డీయస్పీ, మాకనూరు పోలీస్ డిపార్ట్‌మెంట్ వెల్ఫేర్ ఫండ్, మాకనూరు గ్రామ పంచాయతీలకు, మరో ఇద్దరికి తలా లక్ష రూపాయల చొప్పున చెక్కులు అందచేశాను.

చెక్కులు అందుకున్న వారి ముఖాలలో ఆనందం వెల్లివిరుస్తోంది. వారి కళ్ళు మెరుస్తున్నాయి.

కానీ, నా కళ్ళు మండిపోతున్నాయి.

నా కళ్ళు మూతలు పడిపోతున్నాయి.

***

కారు హైదరాబాద్ నగరం చేరుతుండగా నాకు మెలకువ వచ్చింది. సమయం చూస్తే మధ్యాహ్నం మూడవుతోంది.

'మాకనూరు' నుండి బయల్దేరి నాలుగైదు గంటలవుతోంది. మధ్యలో మహబూబ్‌నగర్‌లోని దుగ్గల్ క్యాంప్ ఆఫీసులో ఆగి గ్రీన్ టీ తాగి, కొన్ని పోలీస్ ఫార్మాలిటీస్ పూర్తి చేశాను.

అక్కడి వరకు తోడుగా వచ్చిన ప్రసాద్ 'ఇక ఉంటానని' చెప్పి ఆగిపోయాడు. నేను ముందుకు సాగిపోవాల్సిందేగా!

చాలా వరకు ఒక విపత్కర పరిస్థితిలో ఏర్పడిన సంబంధాలు శాశ్వత బంధాలుగా పరిణతి చెందవు. ఆ ఉత్కంఠభరిత క్షణాలు దాటగానే ఎవరి 'షెల్స్'లోకి వారు వెళ్ళి పోతారు. ఏదయినా కారు లేదా విమాన ప్రమాదం కానీ, అగ్ని ప్రమాదం గానీ జరిగినప్పుడు పక్కనున్న వాడే, డ్రైవర్ అయినా సరే పైలట్ అయినా సరే, ఆత్మీయుడుగా అనిపిస్తాడు. ఆ సమయంలో ఎంతో ప్రాణప్రదంగా దాచుకున్న రహస్యాలను కూడా వారికి చెప్పేస్తారు. కానీ, ఆ ప్రమాద తీవ్రత తగ్గగానే, ఎవరి సామాజిక స్థాయిల్లోకి, అంతస్తుల్లోకి వారు దూరిపోయిన తర్వాత, ఆ స్థాయి, ఆ అంతస్తుల దృక్కోణం నుండే ఆ ప్రమాద సమయంలో ఏర్పడిన తాత్కాలిక బంధాన్ని కొనసాగించాలా? లేదా? అని విశ్లేషించుకుంటారు. అంతకు ముందు, వారికి రహస్యాలు చెప్పడం మూలంగా భవిష్యత్తులో ఏమైనా విపత్కర పరిస్థితులు ఎదురవుతాయేమోనని కూడా భయపడే ఉదంతాలు అనేకం. ఉదాహరణకు, ఆ డ్రైవర్ కలవడానికి వచ్చినా పలకరించడానికి సంశయిస్తారు. ఏ ఫేవర్ కోసం వచ్చాడోనని అనుమానపడతారు.

ఇదీ అంతే! ఒక దుర్భేద్యమైన కేసు పరిష్కరించాల్సిన తరుణంలో, ప్రసాద్‌తో క్లోజ్‌నెస్ ఏర్పడింది. ఆ కేసు ముగియగానే, నేను దుగ్గల్‌తో కలిసి అఫీషియల్ కారులో కూర్చుంటే, తను కాన్వాయ్‌లో ఎక్కడో వెనుక ఉండాల్సిన పరిస్థితి ఏర్పడింది. మా అంతస్తుల్లో, సామాజిక హోదాలో మార్పు వచ్చేసింది.

మా మధ్య 'ఈగిల్', 'గూర్ఖా' బంధానికి ఫుల్‌స్టాప్ పడిపోయింది. 'ఈగిల్' ఇప్పుడు 'గూర్ఖా'కు అందని ఆకాశంలో విహంగమై ఎగిరిపోతోంది.

ఈ ఆలోచనలతోనే, నేను నేరుగా బంజారాహిల్స్‌లోని బ్యాంక్ జోనల్ ఆఫీసుకు బయల్దేరాను.

**(ఇంకావుంది)**



## కృతి ఆశలు ఫలించేనా?

కృతి కర్బందాకు శాండిల్‌వుడ్‌లో మంచి పేరే ఉంది. కానీ టాలీవుడ్‌లోనే ఆమెకు కాలం కలిసిరాలేదు. దాంతో దక్షిణాదిలో తన సత్తా చాటడం కుదరదని బాలీవుడ్‌కి వెళ్ళింది. అక్కడ అరాకొరా సినిమాలు చేస్తూ బాగానే పేరు తెచ్చుకుంది. నటనకి తోడు భగవంతుని కృప కూడా తోడవ్వాలనుకుందో ఏమో మొన్నా మధ్య 'గెస్ట్ ఇన్ లండన్' హిందీ సినిమా కోసం సుదీర్ఘకాలం లండన్‌లో గడిపింది. ఆ సమయంలో అక్కడ ఉన్న గురుద్వార్‌కి వెళ్ళి గురుద్వార్‌ని శుభ్రం చేసే పనిలో పాలు పంచుకుంది కూడా! ఈ సారైనా ఈ సినిమా మంచి విజయం సాధించి మరిన్ని అవకాశాలు వెతుక్కుంటూ వస్తాయని కృతి ఆశపడుతోంది.

'పెద్దింటోళ్లు శ్మశానానికి రారమ్మ!.. మీరేంటి వచ్చారు..'

శ్మశానంలో ఈ పలకరింపు సర్రియలిస్ట్‌గా అనిపించింది. ఏం చెప్పాలో అర్థం కాలేదు. ఒక వెర్రినవ్వు నవ్వి ఊరుకున్నా. నిజమే! ఇప్పటికీ పల్లెల్లోను, చిన్న పట్టణాల్లోను అగ్రవర్ణాలకు చెందిన స్త్రీలు శ్మశానం దరిదాపుల్లో కనిపించరు. కానీ హైదరాబాద్ పరిస్థితి వేరు.




# అందరూ ఇక్కడకు రావాల్సినవాళ్ళే!

మా కజిన్ బ్రదర్ చనిపోతే చివరిసారి చూడటానికి శ్మశానానికి వెళ్లా. కాస్మోపాలిటన్ బతుకుల్లో చాలా సందర్భాలలో చివరి పలకరింపులు శ్మశానాల్లోనే! మగవాళ్లు చితి దగ్గరకు వెళ్లారు. మేము కొంతమంది శ్మశానం మొదట్లో రావి చెట్టు కింద రచ్చబండ మీద కూర్చున్నాం. దూరంగా చిన్న చిన్నగా ఏడుపులు.. డప్పుల శబ్దాలు.. రోడ్డు మీద వాహనాల రణగొణ ధ్వని.. శ్మశాన నిశ్శబ్దం మాత్రం ఎక్కడా లేదు.

### అలవాటైపోయింది

రావి చెట్టు పక్కనే ఒక కుర్చీలో కూర్చుని రిసీట్‌లు రాస్తున్న వ్యక్తి నావైపు చూసి పలకరింపుగా నవ్వి 'సాఫ్ట్‌వేరా అమ్మా! ఏ కంపెనీ..మా అమ్మాయి ఇంజినీరింగ్ సెకండియర్..' అన్నాడు. నాకు ఏం సమాధానం చెప్పాలో అర్థం కాలేదు. 'అవును..' అన్నాను ముక్తసరిగా. కుర్చీ వెనక 'కాంటాక్ట్ సీతాపతి..' అని నెంబర్ వేసి ఉంది. 'సీతాపతంటే ఇతనేనేమో!' అనుకున్నా. నేను ముభావంగా ఉండటం చూసి అనుకుంటా.. కాసేపు ఏం మాట్లాడలేదు. ఇంతలో పెద్ద గాలి వచ్చింది. అతని కుర్చీ పక్కన పెట్టిన రిసీట్‌లన్నీ ఎగిరిపోయాయి. కొన్ని నా కాళ్ల దగ్గరకు వచ్చి పడ్డాయి. వాటిని ఏరి అతనికి ఇచ్చా. ఆ రిసీట్‌లు చూస్తే ఆసక్తిగా అనిపించింది. 'రోజుకు ఎన్ని శవాలు వస్తాయి అనబోయి.. ఆగి ఎంత మంది వస్తారు? అన్నా. 'చెప్పలేం. కొన్ని రోజులు ఒకటే ఉంటుంది. ఇంకొన్ని రోజులు దండిగా లేస్తాయి. ఈ రోజు మీది ఎనిమిదోది..' అన్నాడు. నా పక్కనే కూర్చున్న మా కజిన్ 'మీదే ఊరు? మీరు జీహెచ్ఎంసీ ఎంప్లాయా?' అని అడిగింది. 'అవునమ్మా! జీహెచ్ఎంసీనే.. మాది గుంటూరు పక్కన చిన్న పల్లెటూరు..' అని తేల్చేశాడు. 'సంపాదన బానే ఉంటుందా?' అని సంభాషణ పొడిగించింది. 'మా ఫీజు నాలుగు వేలు.. కట్టెలు, కిరోసిన్ అన్నీ మావే. క్యాష్ పార్టీ దగ్గర ఆరువేలు తీసుకుంటాం. లేకపోతే ఐదువేలు.. మరీ గరీబోళ్లయితే ఎంత ఉంటే అంత ఇస్తారు.. ఎవ్వరినీ ఇంత ఇమ్మని అడగం..' అని ఒక క్షణం ఆగాడు సీతాపతి. 'ఎంత సంపాదిస్తే ఏంటమ్మా.. అందరూ ఇక్కడికి రావాల్సిన వాళ్లే కదా..' అన్నాడు. 'ఆ రావటంలో కూడా తేడా ఉంటుంది కదా..' అని రెట్టించింది మా కజిన్. 'ఇక్కడ అడుగుపెట్టే దాకానే ఆ వైభోగమంతా..ఆ తర్వాత ఎవరైనా అక్కడ పడుకోవాల్సిందే..' అన్నాడు దూరంగా మండుతున్న చితులను చూపించి. ఒక్క క్షణం నాకు భయమేసింది. అది నా మొహంలో స్పష్టంగా కనిపించినట్లుంది. 'నేను చేరిన మొదట్లో నాకూ భయమేసేది. సాయంత్రం ఐదు కాగానే ఇంటికి వెళ్లిపోయేవాడిని. ప్రతి రోజూ ఉదయం శివాలయం వెళ్లేవాడిని. అప్పుడీ మల్కాజ్‌గిరిలో ఉన్న ఇళ్లూ తక్కువే.. చావులూ తక్కువే. నెమ్మదిగా ఈ శ్మశానం అలవాటైపోయింది. తప్పనిసరైతే తప్ప లీవు కూడా తీసుకోను..' అన్నాడు.

### డిగ్నిటీ ఆఫ్ లేబర్

'మీ ఇంట్లో వాళ్లేం ఇబ్బంది పడరా? మీ పిల్లలు భయపడరా?' ఈ ప్రశ్నలు నా నోటి వెంట అప్రయత్నంగా వచ్చాయి. చేతిలో ఉన్న ఆ రోజు న్యూస్‌పేపర్ పక్కన పెట్టి కళ్లు మూసుకున్నాడు సీతాపతి. 'నేను జీహెచ్ఎంసీలో పనిచేస్తున్నానంటేనే పిల్లనిచ్చారు. పెళ్లి అయిన తర్వాత మా లక్ష్మికి తెలిసి పుట్టింటికి వెళ్లిపోయింది. రెండేళ్లు దూరంగా ఉంది. ఇంతలో వాళ్ల తండ్రి పోయాడు. ఏం చేస్తుంది? మళ్లీ వచ్చింది. మా పిల్లలకు నేనెక్కడ పనిచేస్తానో చెప్పలేదు..' అని గతాన్ని నెమరువేసుకున్నాడు. నాకెందుకో 'డిగ్నిటీ ఆఫ్ లేబర్' అనే మాట గుర్తుకొచ్చింది. ఓచర్స్ రాసే అకౌంటెంట్‌కు.. శ్మశానాల్లో రిసీట్‌లు రాసే సీతాపతికి తేడా ఏముంది.. పనిచేసే ప్రాంతం తప్ప.



### చాలా కష్టం

ఇంతలో మా వసపిట్ట కల్పించుకుని, 'శవాలు కాల్చటం అంత కష్టమా..' అని అడిగింది. సీతాపతి బొంగురుగొంతుతో 'ఒరే రమేష్.. ఇలా రా!' అని గట్టిగా పిలిచాడు. చెట్టు పక్కనుంచి రమేష్ అనే శాల్తీ ప్రత్యక్షమైంది. డీఈఓ ముందు ప్రశ్నకు సమాధానం చెప్పమని ఆజ్ఞాపించే టీచర్‌లా 'ఒరేయ్.. బాడీ కాల్చటం ఎంత కష్టమో చెప్పు..' అన్నాడు. 'చాలా కష్టం మేడమ్.. కాలేదాకా చూసుకోవాలి. సిలైన్ పెట్టిన బాడీలైతే చకచకా కాలిపోతాయి. ఫ్యాట్ ఎక్కువుంటే కాలటం ఈజీ..' అన్నాడు రమేష్. నాకెందుకో ఆ సంభాషణ అంతగా నచ్చలేదు. తల తిప్పి చూస్తే మా వాళ్లందరూ వచ్చేస్తున్నారు. కపాల మోక్షం అయిపోయినట్లుంది. మా బాబాయ్ నేరుగా సీతాపతి దగ్గరకు వచ్చి రిసీట్ గురించి మాట్లాడుతున్నాడు. 'ఎల్లుండి అస్థికలు తీసుకువెళ్లేటప్పుడు కలెక్ట్ చేసుకోండి..' అని చెబుతున్నాడు సీతాపతి. 'ఇక పదండమ్మా..' అన్నాడు బాబాయ్. 'రావద్దంటే వినరు. వయస్సు మీద పడింది కానీ బుద్ధి లేదు..' అని బాబాయ్ గొణుక్కోవటం వినిపిస్తూనే ఉంది. నేను బ్యాగ్ తీసుకొని ఒక అడుగు ముందుకు వేశా. మళ్లీ ఆగి బ్యాగులో నుంచి ఐదు వందల నోటు తీసి సీతాపతికి ఇచ్చా. సీతాపతి ఆ నోటు వైపు నిర్లిప్తంగా చూశాడు. అతని కళ్లల్లో నిజాయితీ కనిపించింది. 'వద్దమ్మా! నేను ఎవరి దగ్గర నుంచీ ఏం తీసుకోను. కావాలంటే ఆ రమేష్‌కి ఇవ్వండి. శ్మశానం నాకొద్దమ్మ!' అన్నాడు. నాకేం మాట్లాడాలో అర్థం కాలేదు. నా కారు దగ్గరకు వచ్చా. 'వాళ్లు దొంగలే.. నీ దగ్గర ఇంకా ఎక్కువ కొట్టేయటానికి అలా అన్నాడంతే..' అన్నాడు నాతో నడుస్తున్న మా బాబాయ్. ఈసారి నాకెందుకో బాబాయ్ మాటలు నమ్మాలనిపించలేదు!

–సీత

email: fbackfm@gmail.com



# మౌనం సర్వార్థ సాధనం

"మౌనం అర్ధాంగీకారం; మౌనం విజయ సోపానం; మౌనం ఒత్తిడిని జయించే కారకం; మౌనం నిన్ను నీవు తెలుసుకునే అంతర్ముఖం" యోగులు, మునులు మౌనం ద్వారానే జ్ఞానసంపత్తిని పెంపొందించు కుంటారు. మౌనంగా ఉంటే చక్కటి శారీరక మానసిక ఆరోగ్యం మీ సొంతం అని చెబుతున్నారు మానసిక శాస్త్రవేత్తలు. అందుకే 'మాట వెండి.. మౌనం బంగారం' అంటారు. మాటే మంత్రం అంటూ కోట్లు గడించి కోటలు కడుతుంటే మీరేంటి మౌనం బంగారం అంటారు అని నేటి తరం ప్రశ్నిస్తుంది. అది కూడా నిజమే కావచ్చు. కానీ కేవలం మాటలతో వచ్చే అనర్థాలే నేడు చాలా నేరాలకు, సమస్యలకు కారణమవుతున్నాయి. సందర్భానుసారం మౌనంతో అద్భుత ఫలితాలు వస్తాయని ఆధ్యాత్మికవేత్తలు పేర్కొంటున్నారు. అయితే నేటితరానికి మాత్రం మౌనం అంటేనే భరించలేని స్థితి. దానికి కారణం అవసరమున్నా, లేకున్నా మాటల మత్తుకు అలవాటు పడిపోవటం! అనవసరంగా మాట్లాడుతూ, ఇతరులను మానసికంగా నొప్పిస్తూ అంతర్గత శక్తిని వృథా చేసుకుంటున్నారని ఆధ్యాత్మిక గురువులు పేర్కొంటున్నారు.

ఒక్కసారి ఈ మౌనం గురించి ఆలోచిస్తే దేవుడి సన్నిధిలో మౌనంగా ధ్యానం చేసుకోమంటారు. ఎందుకంటే దేవుడికి నిశ్శబ్దం ఇష్టం. చుక్కలు మౌనంగా తమ పని తాము చేసుకోవాలన్నట్టు మెరుస్తూ కాంతిని వెదజల్లుతాయి. చంద్రుడు నిశ్శబ్దంగా వెన్నెల కురిపించి ఆహ్లాదాన్ని పంచుతాడు. ఇక భానుడైతే గుట్టుచప్పుడు కాకుండా రోజూ పడమర వరకు ప్రయాణిస్తుంటాడు. మనిషి మాత్రం మౌనం అనే మాటకు ఆమడ దూరం ఉంటాడు. మాట పెదవి దాటడానికి ఎదురు చూస్తుంటాడు.

### అరగంట చాలు

మనం ఉదయం లేచిన దగ్గరనుంచి రాత్రి పడుకునే వరకు ఎంత సేపు మాట్లాడతాం? ఎప్పుడైనా ఆలోచించారా? పోనీ ఎంతసేపు మాట్లాడకుండా మౌనంగా ఉంటామో తెలుసా? అసలు మౌనంగా మాట్లాడకుండా కూర్చుంటే బోర్ కొడుతుంది అని ఫీలవుతుంటారు చాలామంది. మరి కొంతమంది అవసరమున్నా లేకపోయినా అదే పనిగా మాట్లాడేస్తుంటారు. అలాంటివారు ఎదుటి వారు తమమాటలు వింటున్నారా లేదా అని కూడా ఆలోచించరు. వారి విపరీత మాటలధోరణి ఎంత వరకు ఉంటుందంటే వాడి నోరు కుట్టేస్తే బాగుణ్ణు అని ఎదుటివారు అనుకునేంతగా. దగ్గరివారైతే వీడిచేత ఒకరోజు మౌనవ్రతం చేయించాల్రా అంటుంటారు. మాటలు కట్టిపెట్టి పనిమీద దృష్టి పెట్టమంటారు. అందుకే రోజూ ఒక్క అరగంట మౌనంగా ఉండండి... చక్కటి మానసిక, శారీరక ఆరోగ్యంతో పాటు మీ కలలు, ఆశయాలు, కోరికలు అన్నీ నెరవేరుతాయి.

### మౌనంగా ఉండటం ఎలా?

మాట్లాడకుండా నోరు మెదపకుండా ఉంటేనే మౌనం కాదు. మౌనంగా ఉండటమంటే ఇంట్లో పనులు చేస్తూ, టి.వి చూస్తూ, లేదా కంప్యూటర్ ముందు కూర్చుని ఇంటర్నెట్ బ్రౌజ్ చేస్తూ ఉండటం కాదు. ఈ పనులు అన్నీ చేస్తున్నప్పుడు కూడా మన పెదవులు విడివడకపోయినా, మనసులో ఆలోచనలు పరుగులు పెడుతూనే ఉంటాయి. అవి మనల్ని మన నుంచి వేరుగా ఉంచుతాయి. అదే కళ్ళుమూసుకుని మాటని, మనసుని మౌనంలోకి జార్చామనుకోండి...ఓ పదినిమిషాలు చాలు.. కళ్ళు తెరిచాక చూస్తే హాయిగా ఉంటుందిట. అదీ మౌనమంటే! బయటిప్రపంచంతో సంబంధం లేకుండా అంతర్ముఖంగా మిమ్మల్ని మీరు తరచి చూసుకునే మీ ప్రతిబింబం!

### అంతర్ముఖులను చేస్తుంది

మౌనం మనల్ని మనకి దగ్గర చేస్తుంది. రోజంతా రకరకాల సమస్యలతో సతమతమవుతూ బిజీబిజీగా గడిపేవారు ఒత్తిడి తట్టుకోలేక, తమ కోపాన్ని ఇతరుల మీద చూపిస్తుంటారు. పోనీ అలా కోపతాపాలు ప్రదర్శించి వారు ప్రశాంతంగా ఉంటారా... అదీలేదు. ఆరోజు జరిగిన సంఘటనలన్నీ మనసులో చేరి, ఆలోచనలుగా మారి ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. దీనినుంచి బయటపడాలంటే కాసేపు మౌనంగా కళ్ళు మూసుకోవటమే మార్గం. ధ్యానం, మెడిటేషన్, ప్రాణాయామం... ఏదైనా కావచ్చు. ఏకాగ్రతగా శ్వాసపై ధ్యాస పెట్టగలిగితే చాలు... అంతకు ముందు వరకు ఉన్న చిరాకులు, పరాకులు, ఆలోచనలు ఇట్టే మాయమవుతాయి. కారణం మౌనం మనల్ని అంతర్ముఖులను చేస్తుంది. కోపతాపాలకు గల కారణాలను విశ్లేషిస్తుంది. దాంతో మనసు ప్రశాంతంగా ఆహ్లాదంగా మారుతుంది.

### ఆత్మవిశ్వాసం మీ సొంతమవుతుంది

మౌనంగా ఉండటం వల్ల ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. ఆత్మవిశ్వాసం ఉన్న మనిషి మాటలు ఎప్పుడూ సూటిగా, స్పష్టంగా ఉంటాయి. బెరుకు, బెదురు, అనవసరమైన కబుర్లు ఏవీ ఉండవు. అవి ఎదుటి వ్యక్తులకు మనపై నమ్మకాన్ని, గౌరవాన్ని పెంచుతాయి. ఆచి తూచి మాట్లాడటం చేతకానితనం కానేకాదు. తనపై తన ఆలోచనలపై తనకున్న పట్టును తెలియచేస్తుంది. చేజారిన కాలం, పెదవి దాటిన పలుకు వెనక్కి రావు. అందుకే వాటిని ఎంత



జాగ్రత్తగా ఉపయోగించుకోవాలో తెలిసి తీరాలి. ఉదయం లేచిన దగ్గర్నుంచి అన్ని రకాల అనుభూతులు, భావపరంపరలు మనల్ని పట్టి ఆపేస్తుంటాయి. వాటి ప్రభావం మనస్సుపై పడుతుంది. ఒత్తిడి, చికాకు మొదలవుతుంది. అవి మన మాటలపై, చేతలపై ప్రభావాన్ని చూపిస్తాయి. ఫలితంగా మానవ సంబంధాలు కోపతాపాలు, ఆరోపణల మధ్య ఇరుక్కుంటాయి. తిరిగి వాటి ప్రభావం మన మనస్సుపై పడుతుంది. ఇలా ఓ చక్రం తిరిగినట్టు ఒకదానితో మరొకటి ముడిపడి ఉంటాయి. ఈ చక్రాన్ని ఆపే అవకాశం మన చేతుల్లోనే ఉంది. అదే మౌనం! ఆ మౌనంలో ఏ అలోచనలు ఉండకూడదు. ప్రశాంతంగా మనసుతో మమేకమై, ఓ పదినిమిషాలు ఉండగలిగితే చాలు. ఒకసారి అ ప్రశాంతతని రుచి చూశాక దాని గురించి మీరే మరో పదిమందికి చెబుతారు.

### మన గురించి ఆలోచించుకునేలా..

ఎప్పుడూ ఏదో ఒకటి మాట్లాడుతూ ఉంటే, మనసు, ధ్యాస అన్నీ ఆ మాట్లాడే విషయాలపైనే కేంద్రీకృతమై ఉంటాయి. మంచిచెడులు, విచక్షణ, ఆలోచన అనేవి కొంతవరకు స్తబ్ధుగా మారతాయి. కానీ మౌన స్థితి అలాకాదు. మనల్ని మన పనుల పట్ల జాగరూకుల్ని చేస్తుంది. మన ఆలోచనలను మన లోపలికి మళ్లిస్తుంది. బుర్రలో తిష్టవేసిన అనవసర విషయాలన్నీ ఒక్కొక్కటి మాయమైపోయేలా చేస్తుంది. మౌన ధ్యానం అనంతరం మనసు ప్రశాంతంగా మారి, అవసరమైన వాటి గురించే ఆలోచన చేస్తుంది. ఏకాగ్రత, జ్ఞాపకశక్తి పెంపొందుతాయి. వృథా ప్రయాసలు, వృథా మాటలు అసలే ఉండవు. మీకు వచ్చే ప్రతి ఆలోచనా లక్ష్యం వైపే ఉంటుంది. మాట్లాడే ప్రతి మాటా అర్థవంతంగా ఉంటుంది.

### మాట్లాడకుంటేనే మౌనం కాదు

మౌనమనేది నోటికి, నాలుకకు సంబంధించిన వ్యవహారం కాదు. నోరు, మెదడు, మనస్సు సమన్వయంతో పనిచేయాలి. టీవీ చూస్తూ కూర్చోవడం మౌనం కాదు. అది కొన్ని పాత్రలతోనూ, వార్తలతోనూ మనస్సు సంభాషణ. అదేవిధంగా పుస్తకం చదువుతూ మౌనం అనుకోవడం సరికాదు. రచయిత సృష్టితో మమేకమై మాట్లాడుకోవడం. కంప్యూటర్ ముందు కూర్చోవడం మౌనం కాదు.. అది వెయ్యి గొంతుకల కబుర్లతో సమానం. మౌనంలో మాటలు ఉండవు.. ఆలోచనలు ఉండవు.. అదో తపస్సు. మాట ఒక వ్యక్తీకరణ మార్గం మాత్రమే. మాట ఒక్కటే వ్యక్తీకరణ సాధనం కాదు. అసలు కొన్నిసార్లు మౌనాన్ని మించిన కమ్యూనికేషన్ ఉండదు. అది మౌన సాధకులకే అవగతమవుతుంది.



### మాటల శక్తి తెలుస్తుంది

మౌనాన్ని పాటిస్తేనే మాటల శక్తి అర్థమవుతుంది. ఉపవాసం ఉన్నవారికి ఆకలిని తట్టుకునే నిబ్బరం అలవడుతుంది. అలాగే మౌనం సాధన చేసిన వారికి మాటల విలువ తెలుస్తుంది. మౌనాన్ని ఇష్టపడే వ్యక్తుల సంభాషణల్లో వ్యర్థపదాలు ఉండవు. పునరుక్తులు అస్సలే ఉండవు. డొంక తిరుగుడు మాటలు మచ్చుకైనా కానరావు. ఏం చెప్పినా సూటిగా, మనస్సుకు తాకేలా చెప్తారు.

### మాటల మత్తు నుంచి బయటపడాలి

నిద్రమత్తు, మందుమత్తు లాంటిదే మాటలమత్తు కూడా! మాటల మత్తులో పడిపోయి అస్సలు మాట్లాడకుండా గంటసేపు కూర్చోలేని పరిస్థితి ఈ తరానిది. కొందరికి పిచ్చి ఎక్కినట్లు అనిపిస్తుంది. ఏదో ఒకటి మాట్లాడాలి.. ఎవరో ఒకరి గురించి చెప్పాలి. లేదంటే తమ ఉనికి కోల్పోతామన్న భయం. లేదంటే ఏదో నిరాశ, ఇంకేదో ఆత్రుత.. వీటన్నిటినీ మ్యానేజ్ చేసుకోలేక నేటి మానవుడు నాలుకకు పని చెప్పి తన అంతర్గత శక్తిని వృథా చేసుకుంటున్నాడు. మౌనంలోని అందాన్ని, ఆనందాన్ని ఆస్వాదించాలంటే మాటల మత్తు నుంచి బయటపడాలంటున్నారు మౌన ప్రియులు. ఇది సాధనతోనే సాధ్యం. ఆరోగ్యకరమైన శరీరంలోనే ఆరోగ్యకరమైన మనస్సు ఉంటుంది. ఆలోచనల ప్రపంచంలో మనస్సు మౌనంగా ఉండదు. ఆ పరిస్థితి రాకూడదనుకుంటే శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుకోవాలి.

మనం నోటితో మాట్లాడుతున్నంతసేపు మనస్సు మాట్లాడదు. మనం ఆపేస్తే మనస్సు మాట్లాడటం మొదలు పెడుతుంది. మౌనంలోనే మనస్సుతో సంభాషించగలం. మౌనం, నిర్లిప్తత కొన్నిసార్లు రెండూ ఒకేలా అనిపిస్తాయి. కానీ అవి వేర్వేరు. ఒకటి పైపైకి తీసుకెళ్తుంది. ఇంకొకటి పాతాళానికి తొక్కేస్తుంది. మౌనం అంటే నిన్ను నీవు స్పష్టంగా చూసుకోవడం. నిండుకుండ తొణకదు. స్థిరంగా ఉంటుంది. సమర్థులు కూడా అంతే... తమ పని తాము చేసుకుంటూ పోతారు. మహానుభావులు మాట్లాడుతున్నప్పుడు కూడా వారి మనస్సు మౌనంగా ఉంటుంది. మనం మౌనంగా ఉన్నప్పుడు కూడా మనస్సు ఏదో గందరగోళం చేస్తూ ఉంటుంది. ఆ కొమ్మమీది నుంచి ఈ కొమ్మ మీదికి ఈ కొమ్మ మీది నుంచి ఆ కొమ్మమీదికి ఎగిరే కోతిలా ఉంటుంది. ఆ గందరగోళం నుంచి బయటపడాలంటే మౌనాన్ని ఆశ్రయించటం ఒక్కటే పరిష్కారం. అందుకే పెద్దలు నిన్ను నీవు జయించటానికి, నిన్ను నీవు తెలుసుకోవడానికి మౌనాన్ని మించిన సాధనం లేదంటున్నారు. కాబట్టే మౌనం విజయసాధనం, నీ గురించి నీకు తెలియజెప్పే ప్రతిబింబం. రోజులో ఒక్క అరగంట సమయం మౌనంగా మిమ్మల్ని మీరు తరచి చూసుకోండి. ఫలితం మీకే తెలుస్తుంది.

**—లక్ష్మీనర్మద**

## ధ్యానం



యోగసాధనలో ధ్యానానికి తిరుగులేని ప్రాధాన్యం ఉంది. ధ్యానం అంటే ఒకరకంగా మానసికంగా మౌనావస్థకు చేరుకోవడమే! అంటే, ధ్యానానికి మౌనమే పునాది. బహిర్గతంగానే కాదు, అంతర్గతంగా కూడా మౌనం పాటించనిదే ధ్యానం చేయడం సాధ్యం కాదు. నిరంతర యోగసాధకులైన మహర్షులు మౌనంగా ధ్యానం కొనసాగిస్తారు. మౌనం పాటించడం వల్లనే వారిని మునులు అంటారు. రోజుల తరబడి మౌనం పాటించడం లౌకిక జీవితం గడిపే సామాన్యులకు సాధ్యం కాదు. వారానికోసారి లేదా పర్వదినాల్లో, ప్రత్యేక సందర్భాల్లో సామాన్యులు కూడా మౌన వ్రతం పాటించడం మంచిదని పెద్దలు చెబుతారు. పెద్దల మాట మేరకు కొందరు లౌకిక జీవితం గడుపుతూనే, అప్పుడప్పుడు మౌనవ్రతం పాటిస్తూ ఉంటారు.

మౌనం వల్ల మానసిక ఒత్తిడి తగ్గుతుంది. చిరాకు, కోపం, వేదన వంటి ప్రతికూల భావోద్వేగాలు క్రమంగా సద్దుమణిగి మానసిక ప్రశాంతత ఏర్పడుతుంది. ధ్యానానికి అలాంటి ప్రశాంత పరిస్థితే అవసరం. అందుకే, ధ్యాన సాధనకు ఉపక్రమించేవారు తొలుత మౌనాన్ని ఆశ్రయించాలి.

అప్పుడే అనుకున్న లక్ష్యాన్ని సాధించగలుగుతారు.

# శతమానం భవతి

## -శారదా అశోకవర్ధన్

**"అదేమిటో రెండేళ్ళు ప్రేమించుకున్నారు ఇద్దరూ. ఆర్నెల్లకిందట పెళ్ళి చేసుకున్నారు. నెల రోజులనుంచి అప్పుడే ఎడమొహం పెడమొహం! ఈవిడొకచోట, అతనొకచోట ఉంటున్నారట" కాఫీ డికాక్షన్‌లో పాలు కలుపుతూ చెబుతోంది సరస్వతమ్మ.**

**"ఎవరిసంగతి చెప్తున్నావ్, తలాతోకా లేకుండా మొదలెడితే ఎలా?" అడిగాడు నిఖిలేష్.**



"మన వీధిచివర్లో సోమసుందరంలేడూ, వాళ్ల అమ్మాయి కీర్తన కాలేజీలో ఎవర్నో ప్రేమించానని పెళ్ళాడిందా? నచ్చిన వాడితోనే తల్లీతండ్రీ ఆమె పెళ్ళి జరిపించారా? 'నేను అతడి దగ్గర ఉండను' అంటూ అంతలోనే పుట్టింటికొచ్చేసిందట." రెండు కప్పుల్లో కాఫీ పోసి, ఒక కప్పు అతడికి అందించి, మరోకప్పు తను తీసు కుని కుర్చీలో కూర్చుంది సరస్వతమ్మ.

"అంతే సరూ, ఈకాలపు పిల్లలు. చిన్నమాట కూడా పడరు. సర్దుబాటుతనం తక్కువ. అహం ప్రాబ్లమ్స్ ఎక్కువ. ఒకరు చెప్పింది ఒకరు వినక పోయినా, ఒకరిమాట మరొకరికి నచ్చకపోయినా, విడాకులకి ఆ కొన్ని క్షణాలు చాలు" కాఫీ తాగుతూ అన్నాడు నిఖిలేష్.

"పాదదాసిని, చరణదాసిని అనో, నీ భక్తుణ్ణి, దాసుణ్ణి అనో ప్రేమికులు చెప్పుకోవాల్సిన అవ సరంలేదు కానీ, కనీస మర్యాద కైనా ఇద్దరూ కొన్ని కొన్ని పాటించ ట్లేదు. మరీ బొత్తిగా, 'రారా... పోరా... అని ఆడవాళ్లు.. అదేరా.. రా.. అనుకో వడం, యూ షటప్ అంటే యూ కీప్ క్వైట్ అనుకోవడం...అసలు వాళ్ళ మాటలే గమ్మత్తుగా ఉంటున్నాయి. కానీ చూస్తే మళ్ళీ అన్నీ లవ్ మ్యారేజీలే" అంటూ నవ్వింది సరస్వతి.

"మనదీ... లవ్ మ్యారేజీయే, కానీ నేనెప్పుడైనా నిన్ను ఒసేయ్! అని పిలిచానా?"

"సరేలెండీ... మధ్యలో మనమాటెందుకు?" మూతి విరిచింది సరస్వతి.

"సరే సరూ, మన సంగతెందుకుగానీ మన పావని, కేశవ్ మధ్య ప్రేమ చూస్తే ఎంత సంతోషాన్ని స్తుందోకదూ! అదే మన పావనే, అదే పెళ్ళికాక ముందు 'పామ్'...అన్నాడు నిఖిలేష్ కాఫీకప్పు టేబుల్ మీద పెట్టి, సరస్వతికేసి చూస్తూ.

"అవును" అంటూ వంటింట్లోకి వెళ్ళిపోయింది సరస్వతమ్మ. సోఫాలో కూర్చున్న నిఖిలేష్ కళ్ళ ముందు పావని, కేశవ్‌లు కదలాడారు.

***

'హాయ్! గుడ్‌మార్నింగ్, నేను గ్యాస్ సిలిండర్‌కి అప్లైచెయ్యాలి' అడిగాడు కేశవ్.

'ఓకే టేక్ దిస్ ఫార్మ్. ఫిలప్ చేసి ఇవ్వండి. గ్యాస్ కనెక్షన్ రావడానికి నెలరోజులు పట్టొచ్చు' అంది పమీల.

పదిహేనురోజుల తరువాత మళ్ళీ వెళ్ళాడు కేశవ్, జ్ఞాపకం చెయ్యాలని.

'హల్లో' నవ్వుతూ కేశవ్‌ని పలకరించింది పమీల. అంతలో ఫోన్ మోగింది. అవతలివైపు ఎవరు మాట్లాడుతున్నారోగానీ, ఆమెని దుర్భాషలాడు తున్నట్టు మాత్రం అర్థమవుతోంది. 'ఇంక నేను నీకు ఏమీ కాను. కోర్టు తీర్పు ఇచ్చేసింది కదా? నా జోలి కొస్తే పోలీస్ రిపోర్టిస్తాను' అంటూ ఫోన్ పెట్టే సింది. అప్పుడే కేశవ్ ఆమెకేసి పరీక్షగా చూశాడు. గులాబీరంగు బుగ్గలు, అదే శరీరచాయ, చక్కటి కను ముక్కు తీరు. చూడగానే ఇట్టే ఆకర్షిస్తుంది ఎవరినైనా. కానీ ఆ సమయంలో ఆమె మొహం వాడిపోయిన కమలంలా ఉంది. చెంపలమీదుగా



కారిన కన్నీరు చారలుకట్టి, మేకప్‌ని చెరిపేశాయి.

'సారీ, ఏం జరిగింది?' అడిగాడు కేశవ్.

'ఏం లేదు. మా హజ్బెండ్. నిన్ననే కోర్టు ద్వారా విడాకులొచ్చాయి. దాని తాలూకూ నకలుప్రతి కూడా మా లాయరు నాకు ఇచ్చారు. అయినా ఫోన్‌చేసి ఏదేదో వాగుతున్నాడాయన' చెప్తూనే కళ్ళు తుడుచుకుంది.

'మీకు పెళ్ళి కాలేదనుకున్నాను' కేశవ్ అన్నాడు ఆశ్చర్యంగా.

'మూడేళ్ళ పాప కూడా ఉంది నాకు. వాడొక అనుమానపు పక్షి. పాపనీ నన్నుకూడా చావ బాదే వాడు. ఇక ఆ బాధలు ఓర్చుకోలేక ఒకరోజు కోర్టు కెళ్ళాను. నా వీపుమీద ఉన్న దెబ్బలు చూసి కోర్టు వారు ఆశ్చర్యపోయారు. పసిబిడ్డ అని కూడా చూడ కుండా పాపను కొట్టేవాడు. ఆ దెబ్బలవల్లే విడా కులు తొందరగా మంజూరయ్యాయి. పాప బాధ్యత

కోర్టు అతడికి అప్పగించలేదు. ఆది నా పాప కాదు అని వదిలేశాడు' చెబుతూనే కర్చీఫ్‌లో మొహం పెట్టుకుని ఏడవసాగింది.

ఆమెను ఎలా ఊరడించాలో కేశవ్‌కి తెలీలేదు.

'మేడమ్... ఏడవకండి. మిమ్మల్ని చూసిన వాళ్ళు ఎవరైనా సరే, మీకసలు పెళ్ళే కాలేదనుకుంటారు తెలుసా! మీలాంటి మంచిమనిషిని వదులుకున్న అతను నిజంగా దురదృష్టవంతుడు' అంటూ అప్రయత్నంగా తన కర్చీఫ్‌తో ఆమె కళ్ళు తుడిచాడు కేశవ్.



ఓదార్పు కోరుకుంటున్న ఆమె అప్రయత్నంగానే అతని చేతులు పట్టుకుంది. సహానుభూతి వర్షమై కురిసింది. కేశవ్ మనసు ఆర్ద్రతతో నిండిపోయింది.

ఆ క్షణం... ఆ మౌనంలో వారి మనసులు ఏం మాట్లాడుకున్నాయో! వారిద్దరి మెదడులో ఏం ముద్రలు పడ్డాయో!

మన్మథుడు ఎన్ని పూలబాణాలు సంధించాడో గానీ...!

ఒకరికి తెలీకుండా ఒకరు దగ్గరయ్యారు.

'నీకు పాప ఉంటే ఏమిటట. నేను నిన్ను నాదాన్ని చేసుకుంటే, నీ పాపని నా పాపను చేసుకోనా? సుమతికి తండ్రినీ అవుతా?' అన్నాడు పామ్‌తో కేశవ్. అలా వాళ్ళ ప్రేమకథ కొనసాగింది. ఆ గతం జ్ఞాపకాలు నిఖిలేష్‌లో సుళ్ళు తిరుగుతున్నాయి.

"కేశవ్, పమీల ఇద్దరూ కలిసి చర్చించుకోవడానికి మా ఇల్లే వేదికైంది. సమీర పుట్టడంవల్ల సరా లీవులో ఉంది. ఆ రోజుల్లో తరుచూవారు 'మా ఇంట్లోనే భోజనంచేసి, వాళ్ళ సమస్యలు చర్చించుకునేవారు. కేశవ్ లంచ్‌టైంలోనో, ఆఫీసు అయిపోయాకో వచ్చేవాడు. పామ్ కూడా అంతే. ఆమె ఆఫీసు మా ఇంటికి చాలా దగ్గర. వాకబుల్ డిస్టెన్స్.

రోజురోజుకీ వారి ప్రేమ గట్టిపడింది. పెళ్ళి చేసుకోవాలన్న నిర్ణయమూ గట్టిపడింది. అయితే ఇక అడ్డేమిటి? అనుకుంటే పొరబాటే. కేశవ్ అయ్యంగార్ బ్రాహ్మణ కుటుంబీకుడు. వాళ్ళింట్లో కేశవే పెద్ద కొడుకు. పామ్...పమీల ఆంగ్లోఇండియన్ వనిత. కేశవ్‌కి ఇద్దరు తమ్ముళ్ళు, ఇద్దరు చెల్లెళ్ళు, అందరిదీ ఇంచుమించు ఒకటేవయసు. తండ్రి రైల్వే ఉద్యోగి. అతికష్టంమీద అందరినీ చదివించాడు, కానీ పెళ్ళిళ్ళు చెయ్యాలంటే కేశవ్ సహాయం తీసుకోకతప్పదు. తల్లిదండ్రుల ఆచార వ్యవహారాల గురించి తెలిసిన కేశవ్ ఇంట్లో పామ్ గురించి చెప్పలేదు. చెబితే తన స్థానం, మూసినతలుపుల బయటే. ఆత్మాభిమానానికి మారుపేరు అతని తల్లిదండ్రులు. నిజం తెలిస్తే పస్తులైనా ఉంటారుగానీ కేశవ్ సహాయం మాత్రం తీసుకోరు. అందుకే చివరికి తమ్ముళ్ళ పెళ్ళిళ్ళు కూడా అయ్యేదాకా తన పెళ్ళి వాయిదా వేస్తూ వచ్చాడు. నాలుగేళ్ళలో నాలుగు పెళ్ళిళ్ళూ చేసేశాడు. ఇక మిగిలింది తనపెళ్ళే. మెల్లమెల్లగా చిన్నచిన్న అబద్ధాలతో తల్లిదండ్రుల్ని ఒప్పించాలనుకున్నాడు కేశవ్. పామ్ పేరుని పావనిగా మార్చి చెప్పాడు. వాళ్ళు అరవ బ్రాహ్మణులని చెప్పాడు. కొంత రభస జరిగిన తరువాత భాషదేముందిలే, అరవమో తెలుగో' అని సర్దుకున్నారు కేశవ్ కుటుంబీకులు. సుమకి ఏడో ఏడొచ్చింది. మా సమీర్ తోటిదే. అంతలోనే మాకు మరో ముగ్గురుపిల్లలు పుట్టారు. 'సాధన, రోహన్, జీవన్ అందరూ కలివిడిగా ఆడుకునేవారు. కేశవ్ పామ్‌ని పావనిగా మార్చి, పాప సుమని మా ఇంట్లో వదిలిపెట్టి పామ్‌ని తీసుకుని విశాఖపట్నం వెళ్ళి పెళ్ళి చేసుకుని వచ్చాడు. పావని అదే పామ్,



సుమని ఆడించడం, తిప్పడం అంతా నేనూ సరూ, పిల్లలూ చేస్తూ వచ్చాం. వారంతర్వాత తిరిగొచ్చి ముందే చూసిపెట్టుకున్న బంజారాహిల్స్ ఇంటికి సుమని తీసుకుని షిఫ్ట్ అయిపోయారు. ఒకనెలలోపే పావనికి ఒక బిడ్డ ఉందని ఇంట్లో చెప్పాడు. తరువాత మరోనెలకల్లా ఇక ఏదీ గోప్యం లేకుండా

**అతనిది శుద్ధ శ్రోత్రియ కుటుంబం. సంప్రదాయాలు పాటించే తల్లిదండ్రులు, ఇద్దరు తమ్ముళ్ళు, ఇద్దరు చెల్లెళ్ళున్న కుటుంబం. ఆమె ఆంగ్లోఇండియన్. పేరు పమీల. వాళ్ళిద్దరూ ప్రేమికులు. పమీల కాస్తా పావనిగా మారిపోయింది. తన వల్ల ఆ కుటుంబంలో ఐక్యత చెడిపోతుందేమో అని ఎంతో కలవరం చెందింది. ఎంతో బాధ్యతగా ఆ కుటుంబానికి చేయూతనిచ్చింది. కానీ అతని తోడబుట్టిన వాళ్ళేం చేశారు?**

ఆ వారం రోజులూ బెంగపెట్టుకుని సుమకోసం గిలగిలలాడిపోయింది. ఒకవైపు కేశవ్‌తో పెళ్ళి జరుగుతున్నాగానీ పామ్‌కు ఎన్నో ఆలోచనలు. కేశవ్ ఇంట్లో అబద్ధం చెప్పాడనే భయం ఒకవైపు, పాప సుమ సంగతి దాచిపెట్టాడన్న భయం మరొకవైపు ఆమెను వెంటాడాయి. ఈ వారం రోజులూ సుమ సరిగ్గా తిండి తిందో లేదో అనుకుంటూ విశాఖపట్నంలో క్షణమొక యుగంలా గడిపింది. భగవంతుడు తను స్వయంగా ప్రతిమనిషి దగ్గర ఉండలేడు గనుక, తల్లిని సృష్టించాడేమో! ఈలోగా అసలు విషయాలన్నీ తల్లిదండ్రులకు చెప్పేశాడు కేశవ్. ఆమె ఆంగ్లో ఇండియన్ అని కూడా చెప్పేశాడు. ఆ నిమిషంలో అతని ఇంట్లో వాళ్ళందరూ స్థాణువులైపోయారు. కేశవ్ కుటుంబద్రోహి, అబద్ధాలకోరు అనే నిర్ధారణకు వచ్చేశారు.

'నీ మొహం నాకు చూపించకు. నువ్వు ఈ ఇంట్లో కాలుపెడితే నా శవాన్నే చూస్తావు' అని శాసించారు కేశవ్ తండ్రి నారాయణరావు. తల్లీ, తమ్ముళ్ళు, చెల్లెళ్ళూ అందరిదీ అదేబాట! కేశవ్‌దగ్గర

డబ్బు తీసుకోవడం కూడా మానేశారు. ఆడపిల్లలు పురిటికొచ్చినా, ఏ అవసరం వచ్చినా నారాయణ రావు అప్పుచేస్తున్నారే తప్ప, కేశవ్ సాయం తీసుకోవడం లేదు.

మరోవైపు పావని, 'ఇదంతా నావల్లే కదా' అని బాధపడుతోంది. ఇప్పుడు పావనీకేశవ్ అని తప్ప పావనిపేరులో పామ్ లేదు. తండ్రి ఎవరిని అప్పు అడుగుతున్నాడో తెలుసుకుని అతడి ద్వారా కేశవే తండ్రికి డబ్బు సమకూరుస్తున్నాడు. తండ్రికి అప్పిస్తానని వాగ్దానం చేసిన వాళ్ళకి కేశవ్ డబ్బిచ్చేవాడు. ఆవిధంగా వాళ్ళద్వారా తన తండ్రికి డబ్బు ఇచ్చేవాడు. తన కన్నబిడ్డ సొమ్మే అని తెలియని నారాయణరావు మాత్రం, అడిగిన వెంటనే ఊళ్ళో అప్పు పుడుతోందని అనుకునేవారు. ఇలాగే మరో ఏడాదిన్నర గడిచింది.

అందరికీ పిల్లా పాప పుట్టారు. నారాయణ రావుగారికి ఒకరోజు సడెన్‌గా స్ట్రోక్ వచ్చింది. చనిపోయారు.

పుట్టెడు దుఃఖంతో పావని, సుమ, ధీమ ఇద్దరినీ వెంటబెట్టుకుని కేశవ్ వైజాగ్ వెళ్ళాడు. తోడబుట్టినవాళ్ళెవరూ అతన్ని సరిగ్గా పలకరించలేదు. ఇంటి పనుల్లో పావనిని కలగజేసుకోనివ్వలేదు. ఖర్చులకుమాత్రం అందరూ జేబులు తడుముకుంటూ ఉంటే, పెద్దతమ్ముడు చేతిలో పదివేలు పెట్టాడు కేశవ్. డబ్బు మాత్రం తీసుకున్నారు. పావనినీ పిల్లల్నీ హోటల్లో ఉంచి, తనుమాత్రం అన్ని కార్యక్రమాలకు హాజరయ్యాడు. పన్నెండురోజులు గడిచిన తర్వాత కేశవ్ తల్లిచేతికి మరోపదివేలిచ్చాడు. పావని, సుమ, ధీమలతో సహా ఆమెకి పాదాభివందనం చేశాడు. చక్కటిబొట్టు, చీరకట్టులో కనిపించిన పావనిని అభినందిస్తూ ఆమె చూసిన చూపునే ఒక దీవెనగా భావించారు వాళ్ళు. పావని నెలకోసారి వాళ్ళకి ఫోన్లు చేస్తున్నా తోటికోడళ్ళు, ఆడబిడ్డలు ఎవరూ సరిగ్గా మాట్లాడేవారు కాదు. కానీ కేశవ్‌మాత్రం ప్రతీ నెలా వెళ్ళి తనే తల్లికి డబ్బిచ్చి వస్తున్నాడు.

సుమ హైస్కూలు చదువులోకి వచ్చింది. ధీమ మిడిల్‌స్కూలు. మరో నాలుగైదు సంవత్సరాలు గడిచాయి. అడపాదడపా అన్నదమ్ములు, చెల్లెళ్ళూ కేశవ్‌ని అప్పుగానో, ఉచితంగానో డబ్బు అడుగుతూ వస్తున్నారు. పిల్లల కాలేజీ చదువులు, పెళ్ళిళ్ళ పేరుతో మెల్లగా పావనితో మాట కలుపుతున్నారు. కేశవ్, పావని ఇద్దరికీ ఢిల్లీలో మంచి ఉద్యోగాలు వచ్చాయి. వాళ్ళు ఢిల్లీ వెళ్ళిపోయారు. కేవశ్‌తల్లికి వయసు మీరింది, చూపు మందగించింది. మంచం పట్టింది. ఏ కోడలూ ఒక్కరోజు వచ్చి కప్పుకాఫీ కూడా ఇవ్వడంలేదు. కూతుళ్ళూ అంతే. ఏవో సాకులు చెప్పి తప్పించుకుంటున్నారు. ఒక్కరూ నాలుగు రోజులుండి ఆమెకు ఎలాంటి సేవలూ చేయడం లేదు. పిల్లల్ని తీసుకుని పావని సెలవులకి హైదరాబాద్ వచ్చింది. అత్తగారి బాధ్యత తీసుకుంది. మంచి భోజనానికి మొహం వాచిన కేశవ్ తల్లి, పావని చేసిన తెలుగు వంటలకు తృప్తిగా భోజనం చెయ్యడమే కాదు, అస్తమానం పావనిపేరే జపిస్తోంది. పావనితోటే కబుర్లు. సుమ, ధీమలతో ఆటలు. ఆమె ఆరోగ్యం కోలుకుంటున్నట్లుగా అనిపించింది కేశవ్ దంపతులకి. వాళ్ళతోపాటు ఆమెనీ ఢిల్లీకి తీసుకెళ్ళిపోయారు. కేశవ్ తోడబుట్టిన వాళ్ళల్లో ఏ ఒక్కరూ కొన్నాళ్ళకైనా ఢిల్లీకి రావడమో లేదా ఆ పెద్దావిడని తీసుకెళ్ళాలనో అనుకోలేదు. ఎప్పుడు రమ్మని పిలిచినా డబ్బులేదనో, తీరికలేదనో సమాధానం! పాపం పెద్దావిడ అందరినీ కలవరిస్తూనే ఉంది. పావనిని మాత్రం 'దేవత' అంటుంది.

సుమ, ధీమ కాలేజీ చదువులు పూర్తి చేశారు. ఇద్దరికీ మంచి ఉద్యోగాలొచ్చాయి. మంచి సంబంధాలొచ్చాయి. పెళ్ళిళ్ళు చేసుకుని పిల్లలిద్దరూ అమెరికా వెళ్ళిపోయారు. ఎంతసేవ చేసినా పావని అత్తగారు, ఒక ఉదయాన మూసినకన్ను తెరవలేదు. అప్పుడు మాత్రం అందరూ వచ్చారు ఢిల్లీకి. కర్మకాండ పూర్తి కాగానే, అందరూ ఢిల్లీ, ఆగ్రా అన్నీ తిరిగి ఇళ్ళకు చేరుకున్నారు.

ఇప్పుడు కేశవ్‌కి ఏ బాధ్యతాలేదు. తనూ పావనీ కూడా పిల్లలున్న చోట ఉండాలని నిర్ణయించుకుని న్యూయార్క్ వెళ్ళిపోయారు. మనకులం, మనమతం కాకపోయినా అయిన వాళ్ళనుకున్న వాళ్లందరికన్నా కేశవ్‌నీ, కేశవ్ కుటుంబసభ్యుల్నీ పావని ఎంతబాగా చూసుకుందో తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది" ఆ జ్ఞాపకాల్లోంచి బయటకు వచ్చిన నిఖిలేష్ అనుకున్నాడు.

"సరూ! ప్రేమంటే పావని, కేశవ్‌లదే. అదీ ప్రేమంటే! మరి ఇప్పుడో, వాలెంటైన్స్ డే అని పువ్వులు ఇచ్చిపుచ్చుకోవడం, గిఫ్టులిచ్చుకోవడం, ఆపైన ప్రేమ పెళ్ళి చేసుకోవడం... ఇక అంతే! కొద్దికాలంలోనే అదంతా కర్పూరంలా కరిగిపోగానే, చివరికి పొగ, మసి మిగులుతోందీ రోజుల్లో!" అన్నాడు ప్లేట్లో ఇడ్లీలు వేసి పట్టుకొచ్చి టేబుల్‌మీద పెట్టి, కొబ్బరి చట్నీ వేస్తున్న సరూ.... అదే సరస్వతి భుజాలమీద ప్రేమగా చేతులువేస్తూ.

"అదే నిఖిల్ ప్రేమంటే..

ప్రేమంటే ఆప్యాయత

ప్రేమంటే కొంత సర్దుబాటుతనం

ప్రేమంటే కొంత త్యాగం" అంది సరస్వతి నవ్వుతూ.

"ప్రేమంటే ఒక చదరంగంలాంటి ఆట. గెలుపు ఓటములు ఎవరివైనా కావొచ్చు. అవి నీవీ నావీ అనుకోవడం తప్పు. మనవి అనుకోవాలి" అన్నాడు నిఖిలేష్.

"ఆప్తులు తింటున్నప్పుడొస్తారట. ఇప్పుడు ఫోన్ వచ్చినా అలాగే అనుకోవాలి ఎవరో చూడు" అన్నాడు నిఖిలేష్.

"ఫోన్ తీసి హల్లో" అంటూ హండ్రెడ్ ఇయర్స్.. మీకు నూరేళ్ళ ఆయుష్షు", "కేశవ్ ఆన్ ఫోన్" అంటూ రిసీవర్ నిఖిలేష్‌కి అందించింది సరస్వతి.

"శతమానంభవతి" అంటూ ఫోన్ అందుకున్నాడు నిఖిలేష్.

*సెల్: 98660 21570*



## నిత్య అతగాడికి గుడ్‌బై చెప్పిందా?

అవుననే అంటున్నాయి శాండిల్‌వుడ్ వర్గాలు. కన్నడ నటుడు సుదీప్‌తో నిత్యామీనన్ సహజీవనం చేస్తున్న విషయంలో వచ్చిన పుకార్లకు ఫుల్‌స్టాప్ పడేటట్టే ఉంది. ఎలాగంటే...సుదీప్ తన భార్య ప్రియకి విడాకులు ఇచ్చేయాలని డిసైడ్ అయ్యాడు. ఈ మేరకు కోర్టు మెట్లు కూడాఎక్కాడు. మధ్యలో ఏమైందో ఏమో కానీ, సుదీప్ ప్రియకు విడాకులు ఇవ్వననీ, ఇద్దరం కలిసి ఉంటామనీ కోర్టులో చెప్పాడు. ఇటు నిత్య బెంగళూరులో ఉంటున్న ఫ్లాట్‌ను కూడా ఖాళీ చేసినట్టు వార్తలు వినవస్తున్నాయి. ఇద్దరికీ చెడడం వలనే నిత్య ఆ ఫ్లాట్ ఖాళీ చేసిందనీ, సుదీప్ కూడా తన భార్యకు విడాకులు ఇవ్వకుండా కాంప్రమైజ్ అయ్యాడనీ అంటున్నారు.

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'రుమటాయిడ్ ఆర్థరైటిస్' సమస్యకు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



ఈ మధ్యకాలంలో చాలా మందిని వేధిస్తున్న ఆరోగ్య సమస్యల పరిశీలన పరంగా – ఆటో ఇమ్యూన్ వ్యాధులు చాలా ఎక్కువ మందిలో కనిపిస్తున్నట్లు వివిధ గణాంకాల ద్వారా వెల్లడి కాబడింది. అందునా రుమటాయిడ్ ఆర్థరైటిస్ వ్యాధితో బాధపడేవారి సంఖ్య అధికంగా ఉంటోంది. ఈ వ్యాధి యొక్క ప్రభావం – శరీరంలోని వివిధ కణజాలాలపైన మరియు ఊపిరితిత్తులు, మూత్రపిండాలు, హృదయం, చర్మం వంటి ప్రధాన అవయవాలపై ఉన్నప్పటికీ, ముఖ్యంగా కీళ్ళ (సైనోవియల్ జాయింట్స్)పై ఎక్కువగా ఉంటుంది.

ఆటో ఇమ్యూన్ వ్యాధులనగా మనల్ని వ్యాధులకు గురి కాకుండా కాపాడే మన రోగనిరోధక వ్యవస్థ కొన్ని అసమతుల్యతల కారణంగా పొరబడి, సొంత కణాలపైనే దాడి చేయడం. వీటికి ఇతర వైద్య విధానాలలో పూర్తి చికిత్స అందుబాటులో లేదు. కానీ కాన్స్టిట్యూషనల్ హోమియో వైద్య విధానం ద్వారా ఈ ఆటో ఇమ్యూన్ వ్యాధులను సంపూర్ణంగా నయం చేయవచ్చు.



ఏ వయస్సు వారినైనా ప్రభావితం చేసే ఈ వ్యాధి ముఖ్యంగా 30 నుండి 60 సంవత్సరాల మధ్య వయస్సు గలవారిని ఎక్కువగా ప్రభావితం చేస్తుంది. పురుషుల కంటే స్త్రీలలో 3 రెట్లు అధికంగా ఈ వ్యాధి కలుగుతుంది. 16 సం॥ లోపు వయస్సు గల వారిలో ఈ వ్యాధి కలిగితే, దానిని జువెనైల్ రుమటాయిడ్ ఆర్థరైటిస్ అని అంటారు. ఈ వ్యాధి ముఖ్యంగా కీళ్ళలోని సైనోవియం పొరను శోథమునకు గురి చేసి, తద్వారా క్రమంగా కీళ్ళలోని ఎముకలను, వాటి తాలూకు కార్టిలేజ్‌ని కూడా దెబ్బతీస్తుంది. ఫలితంగా కీళ్ళు – వాటి ఆకారం, అమరికను కోల్పోయి, విపరీతమైన నొప్పితో పాటు కీళ్ళ కదలికలు కష్టతరంగా మారుతాయి. ఈ పరిస్థితి దీర్ఘకాలికంగా కొనసాగితే అది కీళ్ళను పూర్తిగా దెబ్బతీసి, కీళ్ళ వైకల్యానికి గురిచేస్తుంది. కాబట్టి ఈ వ్యాధిని మొదట్లోనే గుర్తించి, వెంటనే వైద్యం అందించటం ఎంతో అవసరం.

**కారణాలు:** ఈ వ్యాధికి గల ఖచ్చితమైన కారణాలు తెలియలేదు. కానీ ఈ వ్యాధి కలిగిన కుటుంబ చరిత్ర, పొగ త్రాగటం, అధిక బరువు, వాతావరణ మార్పుల వంటి అంశాల వలన ఈ వ్యాధికి గురి అయ్యే అవకాశం ఉంటుంది. • 'రుమటాయిడ్ ఆర్థరైటిస్'తో బాధపడే వారిలో 80% వరకు 'రుమటాయిడ్ ఫ్యాక్టర్' అనే యాంటీబాడీని కలిగియున్నారు.

**లక్షణాలు:** ఈ వ్యాధికి గురి అయిన కీళ్ళలో–వాపు, నొప్పి మరియు చేతితో తాకితే వేడిగా అనిపించడం, ఉదయాన్నే నిద్ర లేవగానే కీళ్ళు బిగుసుకుపోవడం • శరీరంలోని ఇరు పార్శ్వాలలో ఉండే ఒకే రకమైన కీళ్ళను ప్రభావితం చేయడం ఈ వ్యాధి యొక్క ముఖ్య లక్షణం. • ఈ వ్యాధి మొదట – చిన్న కీళ్ళు అయిన చేతివ్రేళ్ళు, కాలివ్రేళ్ళను మరియు వ్యాధి తీవ్రత పెరిగే కొద్దీ – మణికట్టు , మోచేతులు, భుజాలు, మోకాళ్ళు, తుంటి మరియు చీలమండల వంటి కీళ్ళను ప్రభావితం చేస్తుంది. • కీళ్ళ ప్రాంతంలోని చర్మం క్రింద ఫైబ్రస్ కణజాలం పెరగడంతో, అవి బయటకు చిన్న కంతుల వలె కనిపిస్తాయి. వీటిని రుమటాయిడ్ నాడ్యూల్స్ అని అంటారు. • వీటితో పాటు నీరసం, రక్తహీనత, బరువు తగ్గడం, ఆకలి తగ్గిపోవడం, జ్వరం వంటి లక్షణాలను కూడా గమనించవచ్చు. • ఈ వ్యాధి ప్రభావం – ఇతర ప్రధాన అవయవాలైన కళ్ళు, చర్మం, రక్తనాళాలు, గుండె, ఊపిరితిత్తులపై మరియు మూత్రపిండాలపై ఉండటం వలన కళ్ళు మరియు నోరు పొడిబారడం, ఛాతీలో నొప్పి, దగ్గు, శ్వాస తీసుకోవడంలో ఇబ్బంది తలెత్తడం, రక్తనాళాల్లో కొవ్వు పేరుకుపోవడం వలన గుండెనొప్పి వంటి లక్షణాలను గమనించవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** సి.బి.పి., ఇ.ఎస్.ఆర్., ఆర్.ఏ. ఫ్యాక్టర్, ఏ.ఎన్.ఏ. యాంటీ సి.సి.పి., ఎక్స్–రే, ఎమ్.ఆర్.ఐ. మొదలైన పరీక్షల ద్వారా వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** చాలా రకాల ఆటో ఇమ్యూన్ వ్యాధులు 'సైకోసోమాటిక్ డిజార్డర్స్' క్రిందకు వస్తాయి. అన్ని రకాల సైకోసోమాటిక్ డిజార్డర్స్‌కు హోమియోలో చక్కని పరిష్కారం లభిస్తుంది. ఆటో ఇమ్యూన్ వ్యాధులకు ఇతర చికిత్సా విధానాలలో శాశ్వత నివారణ లేదు, కేవలం తాత్కాలిక ఉపశమనం మాత్రమే లభిస్తుంది. కానీ హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో అందించబడే కాన్స్టిట్యూషనల్ హోమియో చికిత్సా విధానం ద్వారా, రోగి యొక్క మానసిక మరియు శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకుని, చికిత్స అందించడం ద్వారా ఈ వ్యాధి సంపూర్ణంగా నయం అయ్యే అవకాశం ఉంది. అంతేకాకుండా ఇతర కాంప్లికేషన్స్ బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు.




# ప్రయాణం

## (రాచెల్ కలోఫ్ ఆత్మకథ)

-బాలి

సెల్: 98499 63082

**పవిత్రంగా గొడ్డును చంపే షెహిటాహ్ అప్పుడే దిగాడు. అతను ఏవేవో అడుగుతున్నాడు. అతను అడిగినవన్నీ ఇస్తున్నాను అలాగే. నేను నీరసంతో, కొద్దిపాటి జ్వరంతో బాధపడుతున్నానని కనిపెట్టాడు కాబోలు...**

**"ఈ పూట నీవు తేలికైన ఆహారం తీసుకో. ఈ మాంసం అస్సలు తినకు. నీవు ఇంకా పసిబిడ్డకు పాలిస్తున్నావు కదా" అన్నాడు.**

నేను ఆశ్చర్యంతో ఊc కొట్టాను.

ఈ షెహిటాహ్‌లకు సంఘంలో గొప్ప గౌరవం ఉంటుంది. పవిత్రంగా గొడ్డును చంపడం అంటే అదొక పవిత్రమైన కార్యక్రమం. అదొక దైవ నివేదన. దానిని వారు వారి వారి గురువుల దగ్గర నేర్చుకుంటారు. దాన్ని కోసేటప్పుడు మెడ పైభాగం నుండి శరీరాన్ని వేరు చేయకూడదు. గొంతువైపు నుండి వేరు చేయాలి. అంతా కొన్ని క్షణాల్లోనే పూర్తిచేసి, రక్తం పారేదాకా నేలపై ఉంచాలి. రక్తం మొత్తం బయటకు వచ్చాక రక్తం చిందిన నేలపై ముమ్మారు చిన్నపాటి గునపంతో మట్టిని తవ్వి పక్కన పోసి, తిరిగి దానిని భగవంతునికి నివేదించాలి. చంపే ఆయుధం పదునెక్కి ఉండాలి. పక్షులను, నీటిలో తిరిగే చేపలను ఎంత తిన్నా ఫరవాలేదు. ఆవు అన్నింటి కన్నా పవిత్రమైంది. పంది వేడి రక్తం కలది. మలిన పదార్థాలు తినడం వల్ల దానిలో టాక్సిన్‌లు ఎక్కువ ఉంటాయి. అందువల్ల దాన్ని ఎక్కువ వేడిలో ఎక్కువసేపు ఉడకనివ్వాలి.

'షెహిటాహ్' పవిత్రమైన మాంసాన్ని గిన్నెలతో సిద్ధం చేశాడు. నన్ను దానికి ఉప్పు బాగా పట్టించమన్నాడు. అలాగే చేశాను. ఇప్పుడు దాన్ని వండాలి.

మా అత్తగారూ, మావగారూ, బావగారూ వారి వారి పిల్లలతో అందరూ వచ్చి ఉన్నారు కదా! అయితే అంత మాంసం వండే పాత్ర మా ఇంట్లో లేదు. అబ్రహం తమాషా ప్రపోజల్ పెట్టాడు. ఈ మాంసాన్ని మూడు భాగాలుగా చేసి ఒకటి మా వాటాగానూ, మరొకటి మా అత్తగారి వాటా కింద, మరొకటి మా బావగారి వాటాగా విభజించి చివరి భాగాన్ని వారు, ఒకరి తరువాత మరొకరు అదే గిన్నెలో వండాలి. అప్పుడు రుచులు వేరు వేరుగా తెలుస్తాయి అన్నాడు. ఇదేదో బాగుంది అనుకున్నాను. పైగా అనుభవరీత్యా మా అత్తగారు ఇంకా రుచిగా వండు

తుంది అనుకున్నాను.

'కోవెనెన్ట్' పండుగ పూర్తి అయిపోయింది. మా చంటాడిని చూసి అందరూ ఆనందించారు. వారి వారి ఆశీర్వచనాలు అందించారు. ముందుగా మా అత్తగారిని తనకు కావలసిన వాటాను ఎత్తు కోమన్నాం. అప్పటికే ఆమె ముఖం అదోలా ఉంది. ఇక ఇప్పుడు ఆమె ముఖం ఇంకా చిటపటలాడటం మొదలెట్టింది. గాలిలో చేతులు తిప్పుతూ "మాకేం మాంసాలు అవసరం లేదు. ఇక్కడ మమ్మల్ని గుర్తించేవారు లేరని" విరుచుకుపడింది. అందరం ఆశ్చర్యపోయాం. అబ్రహం మరో అడుగు ముందుకు వేసి వాళ్ల అమ్మను గట్టిగా అడిగాడు. "నీకు జరిగిన అవమానం ఏమిటి? నిన్నెవరు గుర్తించలేదు?" అని.

మా అత్తగారు ఉడుక్కుంటూ "నేనింత పెద్ద దాన్ని కదా! పైగా ఎదురుగా ఉన్నాను కూడా! ఆ షొకెట్ ఆ మాంసానికి ఉప్పు కలపమని నాకు చెప్పొచ్చు కదా" అంది. అదీ ఆమె అక్కసు.

అదేదో ఆమె చేస్తే నా ఒంట్లో రవ్వంత నీరసం తగ్గేది. మా బావగారు వారి వాటా ఎత్తుకున్నారు. మా తోడికోడలు ఫాగా దాన్ని వండడానికి మిగిలిన పదార్థాలు సిద్ధం చేస్తోంది. ఆరోజు అలా జరగడం నాకింకా గుర్తుంది. ఆఖరికి మా అత్తగారు ఆరో జంతా గొణుక్కుంటూ బల్లమీద ఓ మూల చేరబడి కూచుందే గానీ గుక్కెడు మంచినీళ్ళైనా తాగలేదు.

సంవత్సరాలు బాగానే గడుస్తున్నాయి.

ఈ చలికీ, వాతావరణానికీ పూర్తిగా అలవాటు పడ్డాను. తిరిగి గర్భవతినయ్యాను. ఈసారీ మగ పిల్లవాడే పుట్టాడు. ఇసాక్ అని పేరు పెట్టుకున్నాం. అయితే అబ్రహం వాడిని ఇజాక్ అని పిలవడం మొదలుపెట్టాడు. పెద్దవాడికి యాక్ అనే పేరు పెట్టినా వాణ్ణి మోసెస్ అని పిలుస్తున్నాం.

అదేమిటో కొత్తగా పుట్టిన పిల్లల మంచి చెడ్డలు చూసేసరికి పెద్ద పిల్లలు ఏదో ఒక ఇబ్బందిలో చిక్కుకుంటున్నారు. ఇప్పుడదే జరిగింది. మోసెస్‌కి సడెన్‌గా ఒంట్లో బాగా లేకుండా పోయింది. ఒళ్లంతా ఒకటే పొక్కులు వచ్చాయి. కనీసం మంచినీళ్ళైనా నోటి దగ్గరకు తీసుకుని తాగలేకపోతున్నాడు. అసలది ఎలా వచ్చిందో తెలియదు. ఈ వారం రోజుల్లో తినరానిది ఏమయినా తిన్నాడా? అంటే నాకు తెలిసీ అదేం లేదు. మరి ఏమిటీ మాయ?

విపరీతంగా బాధపడుతున్నాడు.

దానికి వాడవలసిన మందు ఏమిటో నాకు అంతకన్నా తెలియదు. మంట తగ్గి



## జరిగిన కథ

రాచెల్ కలోఫ్ ఉక్రెయిన్‌లో పుట్టి పెరిగింది. తరువాత అమెరికా చేరింది. ఆమె రాసుకున్న ఆత్మకథే ప్రయాణం. రాచెల్ చిన్నతనంలోనే తల్లి మరణిస్తుంది. తన నలుగురు పిల్లలని బంధువుల పంచన చేర్చి, అమెరికా వెళ్ళిపోతాడు తండ్రి. అమెరికాలో ఉంటున్న అబ్రహం రాచెల్‌ను అమెరికా రప్పించి, ఆమెను పెళ్ళి చేసుకుంటాడు. ఇద్దరు ఆడపిల్లల తరువాత కొడుకు పుడతాడు ఆమెకు. దాంతో కోవెనెన్ట్ తంతు జరిపించడానికి అన్ని ఏర్పాట్లు చేస్తాడు అబ్రహం. షెహితాహ్‌ను మాట్లాడతాడు. ఆ రోజు రానేవచ్చింది. అందరూ వచ్చారు.

**ఆ తర్వాత....**

కొంచెం చల్లగా ఉంటుందని గిన్నెలోని వెన్న కొంచెం వేలితో తీసి ఆ ప్రాంతాల్లో రాశాను. అయినా తగ్గిన సూచనలేం కనపడలేదు. ఒకరోజు పండుగ రోజున ఎద్దును పవిత్రంగా చంపిన షొకెట్ వచ్చాడు, ఏదో పని మీద. మోసెస్ పరిస్థితి చూశాడు. అతడు ఆ క్షణంలో దేవుడిలా కనపడ్డాడు. ఆయన వైద్యం చేస్తాడని అంతవరకూ నాకు తెలియదు. జంతువులను చంపడమే ఆయన వృత్తి అనుకున్నాను. ఆయనలో గొప్ప మానవతావాదం ఉంది. నేను వంట చేసే పాత్రలన్నీ పరిశీలించాడు. మోసెస్ పడుకున్న చెక్క మంచం, ఆ మంచంపై పరిచిన ఉన్ని కంబళినీ పరిశీలించి చివరకు వాడు తెలియక ఏదో విష పదార్థాన్ని తిన్నాడన్న నిర్ణయానికి వచ్చాడు.

అయితే ఇప్పుడు కర్తవ్యమేమిటి? మోసెస్ నోటి బాధ ఎలా తగ్గుతుంది? నన్ను కనీసం ఒక్క పెన్నీ అయినా అడక్కుండా, తను వచ్చిన గుర్రం మీదే వెళ్లిపోయి కొద్ది గంటల్లో ఓ ఆయింట్‌మెంట్ తెచ్చాడు. రెండు పూటలా రాయమన్నాడు. అలా నేను శ్రద్ధగా రాస్తున్నా మోసెస్ ఆరోగ్యం కుదుట పడడానికి వారం రోజులు పట్టింది. పెట్టింది తింటూ అక్కలతో హాయిగా ఆడుకోవడం చూశాను ఒక రోజు. మనసు కుదుటపడింది.

ఇక అబ్రహం సంగతి చూస్తే కొంచెం ఆనందంగానే ఉంది. అతను పద్ధతిగా వ్యవసాయం చేస్తూ, ఒకరిద్దరు పనివాళ్లను పెట్టుకుని, సమయానికి వారితో పని చేయించుకుంటూ 'గుడ్ మేనేజర్' అనిపించుకుంటున్నాడు. అవసరమైనప్పుడు వారి నుండే సలహాలు తీసుకుంటున్నాడు. ఈ విపరీత వాతావరణంలో బీడు భూములు దున్నాలంటే చాలా కష్టం.

అబ్రహంకు తమాషా కోర్కె ఉంది. అది నాకు తెలుసు. పిల్లలు పెద్దవాళ్లవుతున్నారు. కొంచెం వారు హాయిగా మసలడానికీ, ఎప్పుడయినా బంధువులు వస్తే కనీసం రాత్రిపూట అయినా వెచ్చటి ఫైర్ ప్లేస్ వద్ద సురక్షితంగా పడుకోడానికి తగిన వసతి కల్పిస్తూ పెద్ద ఇల్లు కట్టాలని అతని కోర్కె.

## శ్రుతి ఓవరాక్షన్ తట్టుకోలేకపోయారట!

లోకనాయకుడి కూతురిగా శ్రుతిహాసన్‌కి బోలెడంత పేరుంది. అంతకు మించి తిక్క కూడా ఉంది అంటూంటారు ఆమె గురించి తెలిసిన వాళ్ళు. ఇటీవల 'సంఘమిత్ర' సినిమా నుంచి తప్పుకోవడానికి గల కారణాలు చిలకపలుకుల్లాగా బాగానే వల్లించింది శ్రుతి. ఈ విషయంలో ఆమె చెప్పిన వన్నీ అబద్ధాలేనంటోంది ఆ సినిమా యూనిట్. డేట్లు తీసుకుని, సినిమా ఫస్ట్ పోస్టర్ విడుదల చేసిన తరువాత ఆమెను తప్పించాల్సి వచ్చిందంటున్నారు. దానికి కారణాలు లేకపోలేదు. ఈ సినిమా కోసం శ్రుతి భారీ రెమ్యునరేషన్ అడిగింది. దానికి ఓకే అన్నారట! ఇక సినిమా కోసం విదేశాలలో శిక్షణ అంటూ భారీగా గుంజిందట! ఇంతా చేసి కథ పూర్తిగా చెప్పలేదంటూ ప్లేటు ఫిరాయించిందట! కథ పూర్తిగా విన్న తరువాత తన డేట్లు ఇచ్చిందనీ, విదేశాలకు శిక్షణకు కూడా వెళ్ళిందనీ, ఆ సమయంలో ఆమె ఓవరాక్షన్ తట్టుకోలేక ఆమెను వద్దనుకున్నామనీ సినిమా యూనిట్ స్పష్టం చేసింది.

**అబ్రహం తనకున్న పొలంలో మూడొంతులు గోధుమ వేశాడు. ఇంకోపక్క కొద్ది స్థలంలో బంగాళదుంప వేశాడు. ఏపుగా పెరిగి కోతకు సిద్ధంగా ఉన్న గోధుమను, బంగాళదుంప పంటను చూసి శ్రమకుతగ్గ ఫలితం అనుకుంటూ సంతోషించాడు. పంట అమ్మగా వచ్చిన డబ్బుతో తన కోరిక నెరవేర్చుకోవాలని ఆశగా ఎదురు చూస్తున్నాడు. ఇంతలోనే అనుకోని అవాంతరం ఎదురైంది. మరి అతని కోరిక నెరవేరిందా? అసలేం జరిగింది?**

స్థలం కోసం ఇబ్బందేం లేదు. అయితే మనసులో పెట్టుకున్న ఈ కోర్కెలు నెరవేరాలంటే డబ్బులు కావాలి. ఏ క్షణాన్న ఏమవుతుందో చెప్పలేని గడ్డి భూముల్ని మేం నమ్ముకున్నాం.

అది 1900 సంవత్సరం.

ఈ సంవత్సరం అనుకున్నట్టు పంట చేతికి వస్తే మార్కెట్ చెయ్యడం ఎంత సేపు? చిన్న చిన్న కోర్కెలు తీరడం ఎంత సేపు? మాకున్న మొత్తం స్థలంలో మూడు వంతులు గోధుమ వేశాం. ఓ పక్క కొంచెం స్థలంలో బంగాళాదుంప. గోధుమ పంట చక్కగా ఉంది. వెన్నులు బంగారు రంగులోకి వచ్చేశాయి. అబ్రహం మొత్తం పొలం అంతా ఓ మారు చూసి వచ్చాడు. "కోతగాళ్లతో మాట్లాడతాను. ఎల్లుండి మధ్యాహ్నానికల్లా కోత అయిపోతుంది. కుప్పలు పెట్టేస్తే నూర్పిళ్లదేముంది... బంగాళాదుంప కూడా బాగుంది. అంచుల వెంట నక్కలు తవ్వి తిన్నా ఎంత లేదన్నా ఓ వేగన్ దుంప అవుతుంది" అన్నాడు సంతోషంగా అబ్రహం చంటాడి పక్కన బల్ల మీద కూచుంటూ.

నేనూ సరదా పడ్డాను.

శ్రమ ఫలిస్తోంది అంటే ఎవరికి ఆనందంగా ఉండదు? అయితే మా సంతోషం ఎన్నో గంటలు నిలవలేదు. రైతు కష్టాలేమిటో అప్పుడే తెలిసి వచ్చింది. చేసిన శ్రమ, పెట్టిన పెట్టుబడి నేలపాల యితే రైతు గతి ఏమిటి? రాత్రి పిల్లలకు భోజనాలు పెట్టి, నేను తిని, పాత్రలు శుభ్రం చేసి రేపటి కోసం వంటచెరకు పొయ్యి వెనుక పేర్చి మంచం మీద నడుము వాల్చేసరికి బయట నల్లగా మబ్బులు కమ్ముకుంటున్నాయి. తీసిన తలుపు రెక్కలు కొట్టుకుంటున్నాయి గాలికి. అవన్నీ మూసి వచ్చి కూచున్నాను. అబ్రహం ఇంట్లోనే ఉన్నాడు. కాబట్టి నాకు కొంత ధైర్యం. పిల్లలు భయపడతారని అబ్రహం కిరోసిన్ దీపం వత్తి కాస్త పెద్దదిగా ఎత్తాడు. ఇల్లంతా కొంత వెలుగుగా మారింది.

కానీ...

క్షణాల్లో ఆకాశం, భూమీ ఏకమయినట్లు కుంభవృష్టి కురిసింది... పెద్ద పెద్ద పిడుగులు. గాలికి ఎంత దన్నుపెట్టినా కిటికీ రెక్కలు విరిగిపోయాయి. తలుపులు కింద భాగం తన్నుకొని ఇంట్లోకి నీరు వచ్చేసింది. నేనూ అబ్రహం తలుపులు విడిపోకుండా చిన్న చిన్న బరువులు అడ్డు పెట్టాం. కంబళీలు తడిసిపోకుండా చూసుకుంటూ అందరం ఓ పక్కనున్న టేబుల్ కిందకు చేరాం.

వర్షం తెల్లవార్లూ కురిసి, తెల్లవారుజామున కొంచెం తెరిపి ఇచ్చింది. అప్పటికి వీధి తలుపు తీయగలిగి బయటకు రాగలిగాము. అయినా పూర్తిగా వెలుగు రాలేదు. అబ్రహం బయటకు వెళ్లి అంతా చూస్తున్నాడు. గుర్రపుశాల విరిగిపోయి గుర్రాలు చనిపోయాయి. వేగన్ బండి కొంత దూరం గాలికి కొట్టుకుపోయి తిరగబడి ఉంది. గోధుమ పంట నాశనం అయిపోయి నీళ్లల్లో ఎక్కడో కింద ఉంది. నీరు ఆరిపోయి తవ్వితే బంగాళాదుంప కొంత దొరకవచ్చు.

బాధాతప్త హృదయంతో బయట రాయి మీద చతికిలబడ్డ అబ్రహం చేతుల్ని నా చేతుల్లోకి తీసుకున్నాను. అంతకన్నా ఏం చేయగలను ఆ క్షణంలో. రోజులు దొర్లుతున్నాయి మామూలుగానే. నాకు తెలిసిన అక్షరం ముక్కలు (యుద్దీష్) రాసి నా పిల్లలకు నేర్పుతున్నాను. మాట్లాడుతున్నారు. గానీ రాతలో ఇదే చూడ్డం. తొందరగానే వారికి ఆ భాషలో చదవడం, రాయడం అలవాటవుతోంది.

అబ్రహం కుటుంబం కోసం చాలా కష్టపడుతున్నాడు. అతని పట్టుదల అంతా కొంచెం పెద్ద ఇల్లు, అన్ని సౌకర్యాలతో ఉన్నది అమర్చుకోవడమే. అబ్రహం ఎక్కడ అప్పు చేశాడో తెలియదు. కొత్త ఇల్లు దీనికి దగ్గర్లోనే కట్టించడం మొదలుపెట్టాడు. ఈ గడ్డిభూముల్లో అకాల వర్షాలు, గాలులు తట్టుకుని నిలబడే కొంచెం గట్టి ఇల్లు ఎత్తుగా ఎలా కట్టుకుంటే బాగుంటుందో ఎవరెవరివో సలహాలు తీసుకుంటూ, తన అనుభవాన్ని జోడిస్తూ ఇంటి నిర్మాణం చాలా భాగం పూర్తి చేశాడు.

మేం ఆ ఇంట్లోకి మారిపోయాం.

దీనికి గాదెలు, కళ్లాలూ దగ్గరే. ఇంట్లోని పశువులకు, గుర్రాలకు కొంచెం గట్టి గదులను ఏర్పాటు చేయమన్నాను. అవి వర్షానికీ, చలిగాలులకూ తట్టుకోవాలి గదా! నేను వీలైనంత పొదుపుగానే ఇంటి ఖర్చులు చేస్తున్నాను.

కొత్త ఇంట్లోకి మారగానే రెండు ఆవులు కొన్నాడు. కోళ్లు చెప్పనక్కర్లేదు. అవి తిరగడానికి, నక్కల బారిన పడకుండా ఉండటానికి చుట్టూ దడి ఏర్పాటు చేయించాడు.

మళ్లీ నేను గర్భవతినయ్యాను.

అమ్మాయి పుట్టింది. పేరు 'బెస్స' అని పెట్టాము.

ఒకరోజు నాకేదో సాయం చేయాలని చెల్లికి వేడినీటి స్నానం చేయించాలని హన్నా వేడినీటిని నింపిన బకెట్ తెస్తూ కాలు జారి కింద పడిపోయింది. మొత్తం వేడినీరు ఆమె శరీరం మీద

పడింది. ఆ శబ్దానికి నేను పరుగున వచ్చేసరికి కళ్లు తేలవేసింది. శరీరం నల్లగా మారిపోతోంది. ఆ క్షణంలో అబ్రహం ఇంట్లో లేడు. మా అత్తగారిని పిలుచుకు రావాలంటే ఐదు మైళ్లు వెళ్లాలి. ఇంట్లో చంటిబిడ్డ గుక్కపట్టి ఏడుపు. నాకు ఏడుపు ఆగ లేదు. దగ్గర్లో సాయం చేసేవారే లేరు. పిల్ల చని పోయిందనే అనుకున్నాను.

అలా అనుకుంటూనే ఆ పక్కనే ముంగాళ్ల మీద కూచున్న నేను స్పృహ తప్పి పడిపోయాను. నా చెవులకు ఏమీ వినబడ్డం లేదు. పెద్దది మిన్నీ గొడ్ల చావిడి శుభ్రం చేస్తూ ఉండవచ్చు. కాసేపట్లో నాకు తెలివి వచ్చి చూస్తే చేతులు కదుపుతోంది. కళ్లవెంట నీళ్లు కారుతున్నాయి. నేను హన్నాని నా చేతుల్లోకి తీసుకొని నా ఒంటి మీదున్న గౌనుతో తడిని తుడ వడం మొదలెట్టాను.

రెండు రోజుల వరకూ మనిషి కాలేకపోయింది. ఇలాగే మరొకసారి.

ఇంట్లో మరో మనిషి సాయం లేదు కదా అని తెల్లవారుజామున నాలుగ్గంటలకే లేవడం అల వాటు చేసుకున్నాను. పొయ్యి రాజెయ్యాలంటే ఎండుగడ్డితో పాటు ఆవు పేడను పిడకలుగా చేసి పొయ్యి వెనక ఆరబెడుతుంటాను. నేనే కాదు ఇక్క డందరూ పేడను పిడకలుగా పొయ్యి వెనక నేల మీద, గోడ మీద వత్తుతారు. పొగ పోవడానికి చిమ్నీ ఎలాగూ ఉంటుంది. పిల్లలకు వేడినీళ్ల స్నానా నికీ, తాగడానికీ, ఆవుకు వేడినీటి స్నానానంతరం పాలు పితకడం, వాటికింత మేతవేసి పాలు వెచ్చ చేసి పిల్లలకు ఇచ్చి, గోధుమ బార్లీతో ఈస్ట్ కలిపి బ్రెడ్ చేయడం ఇవన్నీ చేస్తున్నాను. ఒకరోజు నా పెద్ద కూతురు మిన్నీ, రెండోది హన్నా స్టవ్ దగ్గర కూచుని కోళ్లకు మేత పెడుతున్నారు. మిన్నీ దేనికో వంగింది కాబోలు, స్టవ్ మంటలు ఆమె ఉంగరాల జుత్తుకు అంటుకున్నాయి. మరో పక్క ఒంటి మీద ఉన్ని గుడ్డలకు మంట అంటుకొని, చేతులూ, తొడ దగ్గరా కాలిపోయింది. కంగారులో బట్టలు ఒంటి మీద నుండి తొలగించలేకపోయింది. ఎర్రగా బొబ్బలు...

నాకు కాళ్లూ చేతులూ ఆడలేదు. ఇప్పుడేం చెయ్యాలి? తెలిసిన వైద్యం ఒక్కటే. కొంచెం చల్లగా ఉండేందుకు వెన్న రాయడం. అదే చేశాను.

ఆ మధ్యాహ్నమే మా అత్తగారు వచ్చింది. పరి స్థితి చూసి వెంటనే నేను కోడిగుడ్లను దాచే బుట్ట తీసి ఓ గుడ్డును పగలకొట్టి, గుడ్డు సొనను పాప కాలిన భాగాలకు రాసింది. రెండో రోజు నుండే మానుడు మొదలైంది.

ఇక ఇది తప్ప మా ఇంట్లో ఆ రోజుల్లో మాకే ఇబ్బందీ కలగలేదు. తరువాత అంతా హాయిగానే గడిచింది. గోధుమ ఇంకా ఎక్కువ వేశాం. మార్కెట్‌లో మంచి ధరే పలికింది. ఇంటి వాడుకకు సరిపడా గాదెల్లో వేశాడు అబ్రహం. కొంత గోధు మను టౌన్‌లో మిల్లు పట్టించాడు. అది మాకు ఆరునెలలకు పైగానే వస్తుంది. వెన్న, జున్ను, గుడ్లు తిని పిల్లలూ ఆరోగ్యంగానే ఉన్నారు. అప్పులు తీర్చే శాడు. ఒకరోజు తీరుబడిగా బల్లమీద కూచుని బార్లీ కాఫీ తాగుతూ "ఇంట్లోకి కొత్త ఫర్నీచర్ కొనాలి" అన్నాడు.

పిల్లలకు సరైన మంచాలూ, కంబళ్లూ లేవు. బావగారు ఛార్లీ దగ్గర డబ్బుంది. ఇద్దరూ వెళ్లి ఇంటికి కొత్త ఫర్నీచర్ కొన్నారు. అది నా కలల పంట. నా పంట పండుతోంది, నేను నమ్మిన వ్యవ సాయంలాగే! జీవితం అన్నాక ఒడిదుడుకులు ఉంటాయి. అవి లేకపోతే అసలీ జీవితానికి అర్థం లేదేమో అనిపిస్తుంది.

అవి వేసవి రోజులు. ఆ ఎండలో హాయి గొలిపే వెచ్చదనం ఉంది. అందరూ గబుక్కున ఇంటి పనులు పూర్తి చేసుకొని టౌన్‌కు పోయి ముఖ్యమైన సామానుని షాపింగ్ చేసుకునే రోజులన్నమాట. పోనీ అది కాకపోతే ఇంటి ముంగిట కుర్చీలు వేసు కుని కబుర్లు చెప్పుకోవచ్చు. ఆరుబయట పొలం పక్కన పశువుల్ని కట్టి ఇంత పచ్చిక వేసే రోజులు. అలా చేస్తోంటే పాలూ ఎక్కువ ఇస్తాయి. మనం వేడినీటితో వాటికి స్నానం చేయించనవసరం లేదన్న మాట!

## మనమీదేసెట్రోయ్!

సరసి





## సహచరి




వయస్సుని తట్టిలేపే
అందం ఆమె స్వంతం
ఒక్కోసారి... అది
మనస్సునీ తట్టిలేపే



సంస్కారమూ చూపిస్తుంది!
***
మనిషీ, మహిషీ....

ఒక్కటికాదు... కానే కాదు
గానీ–
ఒక్కోసారి ఇద్దరూ
ఒక్కరిలోనే ఉన్నారనిపిస్తుంది!
***
సిరి వచ్చినప్పుడు
కళ్ళు మసకబారతాయి...
గుండె బండ అవుతుంది...
తను నిష్క్రమించినప్పుడు
కళ్ళు బైర్లు క్రమ్ముతాయి...
హృదయం ద్రవించిపోతుంది!


**–యన్.కే.నాగేశ్వరరావు**
**సెల్: 90303 60988**


ఈరోజు అలాగే గుమ్మం ముందు బయట కూర్చున్నాం. ఎండలోని వెచ్చదనంతో పిల్లలు ఆడు కుంటున్నారు. తుళ్లింత పడుతున్నారు. మాలాగే కొంతమంది ఈ గడ్డిభూములు కొనుక్కున్నవారు కొత్తగా ఇళ్లు వేసుకుంటున్నారు. గాలికి గడ్డి దుబ్బులు ఊగుతోంటే, ఆ సందుల్లోంచి దూరంగా ఇంచు మించు ఐదు మైళ్ల దూరాన అనుకుంటాను వారి ఇళ్ళు కనిపిస్తున్నాయి. ఇళ్లల్లో వంటలు అవుతున్న ట్లున్నాయి. చిమ్నీల్లోంచి పొగలు బయటకు వస్తు న్నాయి. ఇప్పుడిప్పుడే ఈ బీడు భూములు మను షులతో చిక్కబడుతున్నాయని అనిపిస్తోంది.

అబ్రహం పొలంలో కనిపిస్తున్నాడు. పెద్దమ్మాయి మిస్నీ కూడా తండ్రితో అక్కడే తిరుగుతోంది. అలా చూస్తుండగానే నల్లగా మబ్బులు కమ్ముకున్నాయి. వర్షం మొదలయ్యేట్టుంది.

ఇక్కడ వర్షం మొదలయ్యిందంటే అది ఎప్పుడు ఆగుతుందో ఎవరూ చెప్పలేరు. ఆ భయంతోనే పిల్లల్ని దగ్గరకు పిలుస్తూ చుట్టూ చూస్తున్నాను. ఉన్నట్టుండి గాలికి పైకీ కిందకీ విపరీత శబ్దంతో ఊగుతున్న గడ్డిలోంచీ, పెద్దదీ, ఎప్పుడూ నేను చూడని బల్లిలాంటిది పెద్దపెద్ద గోళ్లతో, ఇంకా పెద్ద తోకతో మా వైపే వస్తోంది. నాకు చాలా భయం వేసింది. దానివంక పిల్లలు ఆశ్చర్యంగా చూస్తున్నారు. అది మావైపే వస్తోంటే ధైర్యం చేసి పిల్లల్ని వెనక్కు వెళ్లమని చేతిలో రాయితీసుకొని దానికి సూటిగా విసిరాను. అది వెనక్కు తగ్గింది. మరో వైపు గడ్డి లోకి వెళ్లింది.

చినుకులు టపటపమని పడడం మొదలు పెట్టాయి. పెద్దపెద్ద కేకలతో మిస్నీని, అబ్రహంను పిలిచాను. పిల్లలూ నాతోపాటే అరిచారు. అదేమిటో అని కంగారుగా వస్తున్న అబ్రహం కాలుజారి బురదలో పడ్డాడు. నేను పరుగున వెళ్లి చేయి అందుకున్నాను. ఇద్దరికీ బురద అంటుకుంది. మిస్నీ చురుకైన పిల్ల. మేం ఇలా బురదలో పడి బట్టలు దులుపుకుంటూంటే ఇంటికి పరుగుపెట్టింది. గుర్రా లున్న శాల తలుపు తీసి బంగాళాదుంపలున్న గిన్నె లను వాటి ముందు పెట్టి, అవి తినటం మొదలు పెట్టగానే తలుపు మూసింది. ఈ లోపు వర్షం మొదలైంది.

నా ఏడవ బిడ్డడు 'అల్స్'కి జన్మనిచ్చాను. అది 1907వ సంవత్సరం. గర్భవతిని అయినప్పట్నించీ నాకు రక్తలేమి వల్లనో, శారీరక శ్రమ పెరిగినందు వల్లనో గానీ విపరీతమైన నిస్సత్తువ, బడలికగా ఉంటోంది. ఏమైతేనేం... బిడ్డ ఆరోగ్యంగానే పుట్టాడు. నాకే ఒంట్లో ఏమీ బాగా లేకుండా పోయింది. ఎన్నో పర్యాయాలు స్పృహ తప్పి పడిపోయాను. ఇంటి పనులు పిల్లల నెత్తిన పడ్డాయి. ఒకరోజు ఎంత స్పృహ తప్పి పడిపోయానంటే అసలు నేనెక్కడు న్నానో తెలియలేదు. పిల్లలు చుట్టూ చేరి ఏడుస్తు న్నారు బిగ్గరగా. నన్ను బల్లమీదకు చేర్చారు కాబోలు కొంచెం తెలివి వచ్చేసరికి నా మంచం పక్కన అబ్రహం పిల్లల్ని సముదాయిస్తూనే మరో పక్క ఏడుస్తున్నాడు. ఇదో పరిస్థితి.

అప్పటికి ఏదో గండం గడిచినా...

నా నీరసం, నా ఒంటికి పట్టిన నిస్సత్తువ రోగం చాన్నాళ్లు ఉంది. ఇక ఏ పనీ చెయ్యలేకపోతు న్నాను. మంచం మీదున్న చంటివాడి పనులు సైతం. అబ్రహం ఒక మనిషిని కుదిర్చాడు. అతడు మా ఇంట్లోనే ఓ పక్కన ఉంటూ, ఇంట్లోనే భోజనం చేస్తూ ఉదయం నుండీ రాత్రి వరకూ అబ్రహం చెప్పిన పనల్లా చెయ్యడమే అతని పని.

ఉదయం లేవగానే గొడ్ల సావిడి శుభ్రం చెయ్యడం, పాలు పితకడం ఇవన్నీ అతని పనులే! అతనికీ అందరితో పాటు వంటచేసి పెట్టినా అతడి బట్టలు నేనే ఉతకాలి. ఇంకా చిన్నచిన్న పనులు చేస్తున్నాను.

ఇల్లంతా పిల్లలతో పాడిపంటలతో బాగానే ఉంది. మధ్య మధ్య మా అత్తగారూ మామగారూ, మరిదీ వస్తున్నారు. మా మరిది అన్నగారికి పొలం పనుల్లో సాయం చేస్తూ ఇక్కడే ఎక్కువ రోజులు ఉంటున్నాడు. పిల్లలూ వారి బాబాయికి బాగా చేరిక అవుతున్నారు.

తిరిగి చలికాలం మొదలైంది.

ఇలా అనే కన్నా వేసవి రోజులు ఏవో రెండు నెలలు అటూ ఇటూ ఉంటాయి. మొత్తం చలీ, వర్షా కాలమే కదా! ఆరోజు శుక్రవారం. మాకు పవిత్ర మైన రోజు. చీకటి పడకుండానే భోజనాలు ముగిం చాలి. సంధ్య దీపం నట్టింట వెలగాలి. అన్నీ చేశాను.

నాకే ఉండుండి నీరసం ఆవహిస్తోంది. పొత్తి కడుపులో నొప్పి కొత్తగా బయలుదేరింది. ఆ నొప్పి భరించలేక కింద పడిపోయాను. తెలివి వచ్చీ రాన ట్టుంది. ఆ నొప్పి ఇంకా పెరిగిపోయింది. డాక్టర్‌కి చూపించే పరిస్థితి వచ్చిందనిపించింది. అబ్రహం తన అన్నగార్ని పిలిపించాడు. పరిస్థితి తెలుసుకుని డాక్టర్‌ని ఇంటికే రప్పిస్తానని వెళ్లిపోయాడు. ఇక నాకు రక్తస్రావం అవడం మొదలెట్టింది. తెల్లవార్లూ రక్తం పోవడంతో ఇక నాకు ప్రాణాల మీద ఆశ పోయింది. చనిపోతానన్న నిర్ణయానికి వచ్చాను.

పిల్లలను అబ్రహం ఓదార్చుతున్నాడు. వారు బిక్కుబిక్కుమంటూ దూరంగా నిలబడి నా వంక ఆ చిన్న కిరోసిన్ లాంతరు వెలుతురులో చూస్తున్నారు.

ఇంతలో మా అత్తగారు వచ్చింది.

**(ముగింపు వచ్చేవారం)**



ప్రేమ, పెళ్ళి, పిల్లలు, సంసారం
జీవిత పరమావధి ఇదేనా?
సుఖాల వెంట పరుగులు పెట్టడమే
జీవిత లక్ష్యమా?
జీవితమంటే ఏమిటో తెలుసుకునే ప్రయత్నంలో
ఓ వ్యక్తి సాగించే ప్రయాణమే

సలీం
సీరియల్

# అన్వేషణ

త్వరలో....

# సహేంద్ర తక్షకాయస్వాహా

-జె.రామలక్ష్మి

**నేనున్నాను సుమా అనడానికే జుట్టు. అలుముకుపోయినట్లు ముఖం. తెరవడానికి ఇబ్బంది పడుతున్న కళ్ళు. ముడుచుకున్న చిట్టి చిట్టి చేతులు. కదలకుండా ఉండలేమంటున్న కాళ్ళు.**

**నన్ను బ్రహ్మను చేసిన ఓ పసివాడు. అందరికీ ఏమో కానీ, నాకు మాత్రం అతిలోక సుందరుడు.**

**వాడు నావంక చూడ్డం లేదు. ఈ ప్రపంచంలో ఏ మహా బలుడూ ఇవ్వలేని రక్షణ తనకిప్పుడు లభించినట్లు రేఖ పొత్తిళ్ళలో ప్రశాంతంగా ఉన్నాడు.**

నేను వాణ్ణి చూస్తుంటే, రేఖ నన్నూ వాణ్ణీ మార్చిమార్చి చూస్తోంది. ఇరవై గ్రాండ్‌స్లామ్ టైటిల్స్ నెగ్గిన సెరీనా, రేఖను చూస్తే, 'ఇంత గర్వంగా ఫీలవడానికి నేనేం చెయ్యాలో' అని ఆలోచనలో పడుతుంది.

'బాబు అచ్చం నీ పోలికే అంటున్నారు' అంది రేఖ.

అంతలో ఏమయ్యిందో వాడు కేరుమన్నాడు. కావడానికది ఏడుపే. నాకు మాత్రం శ్రేయా ఘోషల్ పాట!

నేను మళ్ళీ వాణ్ణి చూశాను. పోలికలు తెలిసే వయసా వాడిది. వాణ్ణి చూడగానే ఏదో తెలియని పరవశంతో తనువు. ఎంతసేపు చూసినా తనివితీరని మనసు.

"పోలిక ఎవరిదైనా వీడు మన బాబు" అన్నాను అప్రయత్నంగా.

పెళ్ళి పేరిట పెద్దలూ, పురోహితులూ నన్నూ రేఖనూ ఒక్కటి చేశారని ఇంత కాలం నేను అనుకుంటున్నది భ్రమ. మేమిద్దరం ఒక్కటైంది ఇప్పుడే. మమ్మల్నిద్దర్నీ ఒక్కటి చేసింది వీడే!

అసలుపెళ్ళే వద్దనుకున్న వాణ్ణి. ఆ మాటకే కట్టుబడి ఉంటే ఈ అలౌకికానందం నాకు దక్కేదా? కానీ నేను పెళ్ళి వద్దనడానికి కారణం నా అక్క గీత. తనకీ ఓ కొడుకు పుట్టాడు. ఐనా తనకి పెళ్ళే శాపంగా మారింది.

ఎక్కడుంది తేడా?

***

అక్క గారంగా పెరిగింది. బీకాం చదివింది. ఇంకా చదవాలి అనుకుంది. అంతలోనే మంచి సంబంధం వచ్చింది. వినోద్ అక్క కంటే ఐదేళ్ళు పెద్ద. కంప్యూటర్ ఇంజనీర్. స్వతంత్రంగా ఒక ఇనిస్టిట్యూట్ నడుపుతున్నాడు. అతడికి అక్క నచ్చింది. అక్కకీ అతడు నచ్చాడు.

'ఆడపిల్లకి చదువుకంటే పెళ్ళి ముఖ్యం. వచ్చిందేమో చాలా మంచి సంబంధం' అన్నాడు నాన్న. అది సంజాయిషీ కాదు. సలహా కాదు. అది ఆయన నిర్ణయం.

పెళ్ళై కాపురానికి వెళ్ళేటప్పటికి అక్కకి ఇంకా ఇరవైఒకటి నిండలేదు.

అక్క మావగారు నరసింహం. ఆయన సౌమ్యుడు. ఆయనది బదిలీలులేని ప్రభుత్వోద్యోగం. పెళ్ళైన కూతురు కాపురానికి ఉత్తరాది వెళ్ళింది. బావ ఆయనతోనే ఉంటున్నాడు, పెళ్ళయ్యాక కూడా.

అక్క అత్తగారు శ్యామలాంబ. అత్తాకోడళ్ళవి భిన్న ధ్రువాలు. అత్త ఆచారాలు, సంప్రదాయాలు యమాగా నమ్ముతుంది. అక్క మాత్రం కాలానుగుణంగా ఆ సంప్రదాయాల్లో మంచిని తీసుకోవాలనుకుంటుందితప్ప గుడ్డిగా నమ్మదు. అత్త మహా ఆధునికంగా ఉంటుంది. అక్క ఆధునికతను ఇష్టపడుతుందిగానీ వేలంవెర్రి లేదు. అక్కకి సంగీతంలో ప్రవేశం, సాహిత్యంపట్ల అభిరుచి ఉన్నాయి. సంగీత సాహిత్యాలకీ అత్తకీ ఆమడ దూరం.

వంట చేసేందుకు మడి కట్టుకోవాలంటుంది అత్త. రోజూ పూజలంటుంది. ప్రతి నోమూ చెయ్యాలంటుంది. తనుమాత్రం ఏదీ పాటించదు. 'అత్తగారు చెప్పిందని ఇన్నాళ్ళూ నోరెత్తకుండా పాటించాను. ఇకనైనా నాకు స్వేచ్ఛ కావాలి. నీకు కోడలొచ్చేదాకా నువ్వీ ఇంటి సంప్రదాయం పాటించక తప్పదు' అని అక్కకి బోధించింది అత్తగారు.



ఇంతకీ శ్యామలాంబ కాపురానికి వచ్చాక ఒక్క రోజైనా అత్త మాట పాటించలేదు. అత్తగారేం చెప్పినా, 'మీరు ముసలాళ్ళు. మీ చాదస్తం మీరే పడండి. పడుచువాళ్ళ సరదాలకు అడ్డు చెప్పకండి' అని తెగేసి చెప్పింది.

అది నరసింహానికి తెలుసు. కానీ స్వతహాగా సౌమ్యుడైన ఆయన తన పెళ్ళైన మర్నాడే, తనలో సింహభాగం అర్ధాంగికి ఇచ్చేసి, తను నరుడుగా ఉండిపోయాడు. భార్య శ్యామలాంబ గురించిన నిజాలు కోడలికిచెప్పి 'ఈ లోకంలో నోరున్న వాళ్ళదే రాజ్యం. తనకి నోరుంది. సాగుతోంది. నీకు నోరుంటే నీకూ సాగుతుంది' అని సలహా ఇచ్చాడు.

అక్క స్వతహాగా నెమ్మదస్తురాలు. అయినా మామగారి మాటమీద కొంచెం నోరు వాడి చూసింది. దానికే అత్త అగ్గిమీద గుగ్గిలమైంది. దాంతో మామగారి మద్ధతు ఆశించింది అక్క. కానీ కురుక్షేత్రంలో భీష్ముడి నియమం పాటించే మనిషి ఆయన. తన ప్రతాపం సలహా ఇవ్వడం వరకే. గొడవ వస్తే బాసటగా నిలిచేది అత్తకే!

'మిమ్మల్ని నమ్ముకుని అనవసరంగా గొడవ పడ్డాను' అని మామగారి దగ్గర వాపోయింది అక్కయ్య.

'మా అమ్మా ఇదే మాటంది. చరిత్ర పునరావృత మైంది' నిట్టూర్చాడాయన. కోడలి అవస్థకి జాలిపడి, కొడుకుచేత వేరుకాపురం పెట్టించాలనుకున్నాడు. ఆ ప్రసక్తికే శ్యామలాంబ ఆయన మీద అంతెత్తున లేచింది. 'ఇన్నాళ్ళూ ఈ ఇంట్లో నాది బానిస బ్రతుకు. నా కొడుకు హయాం వచ్చాక ప్రాణం హాయిగా ఉంది. ఇప్పుడైనా నేను సుఖంగా ఉండడం మీకిష్టం లేదా' అందామె.

"కొత్త కాపురం. వాళ్ళకి కొన్నాళ్ళైనా, వేరుగా స్వతంత్రంగా ఉండాలనుండదా?" అన్నాడు నరసింహం.

'ఆ మాట మీరు కాదు, వాణ్ణి చెప్పమనండి' అంది శ్యామలాంబ.

బావకి తల్లంటే ఇష్టం. ఆమె రాజసానికి ఎంతటి వారైనా తల వంచాల్సిందేననీ, వ్యవహారంలో ఏ వ్యాపారవేత్తా ఆమెకి సాటిరారనీ గర్వంగా చెప్పు కుంటాడు. ఆ ధైర్యంతోనే శ్యామలాంబ ఆ మాట అంది.

తల్లి నమ్మకం నిలబెట్టాడు మా బావ. 'అమ్మ మాతోనే ఉంటుంది' అన్నాడు. తండ్రి రిటైరయ్యాక కూడా ఆ కుటుంబం ఉమ్మడి కుటుంబంగానే కొన సాగింది.



బావని నొప్పించడం ఇష్టంలేక, చాలాకాలం అత్త ఆగడాలన్నీ మౌనంగా భరించింది అక్క. కానీ ఎన్నాళ్ళు? తెల్లారి లేవగానే చన్నీళ్ళ స్నానంచేసి, దేవుడికి పూజచేసి, టిఫినూ కాఫీ చెయ్యాలి. అద య్యేక పదిలోగా పనిమనిషిని ఓ కంట కనిపెట్టు కుంటూ భర్తకీ, మామగారికీ వంటచేసి లంచ్ ప్యాక్ చేసివ్వాలి. బియ్యం, పప్పులు, కూరల దగ్గర్నుంచి అన్ని కొనుగోళ్ళూ తనే చెయ్యాలి. రాత్రి వంట బాధ్యత కూడా తనదే.

శ్యామలాంబ ఏ పనీ ముట్టుకోదు. మగాళ్ళు ఇంటి పనులు చెయ్యకూడదన్నది ఆమె రాజ్యాంగ శాసనం. దాంతో ఆ ఇంట్లో ఆడపనులూ, మగ పనులూ అక్కవే! కొడుకు, భర్త వెళ్ళిన కాసేపటికి శ్యామలాంబ భోజనం చేస్తుంది. బయటకెళ్ళినప్పుడు రోజుకో హెయిర్ స్టయిల్, చీరకట్టు, మ్యాచింగ్ దుస్తుల్లో టీవీ సీరియల్ మహిళల లెవల్లో ఉంటుంది. బయట ఆమెకి తనలాంటి కొందరు ఫ్రెండ్స్ ఉన్నారు. రోజూ పేకాట, అప్పుడప్పుడు కిట్టీ పార్టీలు. అవీ ఆమె బయటి వ్యాపకాలు.

ఆమెకి బొత్తిగా ఇల్లుపట్టదని చుట్టుపక్కల వాళ్ళు చెవులు కొరుక్కుంటారు కానీ, ఆమె బయటికెళ్ళడం అక్కకిష్టమే. ఇంట్లో ఉంటే ఆమె పెద్ద సౌండ్‌తో టీవీ అయినా చూస్తుంది. లేదా అక్క చేసే ప్రతి పనికీ వంకలతోనో, సలహాలతోనో జోక్యం చేసుకు టుంది. ఆమె లేకపోతే ఇల్లు ప్రశాంతంగా అని పిస్తుంది అక్కకి.

పెళ్ళైన రెండేళ్ళకి అక్కకి కొడుకు పుట్టాడు. మనవడి పుట్టుక కూడా శ్యామలాంబలో కానీ, ఆమె దినచర్యలో కానీ ఏ మార్పూ తేలేదు. అక్కకి మాత్రం ఉన్న పనులకుతోడు, చంటిపిల్లాణ్ణి కంటికి రెప్పలా చూసుకునే బాధ్యత జతపడింది. అత్తవైపు నించి కూడా అదనంగా బిడ్డలపెంపకంమీద సల హాలు మొదలయ్యాయి. అవి అక్కని రెచ్చగొట్టడా నికి మాత్రమే పనికొచ్చేవి.

అక్క తెలివైనది, చురుకైనది. పనులెన్ని ఉన్నా ఆమెకు కష్టం అనిపించడం లేదు. కానీ శ్యామ లాంబ తీరు ఆ ఇంటిని నరకం చేస్తోంది. తను వండుకోదు. అక్క ఏం వండినా నచ్చలేదని వేరే చెయ్యమంటుంది. వేరే చేసిందానికి వంకలెన్నో. కావాలనే పాడు చేశావంటుంది. అక్క తనకు నచ్చి నట్లు ఇల్లు సర్దుకుంటే, అక్కకెలా నచ్చుదో అడిగి తెలుసుకుని మరీ అలా మార్పులు చేస్తుంది. ఏదో విధంగా అక్కని రెచ్చగొట్టడమే తన ధ్యేయమన్నట్లు ప్రవర్తిస్తుంది శ్యామలాంబ.

గొడవ పడడం అక్కకి ఇష్టం ఉండదు. కానీ సహనానికి కూడా అంతుంటుంది కదా! ఇంట్లో అత్తాకోడళ్ళకి అడపాదడపా గొడవలయ్యేవి. కానీ అత్తనోటికి జడిసి మధ్యలోనే తగ్గిపోయేది అక్క. కానీ అలా ఎన్నాళ్ళు? చివరికి ఒకరోజు బావకి చెప్పనే చెప్పింది అక్క. అతడు అనాసక్తంగా విని, 'మీరిద్దరూ ఇంట్లో ఉంటారు. మీరూ మీరూ సర్దుకుపోవాలి కానీ, ఇందులో నేనేం చెయ్యగలను?' అన్నాడు నిర్లిప్తంగా.

**అత్త ఆరళ్లబారిన పడింది అతడి అక్క. నిత్యం రాచిరంపాన పెడుతోంది. తన తల్లికూడా కాబోయే కోడల్ని ఇలాగే చేస్తుందని ఊహించాడతను. సాకులు చెబుతూ పెళ్ళికి తిరస్కరిస్తున్నాడు. కొడుకు అంతరంగం గ్రహించిన తల్లి కోడలికోసం పేగుబంధాన్నే పణంగా పెట్టింది. కొడుక్కి వాగ్దానం చేసి దూరంగా వెళ్ళిపోయింది. కానీ కొడుకు తన బాధ్యత గుర్తించగలిగాడా? కన్నపేగుబంధం విలువ తెలుసుకోగలిగాడా?**

అక్కకి అతడి తత్వం తెలుసు. అతడితో గొడవ పడితే ఇంట్లో శత్రువులసంఖ్య పెరుగుతుంది. తను అత్తకి ఇంకా లోకువైపోతుంది. అందుకని, 'మీరు చెయ్యగలిగిందే అడుగుతున్నాను. బాబు పుట్టినప్ప ట్నించీ ఒక్కదాన్నీ అన్ని పనులూ చేసుకోలేకపోతు న్నాను. మీరు ఇంట్లో కాస్త సాయం చెయ్యండి' అంది.

బావ వెంటనే, 'నాకు ఇంటి పనులు రావు. మా అమ్మ నాకెప్పుడూ ఏ పనీ చెప్పలేదు' అన్నాడు.

అక్క తడుముకోలేదు. 'మా అమ్మ కూడా నాకె ప్పుడూ ఏ పనీ చెప్పలేదు. నాకూ ఇంటి పనులు రావు. వయసొచ్చాక అమ్మ తోడొక్కటీ చాలదు కాబట్టి, మీకోసం నేర్చుకున్నాను. మీరూ అలా అనుకుంటే నాకోసం నేర్చుకోండి. లేదూ, మీరు మీ అమ్మతోనే ఉండండి. నేను నా పుట్టింటికి వెళ్ళి పోతాను' అంది.

ధిక్కార స్వరం వినిపించేసరికి బావలో కొంత చలనం వచ్చింది. మర్నాడు తనూ వంటింట్లోకి అడుగుపెట్టాడు.

శ్యామలాంబ ఊరుకుంటుందా? 'ఆడంగి పనులు చెయ్యడానికి సిగ్గు లేదూ?' అని కొడుకును కసి రింది.

బావ బిక్కమొహం వేస్తే అక్క కలగజేసుకుని, 'ఇంట్లో ఆడవాళ్ళు కిట్టీ పార్టీలనీ, పేకాటలనీ మగ రాయుళ్ళలా ఊరమ్మట తిరుగుతుంటే, కష్టం సుఖం తెలిసిన మగాళ్ళు ఇంటి పనుల్లో సాయం చేస్తే తప్పేం లేదులెండి' అంది భర్తతో.

కోడలు అంత మాట అనగలదని ఊహించని శ్యామలాంబకి ఉక్రోషం వచ్చింది. 'ఈ ఇంట్లో అద నంగా ఉన్నది నేనూ, మా ఆయనేగా! ఇంతమాట పడ్డాక మీతో కలిసుంటానా? ఇక మీదట మా వంట మాదే!' అంది.

పోనీలే, ఈ వంకన కొడుకుచేత వేరుకాపురం పెట్టించొచ్చని నరసింహం ఆశపడ్డాడు. కానీ శ్యామ లాంబ వ్యూహాత్మకంగా, తాముంటున్న గదిలోనే వంటకి మాత్రం వేరు పడతానంది. ఆ ఏర్పాట్ల బాధ్యత బావది. అంటే పరోక్షంగా అక్కది.

అలాగైనా ఆ ఇంట్లో ఎంతోకొంత ప్రశాంతత వస్తుందని ఆశించింది అక్క. కానీ శ్యామలాంబ రూటే వేరు. ఆమె ఇరుగుపొరుగుల్ని ఇంటికి పిలిచి 'నేనిక్కడ వండుకుంటున్నా' అంటూ తన గదిలో ఏర్పాట్లు చూపించేది. ఇంటికెవరు వచ్చినా ముందు ఆ విషయమే చెప్పేది. అయితే బియ్యం, పప్పులు, పాలు వగైరాలన్నీ కోడలే ఇస్తుందనీ, గ్యాసైపోతే కోడలే తెప్పిస్తుందనీ చెప్పేది కాదు. అక్కని ఓ కంట కనిపెడుతూ, అక్క అటెళ్ళగానే, వండిన వాటిలో తనకు నచ్చినవి పట్టుకుపోయేది. అక్క లేనప్పుడు అక్కకి నచ్చని విధంగా వంటిల్లుని సర్ది వెళ్ళిపోయేది.

ఇదంతా అక్క గమనించేది. అయినా తనపై శత్రుభావంతో ఉంటుందన్న అసంతృప్తి తప్పితే అక్కకి ఆమెపై కోపం లేదు. అత్తగారికి ఇష్టమైన వంటకాలు చేసినప్పుడు కాస్త ఎక్కువే చేసేది. ఆమె చెప్పకుండా తీసుకెళ్ళినప్పుడు, 'నన్నడిగి తీసుకెళితే ఇంకా సంతోషించేదాన్నిగా' అనుకునేది.

పెద్దది, తల్లిలాంటిది అని అత్తని అభిమానిం చాలనుకునేది అక్క. కానీ శ్యామలాంబ పని మను షుల దగ్గరా, ఇరుగుపొరుగులతోనూ, అక్కమీద బోలెడు చాడీలు చెప్పేది. కొందరు అక్కకి చేరవేసే వారు. అక్కమీద ప్రేమతోకాదు, అత్తాకోడళ్ళు గొడవ పడితే ఆనందించాలనుకునే అదోరకం శాడిజం.

అక్క క్రమంగా ఇరుగుపొరుగుల్ని కలవడం తగ్గించింది. పనిమనుషులతో కూడా ముభావంగా ఉండేది. ఎవరితో మాట్లాడితే ఏం వినాల్సొస్తుందో అనే భయం.

అక్కకి ప్రేమించే తల్లిదండ్రులున్నారు. కానీ తన జీవితం అత్తింటితో ముడిపడింది. అత్తింట్లో అభి మానించే భర్త, అర్థం చేసుకున్న మామగారు ఉన్నారు. కానీ ఇంట్లో అత్త తనని శత్రువులా భావిస్తోంది. చుట్టుపక్కల తన మీద అదేపనిగా దుష్ప్రచారం చేస్తోంది.

మానసికంగా అక్కకి చెప్పలేనంత అసంతృప్తి. ఆరోగ్యం కూడా పాడైపోతోంది. ఇంట్లో పరిస్థితులు మెరుగయ్యే దాకా, మరో బిడ్డ కూడా వద్దనే నిర్ణ యానికి వచ్చింది.

'పెళ్ళి నాకు శాపమైంది. నాకు శాపమైతే బావకీ శాపమే మరి. కానీ బావకి ఏం చెబుతాను? తల్లికి దూరం కమ్మని ఎలా చెబుతాను? సర్దుకుపోవడమే కాపురం అనుకున్నాగానీ అది ఇద్దరి కాపురం కాదు. దాని మీద ఇంకెందరి ప్రభావమో ఉంటుంది. తమ్ముడూ! నువ్వు పెళ్ళి చేసుకుంటే మన అమ్మ నీ భార్యకి శ్యామలాంబ అవుతుంది. నిన్ను తన ప్రాణంగా ప్రేమించిన అమ్మని నువ్వు శాపంగా భావించే రోజు వస్తుందంటే నాకు ఏదోలా ఉంది. పెళ్ళి చేసుకునే ముందు బాగా ఆలోచించుకో' అంది అక్క.

అక్క ఆ మాట అమ్మకి కూడా చెప్పినట్లుంది. మా వాళ్ళు చెప్పిన ప్రతి సంబంధాన్నీ వద్దంటున్నాను నేను. కానీ ఒకరోజు అమ్మ, "నాన్నా! మీ నాన్న రిటైరయ్యేదాకానే మనం కలిసుండేది. రిటైరయ్యాక స్వగ్రామంలో స్థిరపడాలని ఆయన కోరిక. ఈలోగా నీ పెళ్ళి చూసే అదృష్టం మాకివ్వరా" అంది.

అందులో అమ్మ కోరిక కంటే, తను మా కాపు రంలో జోక్యం చేసుకోనన్న హామీయే ఎక్కువ కని పించింది. అది నన్ను కాస్త బాధించింది. రిటైరయ్యాక అమ్మానాన్న నాతో కలిసి ఉండాలన్న నా కోరిక గగన కుసుమమైపోతుందన్న ఆలోచన నన్ను పెళ్ళికి మరింత విముఖుణ్ణి చేసింది. కానీ, అమ్మ బల వంతం మీద అయిష్టంగా, అసంతృప్తిగా అయి తేనేం అమ్మ చూసిన రేఖనే పెళ్ళి చేసుకున్నాను.

రేఖ మంచిది. పెళ్ళై కాపురం పెట్టిన తర్వాత స్వర్గసుఖాలు అనుభవానికొచ్చాయి. అయినప్పటికీ, రేఖ వల్ల అమ్మ శ్యామలాంబగా మారిపోవచ్చన్న ఆలోచన నన్ను మధ్య మధ్య అసంతృప్తికి గురి చేస్తుండేది. కానీ ఇప్పుడు మా పెళ్ళిని సార్థకం చేసిన బాబుని చూస్తుంటే నా ఆలోచన ఎంత తప్పో అని పిస్తుంది.

***

బాబుకి విజయ్ అని పేరు పెట్టాం. విజ్జూ అని

## చక్రపాణి చమత్కారం

"గుండమ్మ కథ సినిమాలో నాకు వేషం లేదా?"

చక్రపాణిగారిని అడిగాడు రేలంగి.

"పిక్చర్‌లో కామెడీ వేషమే లేదు" చెప్పారు చక్రపాణిగారు.

"మరి రమణారెడ్డికి ఎలా ఇచ్చారు?"

"అది కామెడీ విలన్" అన్నారు చక్రపాణిగారు.

"కామెడీ విలన్ నేను చేయలేనా?"

"నువ్వు చేస్తావు, ప్రేక్షకులు చూడరు."

## చక్రపాణిగారి టిపికల్ రిప్లై



"చక్రపాణిగారూ, నిన్న ఎన్టీఆర్‌కి 'భీష్మ' మేకప్ టెస్ట్ తీశాం. అద్భుతం! మీరు అసలు గుర్తుపట్టలేరు" బి.ఎ.సుబ్బారావుగారు అన్నారు.

"గుర్తుపట్టలేనప్పుడు ఆ వేషం అతను వెయ్యడమెందుకు? నువ్వే వెయ్యొచ్చుగా" చక్రపాణి కామెంట్.

సుబ్బారావుగారు నిర్ఘాంతపోయి 'నిజమే' అని పకపకా నవ్వారు.

సేకరణ: ఎన్.తారక రామారావు

పిల్చుకుంటున్నాం. వాడు ఊc అంటే ఉట్టికెగరకుండానే స్వర్గానికెగిరే వాళ్ళం. చిరునవ్వు విసిరితే నందనవనంలో పారిజాత సుమాల్ని దర్శించే వాళ్ళం. వాడి కదలికలో రంభా ఊర్వశీ నర్తించే వాళ్ళు. భాష రాని వాడి పిలుపులో అమర కవుల గొంతులు కలిసేవి.

వాడు మాకు దేవుడిచ్చిన వరం. కొందరు సాటివారి దృష్టిలో మాలోని కోతులకి కొబ్బరికాయ. ఎంత ఆలోచించినా వాడంటే మాకెందుకింత అనుబంధమో అర్థం కాదు! ఎందుకంటే, వయసు పిలుపుతో మోహావేశం మమ్మల్ని దగ్గర చేస్తుంటే కెవ్వుమంటాడు. వాడికేమైందో అన్న గాభరాలో, రసభంగానికి కలిగిన కోపం తెలియకుండానే పోతుంది.

స్నానంచేసి నీట్‌గా డ్రెస్ చేసుకుని ఆఫీసుకి వెళ్ళే ముందు ముచ్చటపడి ఒక్కసారి ఎత్తుకుంటే, ఆసాంతం తడిపేస్తాడు. బట్టలు మార్చుకోవాలి. ఆఫీసుకి లేటు. మాట పడాల్సొచ్చినా వాణ్ణి తల్చుకుని ముసి ముసిగా నవ్వులు నవ్వడంతప్ప ఏ మాత్రం చిరాకు రాదు.

కలిసి భోంచేయడంకోసం వాడికి నిద్రవచ్చేదాకా ఆగి, మంచి ఆకలిమీద భోంచేస్తుంటే, వాడికి డైపర్ మార్చాల్సిన పరిస్థితి. అసహ్యం కలిగితే అది క్షణ మాత్రమే.

వాడు బోర్లాపడితే మత్స్యావతారం, పాకితే కూర్మావతారం, మట్టిలో ఆడితే వరాహావతారం, అల్లరి చేస్తే నరసింహావతారం, నిలబడితే వామనావతారం, ఇరుగుపొరుగులతో గొడవపడితే పరశురామావతారం. వాడేం చేసినా మాకు అవతార పురుషుడే. ఆ అవతారపురుషుడికి అసహాయతలూ ఉన్నాయి. ఆర్నెల్లప్పుడు తల బిందెలో చిక్కడిపోయింది. ఎలాగో తీసి రక్షించుకున్నాం. ఏణ్ణర్థం వయసులో గోలీకాయ మింగేశాడు. కక్కించేదాకా ప్రాణం విలవిల్లాడిపోయింది. మూడేళ్ళప్పుడు స్కేటింగంటూ ఇల్లంతా పౌడరు పోసేసి జారిపడి, చెయ్యి విరగ్గొట్టుకున్నాడు. ఆరువారాలు ప్లాస్టరు చేతితో చూడలేక కళ్ళనీళ్ళు పెట్టుకున్నాం. వాడికి దుడుకుతనం ఎక్కువ. ఇరుగు పొరుగు పిల్లల్ని కొడతాడు. వాళ్ళ ఇళ్ళల్లో వస్తువులు పాడు చేస్తాడు. వాళ్ళు ఫిర్యాదు చేస్తే మేము వాడి తరఫున క్షమాపణ చెబుతాం. బుద్ధిగా ఉండమని వాడికి హితవు చెబుతాం. వాణ్ణి భరించడం, సమర్థించడం, రక్షించడమూ మా నిత్య కృత్యంలో భాగం. వాడు మాకు ప్రాణం.

అమ్మ, నాన్న ఎప్పుడైనా వచ్చి నాలుగురోజులు ఉండి వెళ్ళేవారు. వీణ్ణి వదలాలని లేదురా అని ఎంతో బాధగా వెళ్ళిపోయేది అమ్మ. "మీరిక్కడే ఉండిపోండి అత్తయ్యా! మాకూ సాయంగా ఉంటుంది" అనేది రేఖ. నాకూ బలవంతం పెట్టాలని ఉండేది. కానీ అమ్మని శ్యామలాంబ అవతారంలో చూడాల్సొస్తుందన్న భయం! ఒకసారి మా మేనత్త వచ్చింది. విజ్జూ గురించి మేము చెప్పింది వింది. వాడి తీరు చూసి, 'రూపు రేఖలు తల్లివే కానీ, బుద్ధులన్నీ పూర్తిగా నీవేరా! చిన్నప్పుడు నీతో వేగలేక మీ అమ్మ చచ్చేదనుకో' అంది.

ఉలికిపడ్డాను. ఇన్నాళ్ళూ విజ్జూ ముచ్చట్లకి మురిసిపోతున్నాను కానీ, ఇలాంటివన్నీ ప్రతి తల్లీ తండ్రీ అనుభవించే ఉంటారు కదా! ఒకప్పుడు నేను విజ్జూ, అమ్మ, రేఖ. ఇప్పుడా విజ్జు ఆ రేఖకి దూరంగా ఉండాలనుకుంటున్నాడన్నమాట. మరికాస్త దూరమెడితే, ఒకప్పుడు వినోద్ బావ విజ్జూ, శ్యామలాంబ రేఖ. ఆ శ్యామలాంబ కారణంగా నేను మా అమ్మకి దూరంగా ఉండాలనుకుంటున్నాను.

"అత్తయ్యా! నిజం చెప్పు. నాతో వేగలేకపోతున్నానని అమ్మ నీ దగ్గర బాధపడిందా?" అడిగాను సాలోచనగా.

అత్తయ్య నవ్వి, 'నీకింకా చిన్నతనం పోలేదురా! ఒక్కో పిల్లాడు ఒకోలా ఉంటాడు. వాడు కొందరికి నచ్చుతాడు. కొందరికి నచ్చడు. కానీ తల్లికీ, తండ్రికీ ఎప్పుడూ నచ్చుతారు. కన్నవారికీ, పిల్లలకీ మధ్య పేగుబంధమే కాదు, బాధ్యత కూడా ఉంటుంది. పుట్టినప్పట్నించీ పది పన్నెండేళ్ళొచ్చేదాకా పిల్లలది అసహాయ దశ. అప్పుడు పేగుబంధం బాధ్యతగా మారి వాళ్ళని అన్ని విధాలా భరిస్తుంది ఆదుకుంటుంది' అంది.

నా ఆలోచనలు చాలా దూరం వెళ్ళాయి. తమని తాము అర్థం చేసుకోలేని, రక్షించుకోలేని ఒక అసహాయ దశలో ఉన్న పిల్లల్ని తల్లిదండ్రులు సర్వశక్తులూ ఒడ్డి పెంచి పెద్ద చేస్తారు. కారణం పేగుబంధం. అదే పేగుబంధం ఎదిగిన పిల్లలకు ఉండదా? వయసుమీదపడిన తల్లిదండ్రుల్ని ఆదరించమని చెప్పదా? అప్పుడు నాకు స్ఫురించింది అక్కకీ, శ్యామలాంబకీ మధ్యనున్న సమస్యకి పరిష్కారం.

పేగుబంధం బావకీ, శ్యామలాంబకీ మధ్య ఉంది. కానీ బావ తన తల్లి బాధ్యత అక్కకి అప్పగించాడు. కానీ శ్యామలాంబమాత్రం అక్కని తన బాగోగులు చూసే మనిషిగా గుర్తించలేదు. అలాంటప్పుడు శ్యామలాంబ బాధ్యత బావే పూర్తిగా స్వీకరించాలి. అదే ఆ సమస్యకి పరిష్కారం. రేఖకీ, అమ్మకీ మధ్య సమస్యలు తలెత్తవచ్చు. అది నా ఊహ మాత్రమే కావచ్చు. కానీ అమ్మ బాధ్యత పూర్తిగా నేను స్వీకరిస్తే పేగుబంధానికి న్యాయం చేసిన వాడినౌతాను కదా! ఇంద్రుడిలాంటి తల్లి కోడలు కోసం తనలో తక్షకుడికి ఆశ్రయమిస్తే సహేంద్ర తక్షకాయస్వాహా అని ఇద్దర్నీ తనే భరించడం కొడుకు బాధ్యత అవుతుంది మరి.

నేనిలా ఆలోచిస్తుండగా, విజ్జూ విసిరిన బంతి ఒకటి అత్త కళ్ళకి తగిలినట్లుంది. కన్ను ఎర్రగా అయింది.

"విజ్జూ" అని అరిచింది రేఖ మందలిస్తూ.

"చిన్న పిల్లవాడు వాడికేం తెలుసు. నాకు తగిలింది మరీ అంత పెద్ద దెబ్బ కాదులే" అంది అత్త కంటి మంటని ఓర్చుకుంటూ. మేనల్లుడి కొడుకు కదా, తనదీ పేగు బంధమే మరి.

**సెల్: 98856 20065**



## సోనాక్షి ఓకే అంటుందా?

ఇదేమీ పెళ్ళి ప్రపోజల్ కాదులెండి. తెలుగులో ఓ సినిమాలో ఐటెంసాంగ్ చేయడానికి సోనాక్షి ఓకే అంటుందా? లేదా? అన్నదే అనుమానం. రామ్‌చరణ్ హీరోగా సుకుమార్ దర్శకత్వంలో వస్తున్న సినిమాలో ఐటెంసాంగ్ కోసం సోనాక్షిని సంప్రదించారట! ఇందు కోసం భారీ మొత్తాన్ని ఇవ్వజూపారు. అంతా బాగానే ఉన్నా ఈ పాటకు సోనాక్షి ఎలాంటి సమాధానం ఇవ్వడం లేదట! ఆమె అంగీకరించిందని కొందరు, అంగీకరించలేదని మరికొందరు అంటున్నారు. ఎలాగైనా మెగా క్యాంపులోకి అడుగు పెడితే వరుసగా నాలుగైదు సినిమాలు ఖాయం అన్న టాక్ ఉంది కనుక సోనాక్షి ఈ ప్రపోజల్‌కి సానుకూలంగానే స్పందించవచ్చు అంటున్నారు టాలీవుడ్ జనాలు.



జూలై 5 నుంచి
జూలై 11 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

బదిలీలు, వేడుకలు, పెట్టుబడులపై ఈవారం దృష్టి పెడతారు. బుధవారం కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. గృహ రుణాల కోసం ప్రయత్నిస్తారు. 6, 7 తేదీల్లో వేడుకలతో ఇల్లు సందడిగా ఉంటుంది. బదిలీలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 8, 9, 10 తేదీల్లో పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. బదిలీలు, మార్పులకు అనుకూలం. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల్లోని వారు పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 11న సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. బ్యాంకులు, ఆస్పత్రులు, హోటల్ రంగాల వారికి ఆర్థికంగా లాభదాయకం.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వాగ్వివాదాలకు దూరంగా ఉండండి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు అనుకూలం. 6, 7 తేదీల్లో ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం అందుకుంటారు. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. 8, 9, 10 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు, చర్చల్లో నిదానం అవసరం. ఉన్నత విద్యా ప్రవేశాల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 11న ప్రముఖులతో చర్చలు ఫలిస్తాయి. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, ఉన్నత విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వృత్తి వ్యాపారాల్లో ఆర్థికంగా నిరుత్సాహంగా ఉంటుంది. 6, 7 తేదీల్లో స్పెక్యులేషన్లు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 8, 9, 10 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఖర్చులు అధికం. 11న ఆర్థిక విషయాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

వేడుకలు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం పొదుపు పథకాలపై ఆశించిన ప్రతిఫలం రాకపోవచ్చు. విద్యార్థులకు శుభప్రదం. 6, 7 తేదీల్లో కృషి రంగంలో పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. 8, 9, 10 తేదీల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. స్పెక్యులేషన్లలో ఆచితూచి వ్యవహరించాలి. 11న పన్నులు, బీమా, పెన్షన్ వ్యవహారాలపై దృష్టి సారిస్తారు. రుణాలు మంజూరవుతాయి. పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక పరిస్థితి సమీక్షించుకుంటారు.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

ఆరోగ్యం, విద్యావిషయాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం కుటుంబవ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారికి అనుకూలం. 6, 7 తేదీల్లో దూరంలో ఉన్న ప్రియతముల కలయిక ఆనందం కలిగిస్తుంది. విద్యార్థులకు లక్ష్య సాధనలో ఆటంకాలు ఎదురవుతాయి. 8, 9, 10 తేదీల్లో విందు వినోదాల్లో పాల్గొంటారు. వృత్తి, వ్యాపారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. 11న భాగస్వామికి సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. న్యాయ, రక్షణ, విదేశీ వ్యవహారాల రంగాల వారికి శుభప్రదం.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

ప్రేమానుబంధాలు, పెట్టుబడులు, బృంద కార్యక్రమాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం సోదరీ సోదరుల వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. 6, 7 తేదీల్లో ప్రియతముల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారు జాగ్రత్తలు పాటించాలి. 8, 9, 10 తేదీల్లో వేడుకలు, శుభకార్యాల్లో పాల్గొంటారు. బంధుమిత్రుల కలయిక ఆనందం కలిగిస్తుంది. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రేమానుబంధాలు బలపడతాయి. 11న బంధుమిత్రులతో విందుల్లో పాల్గొంటారు. కొత్త పరిచయాలు లక్ష్య సాధనకు ఉపకరిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, చిన్నారుల విషయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా నిరుత్సాహకరంగా ఉంటుంది. 6, 7 తేదీల్లో ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 8, 9, 10 తేదీల్లో బదిలీలు, మార్పులు కొంత నిరుత్సాహం కలిగిస్తాయి. పెద్దలు, పైఅధికారుల వైఖరిలో సానుకూలమైన మార్పు గమనిస్తారు. కుటుంబ విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 11న వృత్తి వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. పెద్దల సహకారంతో చేపట్టిన పనులు పూర్తి చేస్తారు.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

వ్యూహాలు, విద్య, ఆర్థిక వ్యూహాలు, సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధవారం ప్రణాళికలు ఫలించకపోవచ్చు. రక్షణ, న్యాయ, బోధన రంగాల వారికి కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. 6, 7 తేదీల్లో ఆర్థిక వ్యవహారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ఖర్చులు అధికం. 8, 9, 10 తేదీల్లో అడ్మిషన్ల విషయంలో అంచనాలు తప్పే అవకాశం ఉంది. విద్యార్థులకు శుభప్రదం. చర్చలు, సమావేశాలు, ప్రయాణాలు ఆనందం కలిగిస్తాయి. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 11న రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ప్రోత్సాహకరం. వేడుకలు, సమావేశాలకు ఏర్పాట్లు చేస్తారు.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

రుణప్రయత్నాలు, ఆరోగ్యం, చిన్నారుల విషయాలు, దూరప్రయాణాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధవారం ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. మనశ్శాంతి లోపిస్తుంది. 6, 7 తేదీల్లో రుణప్రయత్నాలు ఫలిస్తాయి. గత స్మృతులు నెమరువేసుకుంటారు. 8, 9, 10 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. తొందరపాటు నిర్ణయాల వల్ల కొంత నష్టపోయే ప్రమాదం ఉంది. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. పెట్టుబడులు లాభిస్తాయి. 11న విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఆర్థికపరమైన చర్చలు, ప్రయాణాలు ఫలిస్తాయి. సన్నిహితుల ఆంతరంగిక విషయాల్లో జోక్యం చేసుకోవాల్సి రావచ్చు.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, కాంట్రాక్టులు, భాగస్వామి విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం ప్రియతముల కోసం ఖర్చులు అధికం. స్నేహానుబంధాలు బలపడతాయి. 6, 7 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. బంధుమిత్రుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. 8, 9, 10 తేదీల్లో పందాలు, పోటీల్లో విజయం సాధిస్తారు. వివాహ నిర్ణయాలకు అనుకూలం. జనసంబంధాలు విస్తరిస్తాయి. ఖర్చులు అధికం. 11న పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. షేర్లు, మ్యూచువల్ ఫండ్ లావాదేవీలకు అనుకూలం.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

ఇంక్రిమెంట్లు, ఉద్యోగ ప్రయత్నాలు, ఆరోగ్య విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఉద్యోగ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. 6, 7 తేదీల్లో వృత్తిపరమైన సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి. సన్నిహితుల ఆరోగ్యం గురించి ఖర్చు చేయాల్సి రావచ్చు. 8, 9, 10 తేదీల్లో సినీ రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. వైద్యం, పరిశ్రమల రంగాల వారికి ఆర్థికంగా లాభిస్తుంది. లక్ష్య సాధనలో గత అనుభవం తోడ్పడుతుంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. 11న వృత్తి,, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. విందు వినోదాల్లో పాల్గొంటారు. పరిశ్రమలు, హోటల్, వైద్య రంగాల వారు కీలక నిర్ణయాలు తీసుకుంటారు.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, చిన్నారులు, ప్రియతములు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. అంచనాలు ఫలించకపోవచ్చు. 6, 7 తేదీల్లో చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. వృత్తి, వ్యాపారాల్లో కొంత నిరుత్సాహకరంగా ఉంటుంది. 8, 9, 10 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. చిన్నారులు, ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. ఖర్చులు అధికం. 11న విద్యార్థులకు శుభప్రదం. సినీ, రాజకీయ రంగాలు, బ్యాంకింగ్, ఉన్నత విద్య, ఫొటోగ్రఫీ, గ్రనైట్ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం.

నవ్య



## నిర్మాత కోసం దర్శకుడి వెదుకులాట




సినీరంగంలో ఇప్పుడో ట్రెండ్ నడుస్తోంది. దర్శకులు ముందుగా కథ చెప్పి హీరోలను మెప్పించడం, ఆ తరువాత తీరిగ్గా నిర్మాతని వెతుక్కుని ఆ తరువాత మిగతా వారిని సెలక్ట్ చేసుకుంటున్నారు. ఫ్లాప్ డైరెక్టర్‌గా ముద్ర పడిన శీను వైట్ల కూడా సరిగ్గా ఇదే పద్ధతి ఫాలో అవుతున్నాడు. మూడుసార్లు వరుసగా ఫ్లాపులు తిన్న శీనువైట్లతో సినిమాలు చేయడానికి చాలామంది హీరోలు వెనుకంజ వేశారు. అలాంటి సమయంలో రవితేజకు తన దగ్గరున్న కథ చెప్పి అతగాడితో ఓకే చేయించుకున్నాడట శీనువైట్ల. హీరో గారు ఓకే అన్నా ఈ సినిమా నిర్మించడానికి నిర్మాతలే కరువయ్యారట! తనతో సినిమా చేసే నిర్మాత ఎక్కడ దొరుకుతాడా? అని శీను వేటలో ఉన్నట్టు చెబుతున్నారు. ఒక్క ఐడియా జీవితాన్ని మార్చినట్టు మూడు ఫ్లాపులు శీను కెరీర్‌ను అగాధంలోకి నెట్టేశాయి అంటున్నారు ఆయన సన్నిహితులు.

## రెండుకోట్లు ఇవ్వాల్సిందేనట!



ఒక సినిమా హిట్టయితే ఆ సినిమాలో నటించిన హీరోహీరోయిన్లు తమ రెమ్యునరేషన్ పెంచేయడం కొత్తేమీ కాదు. వాళ్ళు అడిగినంత ఇవ్వడమూ వింతేమీ కాదు. అయితే క్యారెక్టర్ ఆర్టిస్టులకు మాత్రం ఆ అవకాశం ఉండేది కాదు. 'బాహుబలి' సినిమాతో సీను మారిపోయింది. ఈ సినిమాలో నటించిన వారికి అంతర్జాతీయంగా పేరు వచ్చింది. ఆ పేరును తమకు అనుకూలంగా చాలా మంది మార్చుకున్నారు. ఇప్పుడు రమ్యకృష్ణ కూడా అదే పని చేయబోతోంది. తన రెమ్యునరేషన్ పెంచి రెండుకోట్లు చేసేసింది. అంత ఇస్తేనే తనతో సినిమా చేయడానికి రండి అంటూ ఖచ్చితంగా చెబుతోందట! ఈ విషయంలో ఎవరు ఎన్ని విధాల నచ్చజెప్పాలని చూస్తున్నా వినడం లేదట!



## సహజీవనం తప్ప పెళ్ళి చేసుకోదట!

కరిష్మాకపూర్ అంటే కరీనా కపూర్ అక్కగానే చాలా మందికి తెలుసు. కరీనా కన్నా ముందే కరిష్మా హీరోయిన్‌గా చేసింది. కపూర్ కుటుంబం నుంచి వచ్చిన తొలి హీరోయిన్‌గా బాగానే గుర్తింపు పొందింది. ఆ తరువాత ఢిల్లీలో ఉండే వ్యక్తిని పెళ్ళి చేసుకుంది. ఇదంతా గతం. వర్తమానానికి వస్తే భర్తతో తెగతెంపులు చేసుకున్న కరిష్మా తిరిగి పెళ్ళి చేసుకుంటుందన్న వార్తలు ఆ మధ్య బాగా హల్‌చల్ చేశాయి. అయితే గతంలో చేసిన తప్పు తిరిగి చేయననీ, భవిష్యత్తులో మనసుకు నచ్చిన వ్యక్తితో సహజీవనం చేస్తాను కానీ పెళ్ళి చేసుకుని మరోసారి తప్పు చేయనని స్పష్టం చేసింది కరిష్మా.

## అమీర్ కొత్త ప్రయోగం!

సినిమా సినిమాకీ కొత్త కొత్త ప్రయోగాలు చేయడంలో అమీర్‌ఖాన్ దిట్ట. తన సినిమాకు అనుగుణంగా శరీరాకృతిని ఎప్పటికప్పుడు మార్చుకునే బాలీవుడ్ హీరోలలో అమీర్‌ఖాన్ ముందుంటాడు. సినిమా కోసం బరువు పెరిగినా, ఇంకేం చేసినా ఆయనకే చెల్లుతుందంటారు బాలీవుడ్ జనాలు. ఇప్పుడు కూడా అమీర్ తన సినిమా కోసం ముక్కు, చెవులు కుట్టించుకున్నాడు! సెట్ మీదున్న ఈ సినిమాలో పాత్రపరంగా అమీర్‌ఖాన్ ముక్కు, చెవులకు ఆభరణాలుంటాయి. మామూలుగా అయితే ముక్కు, చెవులు కుట్టించుకోకుండానే ఆభరణాలు పెట్టుకోవచ్చు. ఆ పాత్ర చేస్తోంది అమీర్‌ఖాన్ కనుక సహజత్వం కోసం కుట్టించుకున్నాడట! కుట్టించుకున్నప్పుడు కొద్దిగా నొప్పి అనిపించినా ఆ తరువాత చాలా బాధపడ్డాడు అంటున్నారు యూనిట్ సభ్యులు.

## పెళ్ళి చేసుకోవడం దండగ

ఈ మాట అన్నది మామూలు వ్యక్తి అయితే ఏదో వేదాంతం చెబుతున్నాడని సరిపెట్టుకోవచ్చు. కానీ బాలీవుడ్ కండల వీరుడి నోటి నుంచి వచ్చిన ఈ మాటలు విన్న వారందరూ బోలెడంత ఆశ్చర్యపోయారట! మామూలుగా సల్మాన్‌ని విలేకర్లు 'మీరు పెళ్ళి ఎప్పుడు చేసుకుంటారు?' అని అడుగుతుంటారు. ఈ ప్రశ్న అడిగి అడిగి విలేకర్లకు బోరు రాకపోయినా, సల్మాన్‌కి వచ్చినట్టు ఉంది. దాంతో 'ఇప్పుడు పెళ్ళి చేసుకోవడం ఎందుకు దండగ?' అంటూ ఎదురు ప్రశ్నించాడట. సల్మాన్ ప్రశ్న విలేకర్లకు అర్థం కాలేదట! ఈ వయస్సులో పెళ్ళి ఎందుకు దండగ? అన్నాడా లేక మరే ఉద్దేశంతోనైనా అన్నాడా? అని తికమక పడుతున్నారట!



# అవి నన్ను పట్టిచ్చేస్తాయి

## -అనూ ఇమ్మాన్యూయేల్

ఆమె నవ్వితే నవరత్నాలు రాశిగా పోసినట్టు ఉంటుంది. ఓరకంట చూసిందా ఎంతటి వారైనా దాసోహం అనాల్సిందే! కోటేరులాంటి ముక్కు, తీరైన శరీరంతో చీర కట్టినా, మోడ్రన్ డ్రస్సు వేసినా అందరూ అదరహో అనాల్సిందే! సౌందర్యమంతా రాశిగా పోసినట్టుండే ముద్దుగుమ్మ అనూ ఇమ్మాన్యూయేల్ చేసిన సినిమాలు తక్కువే అయినా, ప్రేక్షకుల మదిలో పెద్ద ముద్రే వేసింది. తన అందచందాలతో కుర్రకారు మదిలో తిష్ఠ వేసిన అనూ ఇమ్మాన్యూయేల్‌తో.....

### నా గురించి

నాన్న మాలీవుడ్ నిర్మాత థంకచన్ ఇమ్మాన్యూయేల్. నాన్న గత ఏడెనిమిది సంవత్సరాలుగా మాలీవుడ్‌లో సినిమాలు నిర్మిస్తున్నారు. వాస్తవానికి మా ఫ్యామిలీ టెక్సాస్‌లో ఉంటుంది. నా చదువు అక్కడే పూర్తి చేశాను. నా కళ్ళే నాకు ప్లస్ పాయింట్ అంటూంటారు. పెద్ద పెద్ద కళ్ళు కావడంతో భావాలు దాచుకోవడం కష్టం. ఎలాంటి భావాన్ని అయినా ఇట్టే పట్టిచ్చేస్తాయి. నా కళ్ళు నా మనసుకు అద్దంలాంటివి. కోపం లేదా ఆనందం నా ముఖంలో కన్నా నా కళ్ళలోనే ఎక్కువగా కనిపిస్తుంది. వాటిని అదుపు చేయడం నా వల్ల కాదు.

### సినిమాల్లోకి ఎలా వచ్చానంటే?

నాకు ఊహ తెలిసిన దగ్గర్నుంచీ మా ఫాదర్ సినిమాలు తీస్తుండడంతో ఇంట్లో సినిమా వాతావరణం ఎక్కువగా ఉండేది. అలాగని సినిమాల్లోకి రావాలని ఎప్పుడూ అనుకోలేదు. బాలనటిగా కొన్ని సినిమాలు చేశాను. చదువు పూర్తి చేసిన తరువాత సినిమాలు చేయాలని అనుకున్నా, డిగ్రీ మొదటి సంవత్సరంలో మంచి అవకాశం రావడంతో సినిమాలవైపు దృష్టి పెట్టాను.

### నటనలో శిక్షణ

ప్రత్యేకించి శిక్షణ అంటూ తీసుకోలేదు. వాస్తవానికి నటన గురించి ఎవరూ చెప్పరు. కొన్ని విషయాలు మనంతట మనం చూసి తెలుసుకోవాల్సిందే! నటనలో శిక్షణ తీసుకున్నా కొంతవరకే ఉపయోగపడుతుంది తప్ప మనంతట మనం నేర్చుకునేదే ఎక్కువగా ఉంటుంది. సినిమాలే అన్నీ నేర్పుతాయి.

### ఇంట్లో అభ్యంతరాలు...

పెద్దగా ఎదురు కాలేదు. నాన్న నిర్మాత కనుక సహజంగానే సినిమాల మీద ఆసక్తి కలిగి నటిస్తానని చెప్పాను. మా పేరెంట్స్ ఒక్కటే చెప్పారు. నటిగా ఎక్కువ కాలం ఉండడం కుదరదు కాబట్టి సాధ్యమైనంత వరకూ మంచి సినిమాలు చేయమని చెప్పారు. ఈ రంగంలో మంచి చెడులను నాన్న వివరించి చెప్పారు. ఎలాంటి పాత్రలు ఎంపిక చేసుకోవాలి. ఎంత జాగ్రత్తగా ఉండాలి. ఎవర్ని నమ్మాలి? ఎవర్ని నమ్మకూడదు అన్న విషయాలు ముందే చెప్పడం నాకు ప్లస్ పాయింట్ అయింది.

### ఇంటి మీద బెంగ

ఇంటిమీద బెంగ ఎలాగూ ఉంటూనే ఉంటుంది. మా పేరెంట్స్‌తో ఎటాచ్‌మెంట్ ఎక్కువే! అలాంటిది ఒక్కసారిగా రోజుల తరబడి వారికి దూరంగా ఉండాలంటే కష్టంగానే ఉంటోంది. అయినా తప్పదు కదా! మొదట్లో బాగా బెంగగా ఉండేది. ఇప్పుడు అలవాటు పడిపోయాను. షూటింగ్‌లతో ఎంత బిజీగా ఉన్నా తరచూ వారితో మాట్లాడుతూనే ఉంటాను.



## చదువుకు ఇబ్బంది

కచ్చితంగా ఉంటుంది. చదువు కావాలా? సినిమాలు కావాలా? అని నాకు నేనే ప్రశ్నించుకున్నపుడు నా మనసు సినిమాల వైపే మొగ్గింది. చదువుకి తాత్కాలికంగా బ్రేక్ ఇచ్చి సినిమాలకి ఓకే చెప్పాను. ప్రారంభంలో ఒక సంవత్సరం సినిమాలు చేసి ఆ తరువాత చదువు కంటిన్యూ చేయాలనుకున్నాను. కానీ అది కుదిరేటట్టు లేదు. వరుసపెట్టి ఆఫర్లు వస్తున్నాయి. మరో రెండేళ్ళ వరకూ చదువు మీద దృష్టి పెట్టడం కుదరదు. ఆ తరువాత చదవాలని అనిపిస్తే చదువు కంప్లీట్ చేస్తాను.

## ఓపిక పెరిగింది

నేను సైకాలజీ స్టూడెంట్‌ను కావడంతో ఓపిక పెరిగింది. అది ఇక్కడ ఎంతగానో ఉపయోగపడింది. ఈ రంగంలో ఉన్నవారిని అర్థం చేసుకోవడానికి నా చదువు దోహదపడింది. ఇక్కడ పరిస్థితులు పూర్తిగా అర్థమయ్యాయని చెప్పలేనుకానీ, చాలా వరకూ అర్థం చేసుకోగలిగాను. నా షెడ్యూల్ కూడా అలాగే ప్లాన్ చేసుకోగలగుతున్నాను.

## ఇతర భాషలలో నటించడం కొద్దిగా కష్టమే

మలయాళం నా మాతృభాష కనుక ముందు నుంచి భాష మీద అవగాహన ఉంది. దాంతో మాలీవుడ్‌లో నటించడం ఇబ్బంది అనిపించలేదు. తమిళం, తెలుగు భాషలంటే కొద్దిగా కష్టంగానే అనిపించింది. నా మొదటి సినిమా సమయంలో హైదరాబాదు రావాలంటే భయపడ్డాను. నన్ను ప్రేక్షకులు ఎలా రిసీవ్ చేసుకుంటారో అన్న భయం ఉండేది. ఇక్కడి వచ్చిన తరువాత అలాంటి భయాలు పారిపోయాయి. ఇప్పుడు హైదరాబాదే నా సొంత ఊరు అన్న అభిప్రాయం కలుగుతోంది. ఇప్పుడు కేరళలో కన్నా ఇక్కడ ఉండడమే నాకు ఎక్కువ ఇష్టం. ఇక్కడ నాకు చాలా మంది స్నేహితులయ్యారు. దాంతో ఇంటి మీద బెంగ అనేది లేకుండా పోయింది. హైదరాబాదులో ఓ ఇల్లు కొనుక్కోవాలని అనుకుంటున్నాను. ఇక్కడ షూటింగ్ ఉన్నపుడు ఫుడ్‌కీ, మిగతా వాటికీ ఇబ్బంది అవుతోంది. ఇక్కడ ఓ ఇల్లుంటే అంత ఇబ్బంది ఉండదు. మా మమ్మీని తీసుకురావడమో లేదా, ఎవరినైనా పెట్టుకుని వండించు కోవడమో చేయవచ్చు.

## తెలుగులో అవకాశాలు

మాలీవుడ్‌లో కన్నా కోలీవుడ్, టాలీవుడ్‌లలోనే నాకు ఎక్కువ అవకాశాలు వస్తున్నాయి. ప్రస్తుతం తెలుగులో పవన్ కల్యాణ్ గారితో చేస్తున్నాను. గోపీచంద్‌గారితో చేసిన 'ఆక్సిజన్' విడుదల ఆలస్యం అవుతోంది. ఇవి కాకుండా మరో రెండు కథలకు ఓకే చెప్పాను.

## అభిమాన నటులంటే....

పవన్ కల్యాణ్, మహేష్‌బాబులంటే విపరీతమైన ఇష్టం. చిన్నతనం నుంచీ వారి సినిమాలు బాగా చూసేదాన్ని. ఇద్దరిలో పవన్‌గారి స్టైల్ చాలా బాగుంటుంది. ఆయనతో నటించే అవకాశం ఇంత త్వరగా వస్తుందని ఊహించలేదు. అలాగే మహేష్ బాబుగారితో కూడా నటించే అవకాశం వస్తే బాగుండును అనిపిస్తూ ఉంటుంది.

## డబ్బు అవసరం లేదు

సినిమాల్లో నటిస్తే డబ్బులిస్తారన్న విషయం చిన్న పిల్లవాడిని అడిగినా చెబుతారు. అలాగని పూర్తిగా డబ్బు మనిషినికాదు నేను. వరసపెట్టి ఆఫర్లు లేకపోయినా ఫర్వాలేదు. మంచి అవకాశాలు కావాలి. అందుకే సినిమాల ఎంపిక చాలా జాగ్రత్తగా చేసుకుంటాను.

## ప్రేమ-పెళ్ళి

కచ్చితంగా ప్రేమ పెళ్ళే చేసుకుంటాను. పెద్దలు కుదిర్చిన పెళ్ళి మంచిది కాదు అనను. కానీ అందులో జీవిత భాగస్వామిని అర్థం చేసుకోవడానికి టైం ఉండదు. అంతా హడావిడిగా, కంగారు కంగారుగా జరిగిపోతుంది. ఆ తరువాత అభిప్రాయాలు కలవకపోతే అడ్జస్ట్ కావాలి లేకపోతే విడిపోవాలి. కొన్ని విషయాలలో నేను అంత త్వరగా అడ్జస్ట్ కాలేను. ప్రేమ పెళ్ళిలో నా లైఫ్ పార్ట్‌నర్‌ని అర్థం చేసుకోవడానికి అవకాశం ఉంది. కాకపోతే పెళ్ళికి ఇంకా టైముంది. ఇప్పటివరకూ నా మనసులో ఎవరూ లేరు. ఎవరి మీదా ప్రేమ అన్నది కలగలేదు. అలాంటి వ్యక్తి తారసపడితే తప్పకుండా అందరికీ చెబుతాను. నా పార్ట్‌నర్‌కి ఎంతో కొంత సమయం కేటాయించాలి. ఇప్పుడంత సమయం నా దగ్గర లేదు.

## అందం, గ్లామరు

అందం పేరుతో అరకొర డ్రస్సులు వేసుకోవడానికి నేను వ్యతిరేకిని. మనం ఎలాంటి డ్రస్సులు వేసుకున్నా ముఖంలో చిరునవ్వు చెరగకుండా ఉంటే దానికి మించిన అందం ఉండదు.

## బికినీ, లిప్‌లాక్‌లకి దూరం

నా శరీరం బికినీకి సరిపోదు. ఇప్పుడే కాదు ఎప్పుడూ బికినీ వేసుకోవడానికి ప్రయత్నించను. ఇక లిప్‌లాక్‌లంటే ఇప్పటి వరకూ అలా ఎవరూ నన్ను అడగలేదు. అడిగినప్పుడు దాని గురించి ఆలోచిస్తాను.

## చేస్తున్న సినిమాలు

కోలీవుడ్‌లో విక్రమ్‌సార్‌తో చేస్తున్నాను. మరో రెండు సినిమాలు మొదలు కావలసి ఉంది. మాలీవుడ్‌లో కూడా ఓకే చెప్పవలసిన సినిమాలున్నాయి.

–స్పందన రెడ్డి






రూపనగరంలో వినయశీలుడు అనే యువకుడు ఉన్నాడు. అతడు ఎంతో మంచివాడు. చాలా విద్యల్లో ఆరితేరాడు. తండ్రి అతణ్ణి వ్యాపారం చేయమన్నాడు. తల్లి అతణ్ణి రాజధానికి పోయి కొలువులో ఏదో ఒక ఉద్యోగం సంపాదించుకోమని చెప్పింది.

అతడికి ఓ ప్రియురాలు ఉంది. ఆమెపేరు వివేకవతి. ఆమె మాత్రం ఈ రెంటికీ ఒప్పుకోలేదు. "నీకు వచ్చిన విద్యను పదిమందికీ చెప్పు. వాళ్ళు ఇచ్చింది పుచ్చుకో. తీరుబడి సమయంలో వృత్తివిద్యల్లో మనకున్న ప్రావీణ్యానికి అనుకూలంగా ఉండే వస్తువులు తయారుచేద్దాం. పెరడులో కూరలు పండిద్దాం. ఒకరితో ప్రమేయం లేకుండా ఎంతో హాయిగా ఇక్కడే మనం బతకవచ్చు కదా!" అంది వివేకవతి.

# అగస్త్యబంధనం

వినయశీలుడికి ఈ మాటలు బాగా నచ్చాయి. ప్రియురాలు చెప్పినట్లే చేద్దామనుకున్నాడు. తన ఉద్దేశ్యం తల్లిదండ్రులకు చెప్పాడు. వివేకవతిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నట్లు కూడా చెప్పాడు. తల్లీ తండ్రీ అందుకు అంగీకరించారు. వివేకవతి ఇంటికివెళ్ళి పెళ్ళి ప్రస్తావన చేశారు. అందరికీ అన్నీ సమ్మతమయ్యాయి. వివేకవతి తండ్రి ఓ పండితుణ్ణి పిలిపించి జాతకాలు చూపించాడు. ఆ ఇద్దరి జాతకాలను పండితుడు ఎంతో శ్రద్ధగా పరిశీలించాడు. "అన్నీ చక్కగా సరిపోయాయి. ఈ వివాహం జరిగితే, ఈ భూమిమీద ఇంతకంటే చక్కనిజంట ఉండబోదు. అయితే, వివాహం అప్పుడే జరిపించవద్దు. నూటొక్క దినాలు ఆగాలి!" అన్నాడు పండితుడు.

"అంతవరకూ మంచి ముహూర్తం ఏదీ లేదా?" అడిగాడు వివేకవతి తండ్రి ఆశ్చర్యంగా.

పండితుడు వివేకవతి తండ్రిని రహస్యంగా పిలిచి, "ఇది రహస్యం, మీలోనే దాచుకోండి. వినయశీలుడి జాతకం పరిశీలించాను. అది చాలా గొప్ప జాతకం. అయితే, ఈ రోజుకు సరిగ్గా నూటొక్క దినాల లోపల అతడికి మరణగండం ఉన్నది. ఆ గండాన్ని తప్పించుకోవడం ఎట్టి పరిస్థితుల్లోనూ అతడికి అసాధ్యం. ఒకవేళ తప్పించుకున్నాడో ఈ భూతలానికే చక్రవర్తి కాగలడు" అన్నాడు.

వివేకవతి తండ్రి ఇది విని చాలా బాధపడ్డాడు. ఈ విషయం ఇతరులకు చెప్పాలా, చెప్పకూడదా అని కాసేపూ అసలు ఆ జ్యోతిష్యాన్ని నమ్మడమా, మానడమా అని కాసేపూ సందిగ్ధంలో పడ్డాడు కూడా. ఈలోగా వినయశీలుడే ఆయన్ను కలుసుకునేందుకు వచ్చి, "మా వివాహనికి త్వరలో ముహూర్తం కుదరదు. నాకు చక్రవర్తి నుంచి పిలుపు వచ్చింది. ఈరోజే బయలుదేరి అక్కడికి వెడుతున్నాను" అన్నాడు.

ఈ వార్త వినగానే వివేకవతి తండ్రి గుండె గుభేలుమన్నది. 'ఇటీవల చక్రవర్తి ఒక అసాధ్యమైన కార్యం ఏదో తలపెట్టి, దేశం నలుమూలల నుంచీ వీర యువకుల్ని పోగు చేస్తున్నాడు. చక్రవర్తి దగ్గరికి వెళ్ళిన యువకుల జాడ ఏమైందీ ఎవరికీ తెలియడంలేదు. ప్రతీ వారం చక్రవర్తి నుంచి ఎవరికో ఒకరికి పిలుపు అందుతూనే ఉన్నది. ఇలా పిలుపులు రావడం అప్పుడే ఏణ్ణర్థం నుంచి జరుగుతున్నది. జ్యోతిష్యం అప్పుడే నిజమవుతున్నది' అనుకున్నాడు వివేకవతి తండ్రి తన మనసులో. అయితే పైకి అది కనిపించనీయకుండా, "అలాగేలే నాయనా! వివేకవతికి కూడా కాస్త ఈ విషయం చెప్పి వెళ్ళు" అన్నాడాయన.

నిజానికి వినయశీలుడు కూడా అందుకే అక్కడికి వచ్చాడు.

వివేకవతి ఈ విషయం వినగానే "నేనూ నీతో వస్తాను" అంది.

"చక్రవర్తి నాకోసం రథాన్నీ, ఇద్దరు మనుషుల్నీ పంపించాడు. నేను తప్ప ఆ రథంలో వేరెవ్వరూ రాకూడదని ఆజ్ఞ" అన్నాడు వినయశీలుడు.

"మనం మళ్ళీ కలుసుకుంటామో, లేదో! చక్రవర్తి దగ్గరకు వెళ్ళిన యువకులు ఎవ్వరూ తిరిగి రావడం లేదు" అంది వివేకవతి దిగులుగా.

"ఇలాంటి సమయాల్లోనే కదా, మనం ధైర్యం వహించాలి! జరగాల్సింది ఎలాగూ జరుగుతుంది. దిగులుపడి మాత్రం లాభం ఏమిటి?" అన్నాడు వినయశీలుడు బుజ్జగింపుగా.



అప్పుడు వివేకవతి ధైర్యం తెచ్చుకుని, అతడికి తన వేలి ఉంగరం తీసి ఇచ్చి, "ఈ ఉంగరం వేలికి పెట్టుకుంటే నీకు చాలా మంచిది. ఎవరికీ కనిపించని పిశాచాలు నీకు కనిపిస్తాయి. నీతో మాట్లాడతాయి. అయితే, దీని మహిమవల్ల అవి నిన్ను ఏమీ చెయ్య లేవు" అంది.

"ఈ ఉంగరం నీకెలా వచ్చింది?" అని అడిగాడు వినయశీలుడు. దానికి వివేకవతి సరైన బదులు ఇవ్వలేదు. వినయశీలుడికి ఆ ఉంగరంకథ చెప్పడం ఆమెకి ఇష్టంలేదు.

చిన్నతనంలో ఆమెను ఒక పిశాచి ఆవహిస్తే, వివేకవతి స్పృహ తప్పి పడిపోయింది. అప్పుడు అదృష్టవశాత్తూ హిమాలయాల్లోని సిద్ధుడు ఒకడు రూపనగరం వచ్చాడు. ఆ సిద్ధుడు ఆమెకోసం ప్రత్యేకమైన ఉంగరం ఒకటి తయారుచేసి ఇచ్చాడు. "స్నానపానాదుల సమయంలో కూడా ఈమె ఈ ఉంగరాన్ని తన వేలి నుంచి తీయరాదు. ఈ ఉంగ రాన్ని కనుక పారవేసుకుంటే, ఆ రోజునుంచి లెక్క పెట్టి సరిగ్గా నూటొక్కదినాలకు ఈమె మరణిస్తుంది" అని చెప్పాడు.

ఆ ఉంగరం పెట్టుకున్నప్పటి నుంచీ వివేకవతి మళ్ళీ మామూలుగా ఉంటున్నది, తిరుగుతున్నది.

ఉంగరం తీయడం ప్రమాదమని వివేకవతికి తెలుసు. అయితే, ఆమె వినయశీలుణ్ణి ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమిస్తోంది. అతడు ఊళ్లో లేనప్పుడు, తను స్పృహ తప్పి ఉండడమే చాలా మంచిదని ఆమె అనుకుంది. నూటొక్క దినాలలో అతడు రాక పోతే తను బతికిమాత్రం ఏం ప్రయోజనమని కూడా ఆమె అనుకుంది. అందువల్ల, వినయశీలుడితో ఆ విషయాలేవీ చెప్పకుండా నవ్వుతూ దాటవేసింది వివేకవతి.



## పిల్లలకు ప్రత్యేకం

అప్పటికే చక్రవర్తి పంపిన మనుషులు తొందర చేస్తూ ఉండడంవల్ల, వినయశీలుడు ఆమె వద్ద వీడ్కోలు పుచ్చుకుని రాజధానికి బయలుదేరాడు.

వినయశీలుడు రథంలో వెళ్ళిపోయిన కొద్దిక్షణా లకు, వివేకవతి కెవ్వుమని అరిచి స్పృహతప్పి పడి పోయింది. అది చూచి ముందు అందరూ ఆమె వినయశీలుడికోసం బెంగపడిందని అనుకున్నారు. కాసేపటికి ఆమె తండ్రికి ఆమె వేసిన ఎత్తుగడ ఏమిటో పూర్తిగా అర్థం అయింది. ఆయన కన్నీరు మున్నీరుగా కూతురికోసం విలపించసాగాడు.

వినయశీలుడి తండ్రికి కూడా ఈ కబురు తెలి సింది. అప్పుడు వివేకవతి తండ్రి మొత్తం జరిగిన దంతా ఆయనకి చెప్పకతప్పలేదు. ఆ సమయంలో వినయశీలుడి జాతకం గురించి కూడా వివరంగా ఆయనకు చెప్పాడు. "నూటొక్క దినాలలో వినయ శీలుడు ఇక్కడికి రానిపక్షంలో, మీకు మీ కొడుకూ దక్కడు, నాకు నా కూతురూ దక్కదు" అన్నాడాయన.

ఈలోగా వినయశీలుడి రథం శరవేగంతో వెడుతూ మధ్యదారిలో ఉన్నట్టుండి ఆగిపోయింది. ఎంత అది లించినా గుఱ్ఱాలు వెనకడుగే కానీ, ముందడుగు వేయడం మానేశాయి. "ఏమైంది?" అని ఆశ్చర్యపడుతూ, వినయ శీలుడు రథం దిగాడు.

అప్పుడు దారికి అడ్డంగా ఓ పిశాచం పడుకుని ఉన్నట్టు, ఉంగరం మహిమవల్ల వినయశీలుడికి తెలిసింది.

"ఎవరు నువ్వు? మా దారికి అడ్డం తొలుగు" అన్నాడు వినయశీలుడు.

అప్పుడు ఆ పిశాచం వినయశీలుడికి తన కథంతా ఇలా చెప్పింది.

"నేను ఒక పిశాచాన్ని. ఒకానొకప్పుడు నేను మహాబలవంతుడినై అంతులేని ప్రజాపీడన కావి స్తుండేవాణ్ణి. ఈ భూమిమీద మనిషన్నవాణ్ణి లేకుండా చెయ్యాలని సంకల్పించాను. జననాశనం చేయసాగాను. అప్పుడు అగస్త్యుడనే ఋషి వెతు క్కుంటూవచ్చి, నన్ను కలుసుకుని నాకు నూరు కథలు చెప్పాడు. ఆ కథలు ఎంత గొప్పగా ఉన్నా యంటే అవి వింటూ నేను ఎక్కడికీ కదలలేకపోయే వాణ్ణి. ఒక్కొక్కకథ నాకు ఒక్కొక్క బంధనంగా మారింది. అగస్త్యుడు నూరు కథలూ పూర్తి చేసే సరికి, నేను ఎక్కడికీ కదలలేని స్థితికి వచ్చాను కూడా. అప్పుడు అగస్త్యుడు నన్నుచూచి, 'ఈ రోజు నుంచి నీ ఆటకట్టు. నీకు నేను అగస్త్యబంధనం వేశాను. ఈ బంధనం నుంచి నువ్వు బయటపడా లంటే, నేను చెప్పిన కథలు నువ్వు వేరెవరికైనా చెప్పాలి. వాళ్ళు ఆ కథలను మనస్ఫూర్తిగా వినాలి. అలా ఎవరైనా నీ నుంచి మొత్తం నూరు కథలూ విన్నరోజున నువ్వు మళ్ళీ బంధవిముక్తుడువి అవు తావు. అంతవరకూ నీవు నూరుకట్ల పిశాచంగా ప్రచారం పొందుతావు' అని చెప్పాడు. అప్పటినుంచీ నేను ఇలా పడి ఉండి గాలివాలున చెట్లు, గుట్టలు, మిట్టలు దర్శిస్తూ ఈ రోజు ఇక్కడ పడ్డాను. నువ్వు ఎవరివోగానీ అద్భుతశక్తులున్నవాడివి. కాబట్టే నేను ఇప్పుడు నీకు కన్పించాను. నామీద దయుంచి అను మతి ఇచ్చావంటే, నేను నిన్ను ఆవహిస్తాను. అందు వల్ల నీకు ఏమీ నష్టముండదు. నువ్వు పిలిచినప్పు డల్లా పలుకుతాను. నాకు ఇలా గాలివాలున కొట్టుకు పోయే దౌర్భాగ్యం తప్పించిన వాడివి అవుతావు. నీకు మనస్ఫూర్తిగా కథ వినాలని అనిపించి నప్పుడు ఓ కథ చెబుతూ ఉంటాను. నీ కారణంగా నాకు బంధవిముక్తి లభిస్తే బుద్ధిగా హిమాలయా లకుపోయి దైవప్రార్థన చేసుకుంటాను. నా కోరిక తీర్చవూ?"

పిశాచం మాటలు విన్నాక, వినయశీలుడు కాసేపు ఆలోచించాడు. తాను తలపెట్టిన పని ఎంత ప్రమాదకరమైనదో తెలియదు. అనుకోకుండా లభించిన

నూరుకట్ల పిశాచం వల్ల తనకు మేలు జరుగుతుందేమో! దీనితో స్నేహం చేయటం అన్నివిధాలా తనకు మంచిదేమో! ఇలా అనుకుని వినయ శీలుడు సరేనని చెప్పగానే పిశాచం దారికి అడ్డం తొలిగి మాయమై వినయ శీలుణ్ణి ఆవహించింది. అయితే, వినయశీలుడికి అంతా మామూలుగానే ఉన్నది. అది వివేకవతి ఇచ్చిన ఉంగరం మహిమ.

ఆ వెంటనే గుఱ్ఱాలు కదిలాయి. మర్నాడు ఉదయానికల్లా వినయ శీలుడు రాజధాని నగరంచేరి చక్రవర్తిని కలుసుకున్నాడు. చక్రవర్తి వినయ శీలుణ్ణి ఏకాంతానికి తీసుకువెళ్ళి ఇలా చెప్పాడు.

"వినయా, నేను ప్రజాక్షేమం కోరేవాడినేగానీ, ప్రజాకంటకుణ్ణి కాదు. ఇటీవలే నేను ద్వితీయవివాహం చేసుకున్నాను. కొత్త మహారాణికి వీరుల్ని పరీక్షించడం సరదా. ప్రతివారం ఆమె ఒక పరీక్ష పెడుతుంది. ఆ పరీక్షలో నెగ్గితే నీకు లక్ష వరహాలు కానుకగా ఇస్తాను. ఈరోజు రాత్రి నీకు పరీక్ష జరుగు తుంది. లక్షవరహాలు నెగ్గుకోవాలని ఆశీర్వదిస్తున్నాను" అన్నాడు.

"మరి నేను ఆ పరీక్షలో ఓడిపోతేనో?" అన్నాడు వినయశీలుడు.

"అది నీ దురదృష్టం" అని ఊరుకున్నాడు చక్రవర్తి.

ఆ తరువాత, వినయశీలుడికి మంచి మర్యాదలు జరిగాయి. చక్కని విడిది, రుచికరమైన ఆహారం, మెత్తటి పక్క ఏర్పాటు చేయబడ్డాయి.

వినయశీలుడు విశ్రాంతి తీసుకుందామని అనుకుంటూండగా, అతడిని ఆవహించి ఉన్న నూరుకట్లపిశాచం పెద్దగా నవ్వుతూ ఇలా అన్నది.

"ఓయీ వెర్రిబాగులవాడా! నీకు మహారాణి పెట్టే పరీక్ష ఎలా ఉంటుందో తెలుసా? నీళ్ళు లేని మడుగులో ఒకేసారి ఎనిమిది మొసళ్ళతో పోరాడాలి నువ్వు. పోరాటం కొనసాగుతూండగా మడుగును క్రమంగా నీటితో నింపు తారు. ఆ నీటిలోంచి ఆ మొసళ్లను తప్పించుకుని బ్రతకడం కష్టం. వారం రోజులుగా ఆకలితో అలమటించి ఉన్న ఆ ఎనిమిది మొసళ్ళూ నిన్ను చీల్చి చెండాడుతాయి. అర్థమైందా?"

అది వింటూనే వినయశీలుడికి ప్రాణాలు పైనే పోయాయి. "అయితే ఇప్పుడు నేను ఏం చేస్తే తప్పించుకోగలను?" అన్నాడు కంగారుగా.

"తప్పించుకునేందుకు ఒకేఒక్క ఉపాయముంది. ఈ వీర పరీక్షకు ఒక నిర్ణీత సమయం ఉంది. ఆ సమయం దాటితే పరీక్ష మరునాటికి వాయిదా వేయబడుతుంది. నువ్వు మహారాణిని సమీపించగానే ఆమెను మాటలతో మభ్యపెట్టి, నాకో కథ చెప్పే అవకాశం ఇవ్వు. నేను సమయం దాటిపో యేలా చేయగలను" అన్నది నూరుకట్ల పిశాచం.

ఈ ఉపాయం బాగానే ఉందనిపించింది వినయశీలుడికి.

ఆ తర్వాత, వినయశీలుడు కొంతసేపు విశ్రాంతి తీసుకున్నాడు. మరి కొంతసేపు కోటలోని విశేషాలు చూస్తూ కాలం గడిపేశాడు. ఎంతకీ రాత్రి కావడం లేదేమో అనిపించింది. అలా వినయశీలుడు ఆరాటపడుతూం డగా చివరకు సూర్యుడు అస్తమించాడు. రాత్రి పంచభక్ష్య పరమాన్నాలతో భోజనమైనాక, వినయశీలుడు మహారాణి మందిరం చేరుకున్నాడు.

మహారాణి సాదరంగా అతణ్ణి ఆహ్వానించింది. "నీలో శౌర్యం శోభి స్తోంది. వీర పరీక్షకు సిద్ధమేనా?" అని అడిగింది.

"పరీక్షకు నేను ఈ క్షణమే సిద్ధంగా ఉన్నాను" అన్నాడు వినయశీలుడు.

"అప్పుడే కాదు, ఇంకా కొంత సమయం ఉన్నది. నీకు చేతనైన పక్షంలో ఈలోగా మంచికథ ఏదైనా ఒకటి చెప్పు" అంది మహారాణి.

వెతకబోయిన తీగ కాలికి తగిలినట్లయింది వినయశీలుడికి. అతడు నూరుకట్ల పిశాచంతో, "పిశాచ మహాశయా! మహారాణి మనస్ఫూర్తిగా కథ వింటానని అంటోంది. నీవు ఇక నా నోట కథను పలికించవచ్చు" అన్నాడు మెల్లగా.

నూరుకట్ల పిశాచం వెంటనే కథ ప్రారంభించింది.

**వసుంధర**

## సుధామ పదగారడి-321

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ❖ | 1 | 2 | | ❖ | 3 | 4 | | 5 |
| 6 | ❖ | | ❖ | 7 | ❖ | | ❖ | |
| 8 | | | ❖ | | ❖ | 9 | 10 | |
| | ❖ | ❖ | 11 | | 12 | ❖ | | ❖ |
| 13 | 14 | | | ❖ | 15 | | | 16 |
| ❖ | | ❖ | 17 | 18 | | ❖ | ❖ | |
| 19 | | 20 | ❖ | | ❖ | 21 | | |
| | ❖ | | ❖ | | ❖ | | ❖ | |
| 22 | | | | ❖ | 23 | | | ❖ |

### ఆధారాలు

**అడ్డం**

1. జింక తప్పిపోయిన జింబోనాలుక (3)
3. తెలంగాణ వేడుక (4)
8. చివరకు, చివరన (3)
9. గొయ్యి, ఎంగిలితిను (3)
11. మాంసం అమ్మువాడు, చీకటికి ఒక విశేషణం (3)
13. రాజులపాలు రాలేదు (4)
15. ఆనందము, క్రీడాదుల చేత పొద్దుపుచ్చుట (4)
17. మిక్కిలి అనురాగముగల ఆడుది (3)
19. మత్తు (3)
21. సత్యజిత్‌రే కాదు రే కు ముందు ముత్యాలముగ్గు చిత్రదర్శకుడు (3)
22. కుమారుడు (4)
23. దుకాణము, కొట్టు (3)

**నిలువు**

2. లోకాంతరము పొంది దేవతాత్వము వహించిన ముత్తైదువ (3)
4. బెలూన్ (3)
5. మోకాలు (3)
6. ఒకానొక క్షుద్ర పురుషదేవత (4)
7. వ్యవహారంలో వైశ్యుడు (3)
10. భ్రమరము (3)
11. ఉత్పలము (3)
12. తెలంగాణ జనజాగృతి అధ్యక్షురాలు (3)
14. లాక్షారసము (3)
16. సిగరెట్టు పెట్టెలో (మునుపు) ఉండేది (4)
18. దీర్ఘనిశ్వాసము (3)
19. చలం నవల, రాజేశ్వరి ప్రధాన పాత్ర (3)
20. దీనిని ముల్లుతోనే తీయాలి అని సామెత (3)
21. అద్దె (3)

### పదగారడి-320 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 వ | 2 న | మా | 3 లి | | 4 ఉ | షా | 5 రా | ణి |
| | వ | | ప్న | | క్తి | | యం | |
| 6 మ | త | 7 ము | | 8 ధో | | 9 అ | చ | 10 లం |
| హ | | 11 ను | డి | కా | రం | | | కా |
| 12 త | రు | గు | | | | 13 ప | చ్చ | న |
| ల | | | 14 త | 15 న | వా | రు | | గ |
| 16 ము | 17 రి | పెం | | ప్వ | | 18 గో | 19 పు | రం |
| | వ | | 20 గు | | 21 కొం | | రు | |
| 22 హా | ట | సా | రి | | 23 పే | రు | గు | లు |

Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**

# నా కల నెరవేరింది

## -దిశా పటాని

**గా డ్‌ఫాదర్ అనేవాళ్ళు లేకుండా బాలీవుడ్‌లోకి అడుగుపెట్టిన హీరోయిన్ దిశా పటాని. నటిగా చేసిన సినిమాల కన్నా యంగ్ హీరోతో చేస్తున్న రొమాన్స్‌తోనే దిశా ఎప్పటికప్పుడు వార్తల్లో నిలుస్తూ ఉంటుంది. ఎవరెంతగా పుకార్లు పుట్టించినా ఆ హీరోతో తనకున్నది స్నేహం తప్ప మరొకటి లేదు అంటున్న దిశా పటానితో....**



**టైగర్ ష్రాఫ్‌తో మీ ప్రేమాయణం పెళ్ళి వరకు వెళ్ళిందంటున్నారు. నిజమేనా?**

ఒకటి రెండు సినిమాలు కలిసి చేసినందుకు మా మీద వస్తున్న పుకార్లు అవి. వాటిల్లో ఎంత మాత్రం నిజం లేదు. మా మధ్య ప్రేమే లేనప్పుడు పెళ్ళిదాకా ఎలా వెడతాం? వెండితెర మీద మా రొమాన్స్ బాగుందని ప్రేక్షకులు మెచ్చుకుంటున్నారు. అంతే తప్ప నిజజీవితంలో మా మధ్య ఎలాంటి రొమాన్స్ లేదు. ఇద్దరం కెరీర్‌ని ఓ ఛాలెంజ్‌గా తీసుకున్న వాళ్ళం. ఇలాంటి కామన్ పాయింట్లు ఇద్దరిలో ఉండడంతో స్నేహం త్వరగా కలిసింది. మొదటి నుంచీ నేను ఒకటే మాట చెబుతున్నాను. నేనూ టైగర్ ష్రాఫ్ మంచి స్నేహితులం మాత్రమే! నేను ఇప్పుడిప్పుడే కెరీర్‌లో నిలదొక్కుకుంటున్నాను. ప్రేమ, పెళ్ళి ఆలోచనలు పెట్టుకోదలచుకోలేదు.

**సోషల్ మీడియాలో వస్తున్న మీ ఇద్దరి ఫొటోల మాటేమిటి?**

అవి నేను పోస్ట్ చేసినవే! ఇటీవల నా బర్త్‌డే జరిగింది. ఆ సందర్భంగా నేనూ, టైగర్ ష్రాఫ్ దిగిన ఫొటోలు అవి. ఆ ఫొటోలలో మాతో పాటు టైగర్ సిస్టర్ కూడా ఉంది. ఆ విషయం వదిలేసి మా ఇద్దరి గురించే అందరూ అడగడం వింతగా ఉంది. బర్త్‌డే సందర్భంగా జరిగిన పార్టీలో స్నేహితులతో కలిసి ఫొటోలు దిగడం కూడా తప్పేనా!

**జాకీచాన్ గురించి...?**

ఈ వయస్సులో కూడా తన ఎనర్జీ చూస్తుంటే కొద్దిగా ఈర్ష్యగా ఉంటుంది. జాకీచాన్ సినిమాలంటే నాకు చిన్నతనం నుంచి చాలా ఇష్టం. ఇదే విషయం చాలా సార్లు చెప్పాను కూడా! తనని ఒక్కసారైనా చూడాలన్నది నా చిన్ననాటి కల. అలాంటిది జాకీచాన్‌తో కలిసి నటించడం నా ఊహకు అందని విషయం. సినిమా షూటింగ్ పూర్తయినా కూడా నేను జాకీసార్‌తో నటించాననే విషయం నమ్మలేకపోతున్నాను.



**బాలీవుడ్‌లో హీరోయిన్‌గా మీ ఎర్లీ...**

నేను సినిమాల్లోకి వచ్చినప్పుడు ఇక్కడ ఎవరూ నాకు తెలియదు. కెమెరా ముందు చేయాలంటే మొదటిరోజు సిగ్గుపడ్డాను. ఆ తరువాత అలవాటై పోయింది. మా ఇంట్లో నన్ను ఆడపిల్ల అని ఎప్పుడూ చిన్నచూపు చూడలేదు. మగపిల్లలతో సమానంగా అన్ని పనులు చేయడం నాకు అలవాటైంది. ఓ విధంగా చెప్పాలంటే నేను కొద్దిగా మొండిదాన్నే. ఆ మొండితనమే ఇక్కడ నిలదొక్కుకునేట్టు చేసింది.

**బాలీవుడ్‌లో మీ రోల్ మోడల్ ప్రియాంక చోప్రా అన్నారట, నిజమేనా?**

తను ఎంత కష్టపడి పైకి వచ్చిందో అందరికీ తెలిసిందే! ఏదైనా చేయగలదు. కాకపోతే నేను ప్రియాంక చోప్రాలాగా తయారవ్వాలని అనుకోవడం లేదు. నా పద్ధతిలో పేరు తెచ్చుకోవడానికే కృషి చేస్తున్నాను.

**అందం విషయంలో టీనేజర్లకు మీరిచ్చే సలహా?**

ఫ్యాషన్ పేరుతో కనపడిన ప్రతీ కొత్త వెరైటీని ట్రై చేయడం మంచిది కాదు. ఎవరైనా సరే ముందు వారి శరీరాకృతిని దృష్టిలో పెట్టుకునే ఫ్యాషన్‌ని ఫాలో అవ్వాలి. అందం కేవలం ముఖాకృతిలో మాత్రమే ఉండదు. అందంగా కనపడడానికి చాలా విషయాలు దోహదం చేస్తాయి. మంచి ఆహారం, క్రమం తప్పకుండా వ్యాయామం చేయడం కూడా ముఖ్యమే! ఈ రెండూ పాటించకుండా కేవలం మేకప్ మీదా, సౌందర్య సాధనాల మీదా ఆధారపడితే అందంగా కనపడరు. బయట మార్కెట్లో దొరికే సౌందర్య సాధనాలు ఉపయోగించడం కన్నా, ఇంట్లో సహజసిద్ధంగా లభించేవి ఉపయోగిస్తే మంచిది.

**మీరు కూడా ఇవే ఫాలో అవుతారా?**

తెర మీద నేను చెప్పినవి చేయడం కష్టం. నిజజీవితంలో మాత్రం నేను చెప్పినవే ఫాలో అవుతుంటాను. ఒక్క మేకప్ అనే కాదు, డ్రెస్ విషయంలో కూడా అంతే! నా శరీరానికి నప్పేవి, మోడ్రన్ అవుట్ ఫిట్‌లు ఎంచుకుంటాను. రకరకాల కాంబినేషన్లు ట్రై చేయడం నాకు చాలా ఇష్టం. షూస్, ఆభరణాలు ఇలా అన్ని విషయాల్లో వెరైటీని ఇష్టపడతాను. అలాగని నాకు నప్పని వాటి జోలికి పోను.

—చిన్ని

